కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణ

# సరిహద్దు యుద్ధపర్వం

(తృతీయ సంపుటి - ఎ)

డి.వి.సుబ్బారావు

క్రాంతిరేఖ ప్రచురణలు

చిలువూరు - 522 332. గుంటూరు జిల్లా. ఫోన్: 08644 - 85109.

COMMUNISTULA IKYA SANGHATANA ANVESHANA
**SARIHADDU YUDDA PARVAM**

ప్రచురణ నెం : 5

ప్రచురణ : జనవరి, 2001.



వెల : రు. **40-00**

డి.టి.పి. : స్పందన పబ్లికేషన్స్, విజయవాడ-2.

ముద్రణ : యుగంధర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ-3.

ప్రతులకు :

స్పందన పబ్లికేషన్స్, మ్యూజియం రోడ్,
విజయవాడ-2, ఫోన్:434266.
ప్రజాశక్తి బుక్ హౌస్ అన్ని బ్రాంచిలలోను.
విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని బ్రాంచిలలోను.
నవోదయ బుక్ షాప్, విజయవాడ.
మైత్రి బుక్ హౌస్, విజయవాడ.
డి.వి. సుబ్బారావు, చిలువూరు - 522 332. ఫోన్ : 85109

# తొలిపలుకులు

భారత - చైనాలకు హుయాన్ సాంగ్ నాటి నుండి డాక్టర్ కోట్నీస్ వరకు 2500 సంవత్సరాలు స్నేహ, శాంతి, సహకార, సోదర సంబంధాల చరిత్ర ఉంది.

భారత దేశం సుదీర్ఘకాలం బ్రిటీష్, ఫ్రెంచ్, జర్మన్ వలస సామ్రాజ్యవాదాల బానిసత్వంలో మ్రగ్గి 1947లో స్వతంత్ర దేశంగా అవతరించింది. భారతదేశానికి స్వతంత్ర, రాజకీయ, విదేశాంగ విధానాల జ్ఞాపికలు, వారసత్వం లేదు. బ్రిటీష్ ఇండియా కుటిల రాజకీయ, వలస జ్ఞాపికలున్నాయి.

చైనా, అనేక ప్రపంచ సామ్రాజ్యవాద దేశాల దోపిడీకి "ఆటస్థలంగా" నామ మాత్ర స్వతంత్ర దేశంగా వుండి 1949లో సోషలిస్టు ప్రజా రిపబ్లిక్‌గా అవతరించింది. ప్రపంచంలో అత్యంత జనాభాకలది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం శతాబ్దాలకొలది భారత విదేశీ సంబంధాలను సామ్రాజ్య విస్తరణ, వ్యాపార విస్తరణ, సైనిక శక్తితోను, నల్లమందు దిగుమతిని చైనా నెత్తిన బలవంతాన రుద్దింది. చైనా కేంద్ర ప్రభుత్వానికి దూరంగా ఉన్న టిబెట్, హిమాలయ ప్రాంతాలకు నల్లమందు ఎగుమతితోపాటు, తన రాజకీయ ప్రాబల్యాన్ని విస్తరించింది.

భారత జాతీయ కాంగ్రెస్, చైనా జాతీయ కొమిటాంగులమధ్య రాజకీయాలు స్నేహ, సహకార, సౌభ్రాతృత్వ సత్సంబంధాలుగ అభివృద్ధి చెందసాగాయి.

చైనాపై జపాన్ దండయాత్ర సైనిక చర్యలు, దురాక్రమణలు కొనసాగుతున్నప్పుడు 1939లో నెహ్రూ చైనాను సందర్శించి వచ్చిన తర్వాత, డా॥ కోట్నీస్ నాయకత్వంలో చైనా ఎర్రసైన్యానికి యుద్ధరంగంలో వైద్యసహాయాన్ని అందించుటకు "వైద్య సహాయ" బృందాన్ని పంపించారు. చైనా సందర్శనకై నెహ్రూ, చాంగైషేక్, అయన సతీయణిలచే ఆహ్వానించబడ్డారు. చైనా ఎర్రసైన్య నాయకుడు మావో నెహ్రూ ఆత్మకథను చైనా భాషలో ప్రచురించారు.

చైనా భారతదేశాన్ని విమర్శనా దాడికి గురిచేస్తున్నా భారత దేశం చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని డిసెంబరు 1949లోనే గుర్తించుటయేకాక, ఆసియా దేశాలు గుర్తించుటకు తోడ్పడుతూ, 1950లోనే చైనాతో విదేశాంగ రాయబార పరస్పర సహకార సంబంధాలు నెలకొల్పింది. ఐక్యరాజ్యసమితిలో చైనా సోషలిస్టు దేశసభ్యత్వాన్ని పునరుద్ధరించాలని తీర్మానాన్ని ప్రతిపాదించి, తృతీయ ప్రపంచ దేశాలను సమీకరించి, భారత దేశం తీవ్ర ప్రయత్నాలు చేసింది.

భారత దేశం, చైనాలు శాంతి, స్వాతంత్ర్యం, అభివృద్ధి విధానాలను, యుద్ధం ప్రపంచ వినాశనానికి దారి తీస్తుందని విశ్వసించి, 1954లో "హిందీ - చినీ భాయి భాయి" అనే విధానాన్ని చేపట్టి, మరింత స్నేహ, సహకార, సౌభ్రాతృత్వాలను పెంపొందించాయి. ఇండియా - చైనాల "పంచశీల" వొడంబడిక ప్రపంచ రాజకీయాలలో నూతన సృజనాత్మక అంశాన్ని ప్రవేశపెట్టింది. బ్రిటీష్ సామ్రాజ్యవాదం వలస విధానంలో భాగంగా, హిమాలయపర్వత ప్రాంతాల దేశాలలో తన విస్తరణ విధానంలో "కుట్రలు, కుతంత్రాలు, ఫోర్జరీ పురాతన పత్రాలు సృష్టించి, చారిత్రిక ద్రోహం చేసింది. నెహ్రూ ప్రభుత్వం, వారసత్వంగా లభించిన భారత బ్యూరాక్రటిక్ సైనిక, పాలక, నిరంకుశ యంత్రాంగం, సామ్రాజ్యవాద చారిత్రిక

పత్రాలను నమ్మి, కుటిల కుట్రలను, ఫోర్జరీ పత్రాలను ఛేదించుటలో విఫలులై ప్రభుత్వాన్ని, విదేశాంగ, రక్షణ శాఖలను తప్పుత్రోవ పట్టించి, సరిహద్దు యుద్ధానికి కారకులయ్యారు.

భారత - టిబెట్‌ల మధ్య, టిబెట్ చైనాలో భాగంగా గుర్తించుతూ ఏప్రిల్ 1954లో వొడంబడిక జరిగింది. భారత సరిహద్దులపై 1950లోనే భారత ప్రధాని స్పష్టమైన అధికార ప్రకటనకావించి ఉన్నప్పటికి, చైనా ప్రభుత్వంపై వొడంబడిక కాలంలో సరిహద్దు సమస్యలను లేవనెత్తక పోగా భారతదేశ ప్రాదేశికత్వాన్ని, సార్వభౌమాధికారాన్ని గౌరవించగలనని వాగ్దానం చేసింది. భారత - చైనా ప్రధానులు జూన్ 1954లో పంచశీల సూత్రాలను పునరుద్ఘాటించుతూ ఢిల్లీలో సంయుక్త ప్రకటన చేశారు.

స్వతంత్రదేశాలుగా బంగ్లాదేశ్, భూటాన్‌లు అవతరించుట, ఆఫ్ఘనిస్థాన్, కంబోడియాల రాజకీయ పరిణామాలు ఆసియా రాజకీయాలలో నూతన నిర్ణయాత్మక అంశాలను చేర్చాయి. సరిహద్దు దేశమైన సిక్కిం భారత దేవంలో విలీనమైంది. పోఖ్రాన్‌లో భారత దేశం 1974లో అణుబాంబు ప్రయోగం విజయవంతంగా జరిపింది. చైనా సాంస్కృతిక విప్లవ సంక్షోభం నుండి బయట పడింది.

సామ్రాజ్యవాద వ్యతిరేక 1960 దశకంలో ఆసియా దేశాల విముక్తి పోరాటంలో 1950 దశకంలోద్వై ధృవ ప్రపంచ రాజకీయాలలో అమెరికా వెనుకడుగు ప్రారంభమైనా, 1962 భారత-చైనా సరిహద్దు యుద్ధ ప్రభావం వెన్నాడుతున్నా నైరుతీ ఆసియా రాజకీయాలను నూతనపోకడలకు దారితీయుట, చైనా మద్దతుతో పాకిస్తాన్ అణుకార్యక్రమంలో పురోగమించుట జరిగింది. ప్రపంచ ద్వై ధృవ రాజకీయాలు తమ సాంప్రదాయ శక్తిని కోల్పోయాయి. ఫలితంగా 1993,1996 ఒప్పొందాలతో వాస్తవాధీన రేఖ ప్రశాంతంగా వుంది. భారత, చైనాలు తమ చారిత్రిక సరిహద్దుల పునరాలోచనలు చేస్తున్నవి. చైనా ఆక్రమిత ప్రాంతంలోని కొంత ప్రాంతాన్ని పాకిస్తాన్‌కు అన్యాక్రాంతం చేయు వొప్పందంతో సమస్య జటిలమైంది. చైనా తమవని చెప్పతున్న అరుణాచల్, సిక్కిం ప్రాంతాలకు భారత దేశం తమ పాలనా యంత్రాంగాన్ని విస్తరింప చేయుటకూడా సమస్యను జటిలంచేసింది. ఇట్టి అంశాలను పరిణితి పొందిన రాయబార సంప్రదింపులు, చర్చల ద్వారానే పరిష్కారమౌతాయి.

ప్రధాని రాజీవ్ గాంధీ 1988లో జరిపిన చైనా సందర్శన, పర్యటన రెండు దేశాల సంబంధాలలో నూతన మలుపు , విశేషాంశాలను తెచ్చింది. ఆచరణలోనే గణనీయమైన మార్పులకు గురి అయినట్లు కన్పడుతున్నది. పాకిస్తాన్ సెనేట్‌లో చైనా ప్రెసిడెంట్ జెమిన్ 1996లో చేసిన ప్రసంగంలో ఆ మార్పే ప్రతిబింభించింది. కాశ్మీర్ సమస్యను ద్వైపాక్షిక సంభాషణలు, సంప్రదింపులలో పరిష్కరించుకొనాలని, అంతర్జాతీయ వేదికల ద్వారా కాదని సెనేట్‌లో జెమిన్ స్పష్టం చేశారు. ఇటీవల భారతదేశం, పాకిస్తానులు రెండూ అణుశక్తి ప్రయోగాలు చేసినప్పుడు చైనా స్పందన యిరు పక్షాలయెడల ఒకే విధంగా ఉంది. రెండు దేశాలు లాహూరు అవగాహనతో పరస్పర "బస్సు ప్రయాణాలు ప్రారంభించుటకు" చైనా హర్షాన్ని వెలిబుచ్చింది. అదే విధంగా కార్గిల్ సంఘర్షణలు విరమించాలని, వాస్తవాధీన రేఖను యిరు పక్షాలు గౌరవించాలని కోరింది. "సార్క్"కు పూర్తి సహకారాన్ని, మద్దతును చైనా ప్రకటించింది.

సోవియట్ యూనియన్, తూర్పు యూరప్‌లోని సోషలిజం కుప్పకూలి పోవటంతో,

అంతర్జాతీయ రాజకీయాలలో అమెరికా ఏక ధృవ రాజకీయ, ఆర్థికాధిక్యత పెరిగి పోయింది. రాబోయేది అమెరికా సహస్రాబ్ధిగా గుత్తప్రపంచ సామ్రాజ్యవాదం ప్రవర్తించసాగింది. చైనా మార్గంలో సోషలిజం అనే విధానాన్ని చేబట్టి అనేక ఆర్థిక, రాజకీయ, సామాజిక సంస్కరణలు ద్వారా సోషలిజాన్ని సుస్థిరం చేయసాగింది. నూతన శతాబ్ధిలో స్నేహ, సహకార, మైత్రీ సంబంధాలను మరింతగా పెంపొందించ వలసి ఉంది. పొరుగు దేశాల స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమాధికారాన్ని మరింతగా గౌరవించుతూ స్నేహ, సహకార, మైత్రీ సంబంధాలను పెంపొందించుకొనాలి. నేపాల్ రక్షణ విషయమై ఏకపక్షంగా కాక 1950 దశకంలో నెహ్రూ అనుసరించిన విధానాలను చేపట్టాలి.

నూతన శతాబ్ధిలో భారత-చైనాల "సాధారణ సత్సంబంధాలను పునరుద్ధరించు లక్ష్యంతో ప్రధాని పి.వి. నరశింహారావు 1993లో చైనాను సందర్శించుట, ప్రతిగా చైనా అధ్యక్షుడు జియాంగ్ జెమిన్ 1996లో భారతదేశ యాత్రలతో పరస్పర విశ్వాసం పెంపొంచుకొనుట, వాస్తవాధీన రేఖ సరిహద్దులలో శాంతిని కొనసాగించుట, త్వరితంగా వ్యాపార, ఆర్థిక సహకారం పరస్పరం పెంపొందించుకొనుట అనే రెండు నొప్పందాలపై సంతకాలు జరిగాయి.

భారతదేశం భూగర్భ అణుశక్తి ప్రయోగాలను మే 1998లో జరిపింది. ప్రతిగా పాకిస్తాన్ అట్టి ప్రయోగాలనే జరిపింది. భారత ప్రధాని వాజ్‌పాయ్ జి. 8, రాజ్యాధినేతలకు, చైనా "ఆటంప్రమాదం" నుండి రక్షణకై ఆటంప్రయోగ టెస్టులు జరిగాయని లేఖలు వ్రాసారు. భారతరక్షణ మంత్రి ఫెర్నాండేజ్ "చైనా ప్రధమ శత్రువు" గా పేర్కొనుట, రెండు దేశాల మధ్య అభివృద్ధి చెందుతున్న సత్సం బంధాలలో దురదృష్టకర అంశమైంది. జూన్ 1999లో విదేశాంగ మంత్రి జస్వంత సింగు పెకింగు పర్యటన, చైనా విదేశాంగ మంత్రితో సంప్రదింపులు ద్వైపాక్షిక సంబంధాలలో యేర్పడిన అవాంఛనీయతను సరళీకృతం చేయుటకు తోడ్పడింది. చైనా విదేశాంగ మంత్రి టాంగ్ జియాంగ్యున్ "భారత విదేశాంగ మంత్రి పర్యటన ద్వైపాక్షిక సంబంధాల అభివృద్ధికి తోడ్పడిందనుట" దానినే స్పష్టం చేసింది. అంతేగాక, చైనా-భారత సత్యంబంధాల అభివృద్ధికి మౌలిక పునాదియైన పంచశిల సూత్రాలను పునరుద్ధరించాలన్నారు. చైనా అధ్యక్షునితో జస్వంతసింగు పంచశిల సూత్రాలపై విశ్వాసాన్ని ప్రకటించి, ద్వైపాక్షిక సత్సంబంధాలను పెంపొందించుటకు సంసిద్ధతను తెలిపారు. కొసావో విషయం ప్రస్తావించుతు పంచశిల సూత్రాలే పరిష్కార మార్గమని తెలిపారు.

ప్రపంచ యుద్ధానంతర శీతల యుద్ధ వాతావరణంలోను, నేటి పెట్టుబడి ప్రపంచీకరణ, అమెరికా ఏకదృవ రాజకీయ నిరకుంశ దోరణులలో పంచశిల సూత్రాల ఆచరణావ్యకత ఎంతగానో కన్పడుతున్నది. జాతీయ, రాజకీయాలలో ఆటు-పోటులకు తాత్కాలిక ఉగిసలాటలకు ఆచరణలో నలుగుతున్నా పంచశిల సూత్రాలే, భారత-చైనా సరిహద్దు సంఘర్షణలకు వెలుగు దివ్వెలు కాగలవు. నూతన సహస్రాబ్ధి "హిందీ-చినీ భాయి భాయి" అనే పూర్వచరిత్రను తిరిగి ఆవిష్కరిస్తుందని "సరిహద్దు యుద్ధపర్వాన్ని" మీముందు వుంచుతున్నాను.

అక్టోబరు 2000. — డి.వి. సుబ్బారావు

# విషయసూచిక

# సరిహద్దు యుద్ధపర్వం

సోషలిజానికివెళ్ళేమార్గం ఎలావుంటుందో, చివరి వివరాలతో సహా, మార్క్సుగాని, మార్క్సిస్టులుగాని ముందుగానే చూడగలిగారని మనం యెప్పుడూ చెప్పము. మనకు తెలిసిందల్లా, ఈ మార్గం ఎటువైపు పయనిస్తున్నది, ఏవర్గశక్తులు ఈత్రోవన నడుస్తున్నాయి అని మాత్రమే. "ఆచరణాత్మకమూ, నిర్దిష్టమూ అయిన వివరాలన్నీ లక్షలాది ప్రజానీకం అనుభవం ద్వారానే వెల్లడౌతాయి", రష్యాలో విప్లవకాలంలో లెనిన్ మాటలు (లెనిన్ కలెక్టెడ్ వర్క్స్ వా.25పే. 281).

## 1

## అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులు

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధిచెంది, వలస విముక్తిఉద్యమాలకు అండ అగుటతో, ప్రపంచ సామ్రాజ్య వాదవలస విధాన పతన వేగోద్ధృతినొందుట, పెట్టుబడిదారి దేశాలలోవర్గపోరాటాలు తీవ్రమగుటతో, సోషలిస్టు వ్యవస్థ ఆధిక్యత, నిర్ణయాత్మకపాత్ర ఫలితంగా, సోషలిజపు అఖండవిజయం తథ్యమని, నాడు సామ్రాజ్యవాదశక్తులు మరో ప్రపంచయుద్ధాన్ని ప్రారంభిచగల శక్తి నశించిందని, ఒక్కమాటలో పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి సహజ పరివర్తన లేక పరిణామయుగంగా, రెండువైరుధ్య సమాజాల అంతిమ పోరాటయుగంగా నాటి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ అవగాహనగా వుందని గత పర్వంలో తెలుసుకొన్నాము.

సోషలిజానికి సామ్రాజ్యవాదానికి గల వైరుధ్యమే మౌలిక వైరుధ్యమని అంతర్జాతీయ ప్రభుత్వగుత్తపెట్టుబడి సంస్థలు సంలీనంతో సంక్షోభాన్ని, మార్కెట్టు సమస్యను పరిష్కరించకపోగా అది ప్రపంచ మార్కెట్టును మరోరూపంలో తిరిగి విభజించుటయేకాక అవే తీవ్రసంఘర్షణలకు స్థానాలయ్యాయి. అణు ఆయుధాలు సైతం ఈ పతనాన్నుండి పెట్టుబడిదారి విధానాన్ని కాపాడజాలవని నాటి అవగాహన. సామ్రాజ్యవాదులు వలనదోపిడీని నూతన రూపాలలో కొనసాగించుటకు అన్ని ఆయుధాలను వినియోగిస్తున్నారు. అయినా వలసవిముక్తి విప్లవపోరాటాలు సామ్రాజ్యవాదంపై చావుదెబ్బలు కొట్టుచున్నవని తెలుసుకొన్నాము.

శాంతియుతసహజీవనం, శాంతియుతపరివర్తన, శాంతియుత పోటీలలో పెట్టుబడిదారివ్యవస్థ ఘోరపరాజయాన్ని, నైతికంగా ప్రపంచ ప్రజలదృష్టిలో పొందింది. ఆమేరకు సోషలిస్టు వ్యవస్థ ఆధిక్యతగలదైనది అయింది. సోషలిస్టు దేశాలలో గుణాత్మక

మార్పులతో సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధి క్రమంలో పరిపక్వతకు చేరుతుంది.

సామ్రాజ్యవాదుల మద్దతుతో దేశీయ అభివృద్ధి నిరోధకశక్తుల తిరుగుబాటు హంగరీ, పోలెండు, తూర్పుజర్మనీలలో కుట్రలు, వర్గపోరాటం తీవ్రరూపంలో జరుగుచున్నదనుట స్పష్టము. సామ్రాజ్యవాదపాలక వర్గాలు సోషలిస్టు దేశాలలో విద్రోహచర్యలను జాతీయ విధానస్థాయికి తీసుకెళ్ళాయి. సామ్రాజ్యవాదం వున్నంతవరకు దురాక్రమణ వుంటుంది. రక్షణను బలపరచుకొని, సోషలిస్టుదేశాలు సర్వసన్నద్ధంగా వుండవలసివుంది.

పెట్టుబడిదారి ప్రపంచంలో ఉత్పత్తి, వ్యాపారంలో అమెరికా ఆధిక్యతకోల్పోయి, రెండవ ప్రపంచయుద్ధపూర్వపు స్థితికి దిగజారింది. బెల్జియం, హాలెండులవలె బ్రిటన్, ఫ్రాన్సులు వలసలను శాశ్వతంగా కోల్పోయాయి. ప్రపంచ పారిశ్రామిక స్థాయిలో యుద్ధపూర్వస్థితికి చేరజాలక పోయాయి. యుద్ధంలో పతనమైన జర్మనీ,జపాన్‌లు పారిశ్రామిక వుత్పత్తులలో పురోగమించి 1937 యుద్ధపూర్వపు అత్యున్నతదశకు చేరుట గణనీయమైన మార్పు. పశ్చిమ జర్మనీ పారిశ్రామిక వుత్పత్తులలో బ్రిటన్ స్థాయికి ఎదిగి, ఎగుమతులలో అమెరికా తరువాత రెండవస్థానం చేరింది. కారణం యుద్ధానంతరం అమెరికన్ గుత్త పెట్టుబడి వర్గాలు జర్మనీ, జపాన్‌లలో పెద్దమొత్తాలు పెట్టుబడి పెట్టారు.

యుద్ధానికి పూర్వం సామ్రాజ్యవాద దేశాలలో గలవైరుధ్యాలు తిరిగి తలెత్తుట, కొత్తవి పుట్టించుట జరిగింది. పశ్చిమ యూరప్‌లో ఆధిక్యతకై బ్రిటన్, జర్మనీల మధ్య పోరాటం తీవ్రమగుట, ఫ్రాన్స్, బ్రిటన్‌పై పోరాటంలో నిన్నటి శత్రువైన జర్మనీ సహాయానికి ప్రయత్నిస్తున్నది. ఈ అసహజమైత్రి సహకారం ఫ్రాన్స్‌కు ఆశించిన బలాన్ని చేకూర్చుటలేదు.

అంతర్జాతీయ ఉద్రిక్తత, సామ్రాజ్యవాద శక్తులు సైనిక కూటములను సోషలిస్టు ప్రమాదమన్నపేరుతో యేర్పరచుటకు గల సౌలభ్యత, ఉద్రిక్తత తగ్గినచో లభించదని భయపడుతున్నారు. యుద్ధం ముంచుకొస్తే, జర్మన్ రక్తంతో మూల్యం చెల్లిద్దామనుకొంటున్నారు. ఈవిధానం జర్మనీ ఆర్థిక విధానాన్ని బలహీన పరుస్తుందని, ప్రపంచ మార్కెట్టులో జర్మనీ పోటి బలహీనపడుతుందని ఆశిస్తున్నారు.

ప్రపంచ చరిత్రలో 1960 దశకం ఆసియా, ఆఫ్రికా,లాటిన్ అమెరికాలలోని సామ్రాజ్యవాద వలసవిధానం శిథిలమగుటగా లిఖించబడుతుంది.

అమెరికా చైనాకు చెందిన తైవాన్ దీవిని, జపాన్‌కు చెందిన ఒకినావా దీవిని, క్యూబాలో గౌంటనామా సైనిక కేంద్రాలను తన దురాక్రమణలో వుంచుకొన్నది. రైతులు భూమిని పొందగలుగుట, అమెరికా గుత్తసంస్థలను జాతీయం చేయుటతో కార్మికులు అమెరికా దురాక్రమణకు వ్యతిరేకంగా ఐక్యంగా నిలబడ్డారు. కాస్ట్రోనాయకత్వంలో ధైర్యసాహసాలతో అమెరికన్ చొరబాటు దారులనే "బేఆఫ్ పిగ్స్"లో అఘాతంలో అంతం చేయగలిగారు. ప్రజలు స్వతంత్రానికి, ప్రజాస్వామ్యానికి, సోషలిజం కొరకు జరిపే ఏపోరాటాన్నయినా అమెరికన్ సామ్రాజ్యవాదం రక్తమయం చేయుటకు సిద్ధమగుచున్నది. ఇరాన్, పాకిస్తాన్,

కాంగో, వియత్నాంలలో అమెరికా అనుసరిస్తున్న విధానమిదే. ఈ విధానం యెక్కడకు దారితీస్తుందో పాకిస్తాన్ బడ్జెట్టులో యుద్ధావసరాలకు మూడింట రెండు వంతులు కేటాయింపును చూస్తే తెలుస్తుంది. భారత-చైనా సంబంధాలలో 1960 దశకం మలుపుగా నెంచవచ్చు. చైనా ప్రజారిపబ్లిక్, చైనా కమ్యూనిస్టుపార్టీ 1960 నుండి జాతీయ తత్వప్రభావాలకు లోనై శాంతి విదేశాంగ విధానం, అంతర్జాతీయ కార్మికవర్గ తత్వసూత్రాలను విడనాడి, భారత, రష్యాతదితర సోషలిస్టు దేశాలతో స్నేహసంబంధాలు విడనాడి, వ్యతిరేకంగా రాజకీయ పోరాటంచేబట్టుట స్పష్టం. చైనా అంతర్గతంగా "ప్రజాకమ్యూనులు" "పెద్దగా దూకుట" విధానాల వైఫల్యం ఫలితంగా, సోషలిస్టువ్యతిరేక శక్తుల ప్రతిదాడికి అవకాశాలేర్పడి, అంతర్గత పోరాటాలకు, ఆర్థిక సంక్షోభానికి గురైనందున వర్గపోరాటం తీవ్రమైంది.

చైనా పారిశ్రామిక, వ్యవసాయ వుత్పత్తులు పడిపోయి ఆర్థిక విధానం పూర్తిగావిచ్ఛిన్నమైంది. పారిశ్రామికవుత్పత్తి 1959తో పోల్చితే 1962 లో సగానికి, ఉక్కు46, విద్యుచ్ఛక్తి 13, బొగ్గు 48, ఇనుప ఖనిజం 66, సిమెంటు 40, విద్యుచ్ఛక్తి యంత్రాలు 75, లేత్‌మిషన్లు 69, నూలుబట్టలు 50, ఖాద్యతైలాలు 30, పంచదార 12శాతాలకు పడిపోయాయి. నిపుణల అంచనాల ప్రకారం ప్రధాన పారిశ్రామిక వుత్పత్తులు మొత్తంగా 33, వ్యవసాయ వుత్పత్తులు 25-30 శాతం పడిపోయాయి.

"పెరటిబ్లాస్టు ఫర్నెస్"లు, "పెద్దగా దూకుట" కాలంలో నిర్మాణం చేసిన పరిశ్రమలన్నీ మూతబడ్డాయి, పరిశ్రమలలో నూతనంగా పెట్టుబడి పెట్టుట ఆగిపోయింది. చైనా కమ్యూనిస్టు నాయకత్వపు "సత్వర కమ్యూనిజం నిర్మాణం" 'నగరాలలో కమ్యూనుల నిర్మాణం' నీరుగారపోయింది. "గ్రామీణ కమ్యూనులు" సాధారణ వ్యవసాయ సహకార సంఘాలుగా పునర్నిర్మాణం చేయబడి , ఉచిత భోజనం రద్దుచేయబడి, బృందాలై కుటుంబ వ్యవసాయం చిన్న ప్లాటులు తిరిగి యివ్వబడి, భౌతిక ప్రోత్సాహకాల సూత్రం పరిమితంగా పునరుద్ధరించబడింది. "పెద్దగా దూకుట" విఫలమగుటతో ఆహార, వినిమయవస్తువుల సరఫరా మునుపెన్నడూ లేనంతగా తగ్గిపోయి, కొరత యేర్పడింది. రేషనింగు ప్రవేశపెట్టబడింది. ఈ పెద్దపొరపాటులను, తప్పుడు విధానాలను సరిదిద్దు కొనునపుడు నాయకత్వం వాస్తవాన్ని ప్రజలకు వివరించి చెప్పలేదు. "మూడు ఎర్రబేనర్లు" విధానం ఒక్కటే సరియైన సత్ఫలితాలనిచ్చే విధానమని తిరిగి పునచ్ఛరణ చేసారు. ఈ విధానం గత దశాబ్దకాలంగా రుజువైన ఆర్థిక విధానాలను 8వ పార్టీ కాంగ్రెసు నిర్ణయాలను త్రోసిబుచ్చి"కమ్యూనిజంలోనికిదూకుట", "మూడుసంవత్సరాలకు కష్టపడుట పదివేల సంవత్సరాల ఆనందమయ జీవితం" అనే నినాదాన్ని సాధారణ ఆర్థిక పంథాను, "పెద్దగా దూకుట", అత్యధిక వేగంగా అభివృద్ధి "ప్రజాకమ్యూనులు" అనే "మూడు ఎర్ర బేనర్లు" రాజకీయార్థిక విధానం చేబట్టారు. "కమ్యూనిజపుగమ్యం మన దేశంలో ఏమాత్రం సుదూర భవిష్యత్తులోకాదు" అంటూ"ప్రజాకమ్యూనుల నిర్మాణం గురించి" అనే ఆగస్టు 1959 లోని చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రసమితి తీర్మానంపేర్కొన్నది. కేంద్ర సమితిలో కొందరు

దీనిని వ్యతిరేకాబినా, "పెద్దగాదూకుట" అనే విధానాన్ని కొనసాగించింది వ్యతిరేకించిన నాయకులు ముఖ్యంగా పెంగ్ టెహుఈ, చాంగ్ వెన్ టేన్‌లు, అనేక మంది రాష్ట్రకమిటీలనాయకులు కేంద్రనాయక త్వీపు ఆగ్రహానికి గురయ్యారు. సాంస్కృతి విప్లవకాలంలో హింసలకు గురయ్యారు.

"పెద్దగా దూకుట" అనే విధానం "వేగంగాకమ్యూనిజానికి పురోగమించుట" నిస్సందేహంగా చైనా కమ్యూనిస్టునాయకత్వపు "అతివాద" "జాతీయతత్వనాయకత్వ స్వీయమానసికవాంచ"ను సోషలిస్టువ్యవస్థ, జాతీయ విముక్తి ఉద్యమాలలో బలమైన పెద్ద రాజ్యం పోకడలకు భూమికను యేర్పరచింది. చైనా పరిధిలోనే గాక చైనా నాయకత్వం "పెద్దగా దూకుట" అనే విధానంలో తమ పిడివాదాన్ని అన్ని సోషలిస్టు దేశాలు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంపై రుద్దుటకు ప్రయత్నించారు. ఈ విధానం మాస్కో1957 ప్రకటన, సోషలిస్టు విప్లవం,సోషలిస్టు నిర్మాణ సూత్రాలను, సోషలిస్టు విధానాన్ని అనుసరించు అన్ని దేశాల లక్షణాలను త్రోసిబుచ్చుతుంది. ప్రజల జీవన ప్రమాణాలను పెంచుటను నిర్లక్ష్యంచేస్తుంది. ఈ "పెద్దగా దూకుట" అనేది "పెరటిఉక్కు పరిశ్రమ" సాంకేతికపరిజ్ఞానంతో సాధించుటకు ప్రయత్నించుట, మాస్కోప్రకటనను త్రోసిబుచ్చుటఅగుతుంది.

అదేకాలంలో "మావో ఆలోచనా విధానం" చైనాలోనే గాక ప్రపంచ మంతట అనుసరణీయమనే ప్రచారం సాగింది. చైనా సిద్ధాంత వేత్తలు గతంలోని "మావోఆలోచనా విధానాన్ని" వదలివేసి, "మార్క్సిజం-లెనినిజం విశ్వసూత్రాలకు చైనా వాస్తవ పరిస్థితులకు అన్వయింప చేయుటగా" చెప్పసాగారు. చైనా నాయకత్వం గతంలో "మార్క్సిజం యొక్క యూరపు స్వరూపానికి చైనా రూపాన్నిచ్చుటగా అదే చైనా కమ్యూనిజం"గా చెప్పిన నిర్వచనం నేడు సరిపోదని అంటున్నారు. మార్క్సిజానికి చైనా దుస్తులు వేయటానికి చైనా నాయకత్వం చేసిన ప్రయత్నం "మావోఆలోచనా విధానానికి చైనా దుస్తులు నేడు సరిపోలేదని "సోషలిస్టు విప్లవాల, నిర్మాణయుగంలోని మార్క్సిజం- లెనినిజం-మావోఆలోచనా విధానమని "నూతన నిర్వచనాన్ని యిచ్చి "మావోఆలోచనావిధానం, కార్మికవర్గ సోషలిస్టు విప్లవయుగంలోని మార్క్సిజం-లెనినిజంలను బహుముఖంగా అభివృద్ధి చేసిందని" చెప్ప మొదలుపెట్టారు. మార్క్సిజం-లెనినిజం ప్రవక్తల రచనలను వాస్తవంగా నిషేధించి, చైనాలో సిద్ధాంతవివేచనం "మావోఆలోచనా విధానమని " ప్రచారం చేసారు. మావోరచనల నాలుగవ సంపుటి 1960లో ప్రచురణానంతరం ఈ ప్రచారం ముమ్మరంగా సాగింది. "పెద్దగా దుముకుట", "కమ్యూనులస్థాపన", "కమ్యూనిజంలోనికి త్వరితంగా పురోగమనం" అనువిధానాలు ఈక్రింది చైనా విదేశాంగ అంచనాలుగా ప్రతిబింబించాయి.[1]

సోషలిస్టు ప్రపంచ శిబిరం నుండి సోవియట్ యూనియన్‌ను వేరుపరచి, వీలైనన్ని సోషలిస్టు దేశాల ఆర్థిక, రాజకీయ శక్తియుక్తుల నుపయోగించి బలోపేతమైన చైనాను నిర్మించి, జాతీయ గవ్యూలను చేరుట, జాతీయ విముక్తి ఉద్యమాలను ప్రపంచకార్మికోద్యమానికి సోవియట్ యూనియన్‌ను దూరం చేసి, ఆఫ్రో-ఏసియన్

1. బోరిసోవ్, ఒ.బి: కొలస్కోవ్,బి.టి(1975) సినో- సోవియట్ రిలేషన్స్. మాస్కోపబ్లికేషన్ పే.169-70లలోని ఉదహరింపు

దేశాలకూటమి నేర్పరిచి, చైనా నాయకత్వాన్ని సామ్రాజ్యవాదమాజీవలసలపై ప్రతిష్టించుట, సోవియట్‌యూనియన్‌ను ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమంనుండి వేరు చేసి, సౌహార్ద పార్టీలలో సోవియట్‌పార్టీ ప్రతిష్టను నీరుగార్చి, చైనా సైద్ధాంతిక రాజకీయ వేదికను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణ పంథాగాచేసి, దానిని చైనా అగ్రరాజ్యశక్తి వ్యూహంలో ఆయుధంగా చేయు ప్రయత్నం యిమిడి వున్నది. శాంతి, సహజీవన విధానాన్ని నీరుగార్చి, అంతర్జాతీయ ఉద్రిక్తతలను పెంచి, సామ్రాజ్యవాదంతో నిర్ణయాత్మక సైనిక సంఘర్షణను చేరువకు తెచ్చుటగా చైనా విదేశాంగ విధానం వున్నది. అంతర్జాతీయకమ్యూనిస్టు పంథానుండి దూరమై, 1962లో కరేబియన్ సంక్షోభంలో ప్రపంచం అణుయుద్ధ పొలిమేరకు చేరినపుడు, చైనా అవలంభించిన విధానం నగ్నంగా సంఘర్షణను రెచ్చగొట్టుటగా స్పష్టమైంది.

ఈనేపథ్యంలోనే భారత-చైనా సరిహద్దు వివాదాన్ని అధ్యయనం చేసి, పరిశీలించవలసి వుంటుంది. దీనికి ముందు భారతదేశ ఆర్థిక, రాజకీయ, విదేశాంగ విధానాలను సంక్షిప్తంగా ప్రస్తావించుట అవసరము. ఈ కాలంలో ప్రభుత్వ పెట్టుబడి దారి విధానం, జాతీయ బుర్జువావర్గాల విశ్లేషణలపై అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం మొత్తంగా, సోవియట్ ఆర్థిక శాస్త్రవేత్తలు యన్.సెవెలీవ్, ఆర్.ఎ.ఉలియనొవస్కీ; ఎ.ఐ.లెవొకొవస్కీ, ఇ.యం. యస్.నంబూద్రిపాద్‌లు కొంత నూతన వెలుగు ప్రసరించారు. ప్రపంచ, ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో డిశెంబరు 1959లో నైరుతి ఆసియాలో ప్రభుత్వ యాజమాన్యపు సమస్యలపై గోష్టిజరిగినది.

ఉలియనొవస్కీ, భారత దేశంలో ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాభివృద్ధిని అధ్యయనంచేసి, ఒక ప్రత్యేక తరహా ప్రభుత్వ పెట్టుబడి దారి విధానంగా పేర్కొని, దాని ప్రత్యేకతలను సంగ్రహంగా ఈక్రింది విధంగాచెప్పారు.[1]

i. అంత్యంత బలహీన వ్యవసాయ, ఆర్థికాభివృద్ధిజరిగిన దేశంలో, ప్రభుత్వ పెట్టుబడి దారి విధానం అభివృద్ధి చెందుతున్నది. ప్రపంచలో రెండవ అత్యధిక జనాభా కలిగినదేశంలో, ప్రపంచసోషలిస్టు రాజ్యాలవ్యవస్థ బలపడతున్న యుగంలో జరుగుతున్నది. సామ్రాజ్యవాద వలస విధానం కూలిపోవుతు, సోషలిజానికి అనుకూలంగా, సామ్రాజ్యవాదపు-సోషలిజపుశక్తుల మద్యగల సంబందాలు మారుతున్న యుగంలోనని వివరించారు. జపాన్,జర్మనీ, రష్యాతదితర దేశాలలో 19వ శతాబ్దంలో రూపొంది, అభివృద్ధి చెందిన ప్రభుత్వ పెట్టుబడి దారీ విధానం భారతదేశంలో అభివృద్ధి చెందిన ప్రగతి శీలశక్తుల దృక్పధంలో, భారతదేశంలో ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాభివృద్ధి జరుగుచున్న అవగాహనలేనట్లు కన్పించుచున్నది.

ii. సామ్రాజ్యవాద దేశపు భౌతిక ఉత్పత్తి సాధనాలను, భారతదేశపు ప్రభుత్వపెట్టుబడిదారి విధానం, చారిత్రికవారసత్వంగా పొందింది. జాతీయ విముక్తి ఉద్యమ విజయంతో నూతన జాతీయ ప్రభుత్వపు అస్తిగా అయింది. నేడు భారత ఉత్పత్తి వునాది ప్రధానంగా ప్రభుత్వపెట్టుబడి నిర్మాణం, వివిధ ఆర్థికరంగాలలోని పరిశ్రమలను జాతీయం చేయుట

1. సెవెలీవ్, యన్: ఉలియనొవస్కీ, ఆర్.ఎ.(1962) నేషనల్ భూర్జువా అండ్ ది డెవలప్‌మెంటు ఆఫ్ స్టేటు కాపిటలిజం (ఆంగ్లంలో) పి.పి.హెచ్.పే.49--50.

ద్వారా. విస్తృతపరచబడుచున్నది.

iii. పరిగణలోని ఈ కాలంలో అత్యంత ప్రాముఖ్యమైన విషయం భారత ప్రభుత్వపెట్టుబడిదారి విధానం, సామ్రాజ్యవాద, వలసవ్యతిరేకత దానిలక్ష్యం. భారత రాజకీయ స్వాతంత్ర్య పరిరక్షణ, బలపరచుట, జాతీయ దృక్పథంలో పారిశ్రామికీకరణద్వారా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సంపాదించుట.

iv. నిన్నటి వరకు వలసగావుండి, ఆర్థిక- సాంకేతికరంగాలలో వెనుకబడివున్న దేశపు సత్వరాభివృద్ధి అవసరాల నిమిత్తం, ఆవిధంగా పెరిగింది.

v. చారిత్రికంగాకాని, పుట్టుకతోకాని. నేటి పరిస్థితులలో కాని పశ్చిమ యూరపు, అమెరికాలలోని ప్రభుత్వగుత్తపెట్టుబడిదారీ విధానం వంటిదికాదు. ఈ అభివృద్ధిదశలో అనేక జాతీయ కర్తవ్యాలను చాలా వరకు విజయవంతంగానే పరిష్కరిస్తున్నది.

vi. ప్రభుత్వం దీనిని జీవిత ఆచరణగా చేయుటకు, శాంతి విదేశాంగ విధానం, సైనిక- రాజకీయ దురాక్రమణకూటములలో చేరని విధానాన్ని చేబట్టింది.

స్థూలంగా విముక్తిచెందిన అనేక యితర దేశాలలో గూడ, సామ్రాజ్య వాదుల పరిశ్రమలను జాతీయం చేయుట ద్వారా ప్రభుత్వపెట్టుబడిదారీ విధానాభివృద్ధి, వెనుకబడిన దేశాలలో సాధారణ పంథాగా అభివృద్ధి చెందింది. ఇట్టి పరిణామం 19వశతాబ్దంలోనే జరిగిన బూర్జువా ప్రజాస్వామ్య విధానం తప్ప, ఎంతో అభివృద్ధికరమైనదిగా సోషలిస్టిక్ విధానంగా అతిగా అంచనావేసిన ప్రమాదకర చిక్కులలో పడుట జరుగుతుంది.

అంతర్జాతీయ సామ్రాజ్యవాదుల వైఖరులను కొన్నింటిని చూద్దాము. ఆర్థికంగా వెనుకబడిన దేశాలలో ప్రభుత్వ పెట్టుబడిదారి విధానం, ఆర్థికస్వాతంత్ర్యానికి పునాదిని సృష్టించుచున్నదని ఆమోదించుతున్నారు. కొన్ని దేశాలలో ప్రభుత్వరంగంలో పారిశ్రామికాభివృద్ధి జరుగుట విదేశీ గుత్తపెట్టుబడుదారులకు యిష్టంలేదు. అందుకే వారు ప్రభుత్వరంగంలో పరిశ్రమలనుగాక స్పష్టంగా ప్రవేటురంగాన్ని పోత్సహించి బలపరస్తున్నారు. కారణం అది పెట్టుబడిదారి సాధారణాభివృద్ధికి మార్గం. అమెరికా ఆర్థికవేత్త మెలన్‌బామ్ పారిశ్రామికీకరణకు సాంప్రదాయకంగా అధిక పెట్టుబడులను పెట్టువిధానాన్ని వెనుకబడిన దేశాలలో వ్యతిరేకించుతూ, సేవాసౌకర్యాలు, వినిమయవస్తోత్పత్తులలోనే పెట్టాలంటారు. పరోక్షంగా పారిశ్రామికాభివృద్ధికి పునాదులైన భారీపరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటను నిరశించు తున్నారు. బ్రిటిష్ ఆర్థిక వేత్తహాన్‌సన్ వెనుకబడిన దేశాలలో ఆర్థికాభివృద్ధిలో ప్రభుత్వపాత్ర బహుముఖ పారిశ్రామికాభివృద్ధికి చొరవనిచ్చే శక్తిగానేవుండి, తరువాత నేరుగా వుత్పత్తి విధానంలో పాత్రదారుగా, వ్యక్తియాజమాన్యంలో ఆపరిశ్రమ భాద్యతలను స్వీకరించగలశక్తి సామర్థ్యాలను సంతరించుకొనగలిగినంతవరకే వుండాలంటారు. అంటే హాన్‌సెన్ ప్రభుత్వపాత్ర కొంతపరిమితి వరకు వుండి, ప్రవేటు రంగానికి అనుకూలంగా వుండాలంటారు. మరోఆర్థికవేత్త యంగ్సన్ స్పష్టంగా ప్రభుత్వం భారీ పరిశ్రమలను చేబట్టరాదంటారు. పాకిస్తాన్, థాయిలాండ్, ఫిలిప్పైన్స్‌లలో ప్రభుత్వరంగ

పరిశ్రమలను ప్రవేటు పారిశ్రామికులకు అమ్మివేయుట జరిగింది. ఆ విధంగాపెట్టుబడిదారి విధానాన్ని బలపరచారు. వర్గపోరాటం దానికి వ్యతిరేకంగా అభివృద్ధి చెందుట ప్రారంభమైంది.

ప్రభుత్వపెట్టుబడిదారి విధానాభివృద్ధి, దేశ, విదేశీ ప్రవేటుపెట్టుబడిదారి శక్తుల ప్రభావాన్ని తగ్గించి వేస్తుంది కావున కార్మికవర్గం బలపరస్తుంది. ప్రధాన పారిశ్రామిక రంగాలలో విదేశ పెట్టుబడులపై ఆధారపడుటను తగ్గిస్తుంది. ప్రభుత్వరంగంలో భారీపారిశ్రామికాభివృద్ధి, కార్మికవర్గ విస్తృతిని, కేంద్రీకరణను ఎక్కువ చేస్తుంది. కావుననే బలపరుస్తుంది. అదేవిధంగా నగర, గ్రామీణ పెటీబూర్జువా వర్గాలు, నిరుద్యోగులకు కొంత ఉపశమనం కలుగుతుంది. భారిపారిశ్రామికాభివృద్ధి ప్రవేటు రంగంలో జరిగితే మధ్యతరగతి పారిశ్రామిక బూర్జువా వర్గాలు వారి పోటీలో నలిగిపోతారు. అందుకే వారు వ్యతిరేకించుతున్నారు. ప్రభుత్వరంగంలో జరుగుటను, అనగా ప్రభుత్వ పెట్టుబడి దారి విధానాన్ని బలపరుస్తారు.

మధ్యతరగతి పారిశ్రామిక బూర్జువావర్గం, జాతీయ దేశభక్తసాంప్రదాయవర్గాల ప్రయోజనాలను ప్రతిబింబించుచు,ప్రభుత్వరంగ పరిశ్రమలను బలపరిచే కార్మిక వర్గానికి భయపడుతువుంటుంది. ఈ వర్గసహజమైన వూగిసలాట దాని ప్రతిబింబమే. కొంతవరకు ఆవూగిసలాట ప్రభుత్వకంట్రోలు విధానకారణంగా ముఖ్యంగా విదేశీ, దేశీయ గుత్త పెట్టుబడిదారులను అదుపునందుంచినందున తగ్గిపోయింది. దేశీయ గుత్తపెట్టుబడిదారులకు సంబంధించినంత వరకు ప్రభుత్వయంత్రాంగం దానికి అనుకూలంగామార్పుచెందుటతో,తనపైకంట్రోలులను సడలింప చేసుకొనగలుగులతో పాటు, తనప్రయోజనాలను కాపాడునదిగా రూపొందించ ప్రయత్నిస్తుంది, పరిమిత విజయాలను పొందగలిగింది. ప్రభుత్వరంగలోని పరిశ్రమలను ప్రధమదశలోనే వాటిని అమ్మివేయవలసినదిగా కోరకుండా, వాటియాజమాన్యంలోనికి వ్యాపారవర్గాలకు భాగస్వామ్యం వుండాలని మాత్రమే కోరుతు తమప్రయోజనాలను, యాజమాన్యాల ద్వారా కాపాడుకొనుటయేగాక, పరోక్షప్రయోజనాలను పొందగలిగారు. అందుచేత స్టాక్ మార్కెట్‌లలో ప్రభుత్వరంగ పారిశ్రామిక షేర్లు అమ్మకంపెట్టాలని కోరుతున్నారు.

అంతేగాక గుత్తపెట్టుబడిదారీ వర్గాలు, ప్రభుత్వరంగ పరిశ్రమల పాత్రను పూర్తిగా వ్యతిరేకించక, వాటిపాత్రను గుర్తించుచూ, విదేశీగుత్త సంస్థల సహాయంతో జాతీయ బూర్జువావర్గంలో అభివృద్ధినిరోధక శక్తులను పెంపొందించుటకు ప్రయత్నిస్తున్నారు. జాతీయ బూర్జువావర్గంలో సహజంగా వున్న బలహీనతల కారణంగా విదేశీగుత్తపెట్టుబడిదారి వర్గాల చేతులలో పడిపోయే అవకాశాలున్నవి. ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాభివృద్ధి, పూర్తిజాతీయీకరణ, ముఖ్యంగా విదేశీయ గుత్తపెట్టుబడిని జాతీయం చేయుటతో జాతీయ బూర్జువా వర్గం బలపడుతుంది.

ఈ సందర్భంలో భారత జాతీయ బూర్జువా వర్గ విశ్లేషణ, దాని లక్షణాలు, ప్రత్యేకతలు,

భారత ఆర్థిక, రాజకీయ సామాజికాభివృద్ధిలో దాని పాత్రను గురించి, సవెలీవ్ అధ్యయన ముఖ్యాంశాలను తెలుసుకొందాము. వలస సామ్రాజ్యవాద పతనంతో ఒకవైపు చైనా.కొరియా, వియత్నాంలలో సంపూర్ణంగా దోపిడీ విధానం అంతరించి సోషలిస్టుమార్పులు, మరోవైపు ఇండియా, బర్మా, ఇండొనేషియాలలో సామ్రాజ్యవాదాన్ని జాతీయోద్యమాలు ఓడించి, జాతీయ బూర్జువావర్గం రాజ్యాధికారాన్ని చేబట్టి, బూర్జువా ప్రజాస్వామ్యపరిధిలో పురోగమనం ప్రారంభించినా, సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడి వర్గాలు బలమైన ఆర్థికమౌలికస్థానాలలో కొనసాగుతూనేవున్నవి. ఈ విధంగా జాతీయ బూర్జువావర్గ అభివృద్ధి, విదేశీసామ్రాజ్యవాద, ఫ్యూడలు వర్గాలతో వైరుధ్యసంబంధాలతో, సంక్లిష్ట పరిస్థితులతో, కార్మిక, కర్షక ప్రజానీకపు ప్రయోజనాలకు భిన్నంగానే జరుగుతున్నది. అయితే సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక శక్తుల పునస్సంధానం, స్వాతంత్ర్య పరిస్థితులలో జరుగుచున్నది.

మనకు స్వాతంత్ర్యం వచ్చినపుడు మొత్తం పెట్టుబడులలో 60 శాతం విదేశీయ పెట్టుబడిగావుంది. దేశ, విదేశీయ షేర్ హోల్డర్ల మొత్తం పెట్టుబడి, 1957కు 12,500 మిలియనుల రూపాయలుగ అంచనా వేయబడింది, అందులో 5,000 మిలియనులు (37-38శాతం) యేదో రూపంలో విదేశీపెట్టుబడిగా గుర్తించబడింది. దేశీయ, విదేశీయపెట్టుబడుల నిష్పత్తులలో వచ్చిన ఈ మార్పు 1953లో కీలక పరిశ్రమలలో గణనీయంగావుంది. ప్రత్తినూలు గుడ్డల మిల్లులలో 91, పంచదార పరిశ్రమలో 96, జూట్‌పరిశ్రమలో 75, బొగ్గుమైనింగులో 86,శాతాలుగ దేశీయ పెట్టుబడివుంది. విదేశీవ్యాపారంలో జాతీయ బూర్జువా వర్గభాగం 1956లో 75 శాతంగా వుంది. యుద్ధానంతరకాలంలో భారత బూర్జువావర్గం ఆర్థికంగా బలపడసాగింది. భారతదేశంలో 1958లో 400 బ్యాంకులు, 4373 శాఖలు, అందులో 16 బ్యాంకులు 70శాఖలు మాత్రమే విదేశీయులవి. భారత బ్యాంకులు 86శాతం డిపాజిట్లు, 82శాతం నిలువలు 96 శాతంపెట్టుబడులు

మన దేశంలో బడాజాతీయ బూర్జువావర్గం, గుడ్డల మిల్లులలో60, జూట్‌మిల్లులో70శాతాన్ని మించి సిమెంటు తదితర పరిశ్రమలు తన అధ్వర్యంతో కలిగివుంది. అప్పులు, ద్రవ్యచెలామణిలో 75 జాతీయ పెద్ద బ్యాంకులు 90శాతం అన్ని బ్యాంకింగు వనరులను కలిగివున్నవి.[1] మన దేశంలో పూర్వవ్యాపార, పారిశ్రామిక బూర్జువార్గంగా తాతా, బిర్లా, సంఘానియా దాల్మియాలు ప్రత్యేక ప్రముఖస్థానాన్ని కలిగి వున్నారు. స్వాతంత్ర్యానంతరం వ్యాపార ప్రపంచంలో గణనీయంగా బిర్లాలు పెరిగిపోయారు. బిర్లాలకు 1946పూర్వం 89 కంపెనీలుండగా, పది సంవత్సరాలలో 182కు అనగా రెట్టింపు పైగా పెరిగాయి. పెట్టుబడి 346 మిలియను రూపాయలకు చేరింది. అదే విధంగగా, దాల్మియా, జైన్, గోయంకా, సింఘానియా, హీరాచంద్, థాపర్ తదితర గుత్తపెట్టుబడిదారీ వర్గాలు భారత ఆర్థిక ప్రయోజనాలలో అత్యంత వేగంగా విస్తరించారు. భారత బడావ్యాపార, పారిశ్రామిక బూర్జువావర్గ ప్రత్యేక లక్షణమేమంటే, ఆర్థిక విధానంపై ఆధిక్యత, ఆధిపత్యం

*1. సవెలీవ్, యన్ (1962) నైరుతి ఆసియాదేశాలలో జాతీయ బూర్జువావర్గం. జాతీయ బూర్జువావర్గం, ప్రభుత్వపెట్టుబడిదారి విధానాభివృద్ధి - పి.పి.హెచ్. పే.5-6.*

కలిగివున్నా విదేశీ పెట్టుబడిలో నేడుకూడ అత్యంత విస్తృతంగా సహకారాన్ని నెరపుతున్నది. అయితే నైజము, రూపం గణనీయంగా మార్పుచెందిన సహకారము, మరోప్రత్యేకత ఈ వర్గాల ప్రయోజనాలు, ఫ్యూడలు భూస్వామ్యవర్గాల ప్రయోజనాలతో సంలీనమయ్యాయి. అందుచేత జాతీయ బూర్జువావర్గంలో బడావ్యాపారులు, పారిశ్రామికులు చిన్న కూటమే అయినా, ఆర్థికంగా అత్యంత బలవంతులు, రాజకీయంగా అత్యధిక ప్రభావం కలిగి. కరుడు గట్టిన అత్యంత అభివృద్ధినిరోధక వర్గాలుగా వున్నారు.

భారతబడాబూర్జువావర్గం యేవిధంగా రూపాంతరం పొందిందో, ఉదాహరణకు బిర్లాగుత్తపెట్టుబడిదారుని చూస్తేతెలుస్తుంది. యుద్ధానికి పూర్వం, ఒక్క గుడ్డల మిల్లులలోనే చాలతక్కువ, మైనరుపెట్టుబడికాగా, అత్యధిక భాగం వ్యాపారమంతా అప్పులు, ద్రవ్యలావాదేవీలు లేని వ్యాపార రంగంగా వుండేది. అది పారిశ్రామిక పెట్టుబడిగ 1957 నాటికే మొత్తంపెట్టుబడిలో 58.2శాతమైంది.బ్యాంకింగు, పెట్టుబడి కంపెనీలలో 28.3. వ్యాపారంలో 7.6శాతాలకు పడిపోయింది. బిర్లాలపెట్టుబడులు భారీపరిశ్రమలలో యుద్ధానికి పూర్వం 58 మిలియనుల రూపాయలనుండి 269మిలియన్ రూపాయలకు పెరిగి పోయింది. జాతీయ బూర్జువావర్గం పెట్టుబడిదారి పారిశ్రామికాభివృద్ధిలో పాల్గొనుట గణనీయ పరిణామం. పారిశ్రామికాభివృద్ధి బడా బూర్జువా వర్గాలను వారి ఆర్థిక ప్రయోజనాల కొరకు దగ్గరగా చేర్చుతుంది, ఆవిధంగా జాతీయ గుత్తపెట్టుబడిదారి బూర్జువావర్గాల స్థిరీకరణకు తోడ్పడుతుంది.

ఈ సందర్భంలోనే జాతీయ బూర్జువా వర్గం, సామ్రాజ్యవాదం-ఫ్యూడలిజాల మధ్యగల వైరుధ్య నైజాన్ని కొంత తెలుసుకొనవలసివుంది.

ప్రపంచ యుద్ధకాలంలో, తదనంతరం సామ్రాజ్యవాదం సాధారణంగా బలహీనపడింది. శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజం పక్షం బలపడింది. ఈ నూతన అంతర్జాతీయ శక్తుల సమతూకంలో వచ్చిన మార్పుల వలన, అర్ధవలస దేశాలలో మరింత ప్రతిబింబించాయి. భారత దేశంలో ఆదశకంలో ప్రజావసరాలు, తదితర వ్యాపారాలలో విదేశపెట్టుబడులు గణనీయంగా పెరిగాయి. ఈ దశకంలో పారిశ్రామిక పెట్టుబడులు మూడురెట్లు పెరిగి, 1957 కు విదేశాల మొత్తం పెట్టుబడులలో 43 శాతమయ్యాయి. అమెరికన్ పెట్టుబడులు 1958కి 6.9 మిలియనులుగా వున్నవి. 86 మిలియన్ డాలరులకు ఏడురెట్లు పెరిగాయి. అవే 7.6 శాతముగా వున్నవి 25శాతానికి పెరిగాయి. సామ్రాజ్యవాదులు భారతదేశంలో పారిశ్రామికాభివృద్ధిని ఎంతగా చిన్న పరిశ్రమలకు పరిమితం చేద్దామనుకొన్నా, భారీ ఇనుము, ఉక్కు, లోహపరిశ్రమ, మోటారు వంటి పరిశ్రమలలో పెట్టుబడి పెట్టవలసిన తప్పని పరిస్థితి కలిగింది.[1]

1. సవెలీవ్, యస్., ఉలియనొవస్కీ,ఆర్.ఎ.,(1962) నేషనల్ బూర్జువాజీ అండ్ డెవలప్ మెంట ఆఫ్ స్టేటు కాపిటలిజం - పి.పి.హెచ్.పే.10-11.

నేడు, విదేశీకార్పొరేషనులకు వ్యాపార భాగస్వామిగా, ఏజెంట్లుగా జాతీయ బూర్జువా వర్గంపని చేసినా, వారిచేతులలో కీలుబొమ్మగా యింకా యేమాత్రంలేదు. గతంలో స్థానిక బూర్జువావర్గం ప్రధానంగా వ్యాపారంలోనే వుండుట స్వతంత్ర అంశంగా వుండేది, కాని పారిశ్రామికాభివృద్ధి అత్యంత వేగంగా జరుగుటతో,వ్యాపారం స్వతంత్ర ప్రధానాంశంగాలేదు. నేడు జాతీయ పారిశ్రామిక బూర్జువావర్గం, తన ప్రయోజనాలకై వ్యాపార ద్రవ్యపెట్టుబడిపై తగినంత ప్రభావాన్ని కలుగజేయగల మార్గాలు దానికి వున్నవి. అంతేగాక, వ్యాపారబూర్జువావర్గం జాతీయ పారిశ్రామిక అవసరాలను అత్యంతవేగంగా సమకూర్చగల శక్తిని పొందగలిగింది. మధ్యదళారిపాత్రను విరమించి, విదేశాలనుండి యింతవరకు దిగుమతి చేసుకొంటున్నవాటిని స్వయంగా వుత్పత్తిచేసి, మార్కెట్టుకు తెస్తున్నది. వ్యాపారం, దళారీకమీషన్ గతంలోని అంశంగానై జాతీయ బూర్జువావర్గం పారిశ్రామిక అభివృద్ధిపథంలో పురోగమించి మార్పుచెంది, వ్యాపార బూర్జువావర్గం, పారిశ్రామిక బూర్జువావర్గ లక్షణాలను సంతరించుకొంటున్నది. అంటే దీనర్థం జాతీయ, విదేశీయ పెట్టుబడిదారీ వర్గాలమధ్యగల సంబంధాలలో వచ్చిన మార్పు, అభివృద్ధి నిరోధక బూర్జువావర్గాలు సామ్రాజ్యవాదాన్ని గాఢంగా బలపరచనవిగా, ప్రతిఫలంగా విదేశీవర్గాల సానుభూతిని, మద్ధతును పొందవని అర్థంకాదు. భారతదేశంలో వలెనే అనేక ఆసియా దేశాలలో యీరకపు బూర్జువావర్గం వుంది. అయితే దాని అభివృద్ధినిరోధకత్వం, వర్గవైరుధ్యాలు తీవ్రమైనందున, ప్రజాపీడనను అవి తీవ్రతీరం చేస్తున్నందున, జాతీయ బూర్జువావర్గం దానిని వ్యతిరేకించుచున్నందున ఏర్పడుచున్నది. సామ్రాజ్యవాద శక్తులు బలహీనమగుటకు సమానాంతరంగానే ప్యూడలు భూస్వామ్యవర్గాలు బలహీనపడిపోయాయి. ఈ రెండింటి పరస్పర సంబంధం, పీడిత ప్రజల జాతీయ విముక్తివుద్యమ నైజములోనే వుంది. అనగా వలస వ్యతిరేక, ప్యూడలు వ్యతిరేక పోరాట స్వభావంలోనే వుంది.

ఫ్యూడలు భూస్వామ్యవ్యతిరేక రైతాంగ పోరాటాలను అవకాశంగా తీసుకొని బూర్జువావర్గం, భూస్వాములను వారి భూములు, అందుండి పొందే నజరానాలు, సేవలకు దూరం చేస్తున్నది. ఫలితంగా రాజకీయాలలో భూస్వామ్యవర్గాల ప్రభావం చాల తగ్గిపోతున్నది. భూస్వాములలో పై వర్గాలవారి ప్రతినిధులు పాలనాయంత్రాంగంలో శాసనసభలలో, మంత్రి వర్గాలలో వుంటూనే వున్నారు. జాతీయ బూర్జువావర్గంతో పాటు పాలకవర్గంగా వుంటున్నా, వారికి నిర్ణయాత్మక పాత్రలేదు. జాతీయ బూర్జువావర్గమే ఆపాత్ర నిర్వహించుచున్నది. అంతమాత్రం చేత బడా బూర్జువా వర్గం కీలకపాత్ర నిర్వహించుటను మరువరాదు. అందుచేతనే భారత ప్రభుత్వ వ్యవసాయ విధానం, బర్మలో వలెనే పేదరైతాంగంలో యే విధమైన అభివృద్ధిని సాధించ లేకపోయింది. వాగ్దానాలు అలాగే వుండిపోయాయి. గ్రామసీమలలోని ఈమౌలిక వైరుధ్య పరిష్కారమే భారత ప్రజల భవిష్యత్తును నిర్ణయిస్తుంది. వ్యవసాయ సంస్కరణలు నగ్నబానిసత్వ, వెట్టిచాకిరీలను, పెట్టుబడిదారి విధానమే తనకు వీలుగా మార్చిందేకాని, వ్యవసాయ కూలీలకు, పేదరైతాంగానికి భూములనిచ్చుటలో విఫలమైంది. అయితే ఇదే మాజీ అత్యంత అభివృద్ధి నిరోధక భూస్వామ్య వర్గాలు మార్పు చెంది ధనిక భూస్వామ్య, వేతన కూలి విధానం

వచ్చుటతో, తమ పూర్వప్యూడలు భూస్వాములు రూపభేధం మాత్రమే చెందారు. వారికిప్పుడు ప్రభుత్వ, జాతీయ బూర్జువా అండదండలతో మరింత బలవంతులయ్యారేమోననే ఆలోచనకూడ వస్తున్నది. ఇక్కడే మరో విషయాన్ని, చిన్న,మధ్యతరగతి బూర్జువావర్గాలు వ్యవసాయ సంస్కరణల అమలుకు శక్తివంచనలేకుండా, ప్రభుత్వపెట్టుబడిరంగంలో పారిశ్రామికీకరణను బలపరస్తూనే వున్నవి.

ఈనేపథ్యంలో సామ్రాజ్యవాదం - ఫ్యూడలిజంలకు గలవైరుధ్యం వొకవైపు, మాజీవ్యాపార, పారిశ్రామిక బూర్జువావర్గాలు, గుత్తపెట్టుబడిదారి వర్గానికి మధ్యగల వైరుధ్యం మరోవైపు, సమగ్రంగా మరోచిత్రాన్ని చూపెడుతున్నాయి. దేశీయ గుత్తపెట్టుదారి వర్గాలు, విదేశీ పెట్టుబడికి వ్యతిరేంగా దాడి ప్రారంభించాయి. బ్రిటిష్ పెట్టుబడిని నిర్ణయాత్మక స్థానాల నుండితొలగించాయి. మాజీవ్యాపార, పారిశ్రామిక బూర్జువావర్గం నూతన పారిశ్రామిక విధానాన్ని వివిధరంగాలలో, శాఖలలో జాతీయ అవసరాల నిమిత్తం అభివృద్ధి చేస్తున్నప్పటికి, సామ్రాజ్యవాదంతో దానికి గలవైరుధ్యం, జాతీయ బూర్జవావర్గానికి గల మౌలికవైరుధ్యంగాక, లాభాల పంపకంలో గల వైరుధ్యం మాత్రమే, అనగా శతృభావ వైరుధ్యం కాదు. తన స్వార్థ ప్రయోజనాలకొరకు, యేమూల్యాన్నైనా చెల్లించి, సార్వభౌమాధికారాన్నైనా, అభివృద్ధినైనా వదలుకొంటుంది.

విదేశపెట్టుబడుల యెడల నిర్దుష్ట, ధృడతరవైఖరిని ప్రారంభంలో చూపెట్టక జాతీయ బూర్జువావర్గం, సామ్రాజ్యవాదం దానను పూర్తిగ వ్యతిరేకించుచున్నందున వూగసలాటకు లోనుగుతుంది. ఒకవైపు విదేశపెట్టుబడుల యెడల వ్యతిరేకవైఖరిని, మరోవైపు దేశీయ గుత్తపెట్టుబడి వర్గాలు తమవిస్తరణకు కావలసిన నూతన విస్తృతపెట్టుబడుల దిగుమతి కోరికను మన్నించుతు, వాటికి వసతులు, వనరులు యేర్పాటు చేస్తుంది. అవిధంగా విదేశీపెట్టుబడులను ఆకర్షించుటకు అనేకరాయితీలను కలుగజేస్తుంది. జాతీయ బూర్జువావర్గ ఈవొడుదుడుకుల విధానానికి కారణం, దాని ఆర్థిక విధానాలు బలహీనంగా, స్థిరంగా లేకుండుట, ఎలస విముక్తి పొందిన దేశాలు నేడు అత్యంత కఠిన ఆర్థిక బాధలకు లోనగుతున్నాయి. ఈ బాధలను ఏదోవిధంగా ఎదుర్కొనుటకు విదేశీ పెట్టుబడులకు ప్రాకులాడుతున్నది.

జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద, ఫ్యూడలిజంలతో రాజీవిధానాన్ని అవలంభించుటకు మరోకారణం,వొకవర్గంగా దాని ప్రధాన వర్గప్రయోజనం, దోచుకొనబడేప్రజానీకం, కార్మికవర్గం వర్గపోరాటం తీవ్రమైనకొలది, జాతీయ బూర్జువావర్గం, కూడ బెట్టిన సంపదనంతా ఎలారక్షించుకొనాలా అనే తాపత్రయం యెక్కువగుచున్నది. అదే ఆవర్గ ఆధిపత్యానికి ప్రాతిపధిక. అందుకు మిత్రులకై అన్వేషణ, అందుకే ఆవర్గంలోని ఉన్నతశ్రేణులు సామ్రాజ్యవాదంవైపు మొగ్గుట, ఫలితంగానే జాతీయ బూర్జువావర్గంలోని ఊగిసలాటకు కారణంగానెంచాలి.

ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమం, మాస్కో ప్రకటనలో జాతీయ బూర్జువావర్గ విశ్లేషణచేసి,

అదిచాల వరకు విదేశీగుత్త పెట్టుబడిదారి వర్గాలపై, దేశీయ అభివృద్ధినిరోధక శక్తులపై ఆధారపడి వుంది. లక్ష్యంరీత్యా, సామ్రాజ్యవాద వ్యూహాలు వ్యతిరేక విప్లవ ప్రధాన కర్తవ్యాల నిర్వహణలో యిచ్ఛవుంది. ఆకారణంగా సామ్రాజ్యవాద వ్యూహాలు వ్యతిరేకపోరాటాలలో పాల్గొంటుంది. ఈ అర్థంలో అది అభ్యుదయకరమైన, మరోవిధంగా దాని వర్గనైజ కారణంగా అస్థిరమైనది, నిలకడలేనిది. నేటొసంఘర్షణలను సామ్రాజ్యవాదులు వ్యూహలిస్టులతో గల శత్రువైరుధ్యాలను ఒప్పందాలు, రాజీల ద్వారా పరిష్కరించచూస్తుంది. లెనిన్ చెప్పినట్లు పోరాటాలు గాక, వొప్పందాలవైఖరి చెబడుతుంది.

కకావికశాస్త్రీయవాదంకాక అవకాశవాదాన్ని, ఎత్తుగడల శూన్యమైన సాహసిక ధృడతరపూర్తి విజయవాంచ, వైఖరులను ప్రదర్శించుతుంది. సామ్రాజ్యవాదంతో రాజీవైఖరి బూర్జువా పరిపక్వతపై ఆధారపడి వుంటుంది. వర్గ శృభుత్వ వైఖరి తీవ్రత తదితర అంశాలపై ఆధారపడి వుంటుంది.

బడాబూర్జువావర్గంలో అత్యధికభాగం, అభివృద్ధినిరోధక దేశీయ, విదేశీయ విధానాలను పెంపొందించుతుంది. అదే ప్రభుత్వం, శాసనసభలపై సామ్రాజ్యవాదులతో మైత్రి సహకారంకై వొత్తిడిచేస్తుంది. ప్రజల ప్రయోజనాలను బడాబూర్జువావర్గం మొదలుపెట్టినకొలది, కార్మికవర్గం తదితర శ్రమజీవులతో వైరుధ్యం తీవ్రతరమౌతుంది, వారితో పాటు మరోవైపు జాతీయ బూర్జువావర్గంలోని అత్యధికులతోను వైరుధ్యం తీవ్రమౌతుంది.

భారత పాలకవర్గాల విశ్లేషణ నేపధ్యంలో మన విదేశాంగ విధానాన్ని సంక్షిప్తంగా తెలుసుకొందాము.

భారత రిపబ్లిక్ అవతరణ అనంతరం నెహ్రూ ప్రభుత్వం వివిధ దేశాలతో అంతర్జాతీయ సంబంధాలు, వివిధ వొప్పందాలు చేసుకొను క్రమంలో నెహ్రూ విదేశాంగ విధానం, నెహ్రూ ప్రపంచ దృక్ఫధం రూపొందాయి. ఈ విధానం ప్రధానంగా శాంతి, సుముఖతటస్తత, ప్రపంచ రెండు వైరుధ్య పక్షాల ఆధిక్యతా ప్రభావంలో అలీన విధాన పునాదులు వేయబడినవి. కాని యేవిధమైన వొంటెత్తుపోకడలకు బీజాలులేని అలీన తటస్థ విధానం. భారత జాతీయ కాంగ్రెసు స్వాతంత్ర్యానికి పూర్వమే వివిధ దేశాలలో స్వాతంత్ర్య, అభ్యుదయకర వుద్యమాలతో సౌహార్ధసంబంధాలను యేర్పరచుకొన్న భారత జాతీయ పాలకవర్గాలు స్వాతంత్ర్యానంతరం నూతన స్వాతంత్రం పొందిన అన్ని దేశాలతో, సోషలిస్టు దేశాలతో సహా సత్సంబంధాలను ఏర్పరచుకొని వాటి అభ్యుదయకర విధానాలన్నింటిని పూర్తిగ సమర్ధించింది. ఐక్యరాజ్యసమితిలో చైనా అగ్రరాజ్యస్థానాన్ని పునరుద్ధరించుటకు ప్రారంభం నుండి చివరి వరకు భారతదేశం పోరాడుతునే వచ్చింది.

ఆసియా, ఆఫ్రికా జాతీయ విముక్తి వుద్యమాలను బలపరస్తూ, స్వతంత్ర రాజకీయ, ఆర్థిక విధానాలను ఆచరించుట, తృతీయ ప్రపంచ దేశాలలో స్వాతంత్ర్య పరిరక్షణ నిరవధికంగా అనుసరించుటతో భారత రాజకీయాలలో నెహ్రూ విదేశాంగ విధానం రూపుదిద్దుకొంది.

భారతదేశం కొరియాలో సంఘర్షణలు సమసిపోయి శాంతి నెలకొల్పుటకు ఐక్యరాజ్యసమితిలో అశాశ్వత సభ్యత్వం కలిగివున్నపుడే గణనీయమైన ప్రయత్నాలు చేసింది. కొరియాలో చైనా దురాక్రమణను వ్యతిరేకించి, కాల్పుల విరమణకు, యుద్ధఖైదీల మార్పిడిలో చురుకైన నిర్మాణాత్మక చర్యలు గైకొంది. ఇండో చైనా సంఘర్షణలలో భారతదేశపు నిరవధిక విజ్ఞప్తులు, కాల్పుల విరమణకు, జనీవాఒప్పందాల సంతకాలకు తోడ్పడి, 1954-56లలో నైరుతి ఆసియాలో పరిమిత పరిష్కారానికి, సంబంధాల పునరుద్ధరణకు తోడ్పడింది.

అంతర్జాతీయరంగంలో స్థానిక సంఘర్షణల విరమణకు, స్థిరమైన శాంతికి, సైనిక కూటముల యేర్పాటుకు, విదేశసైనిక స్థావరాల ఉనికికి, వ్యతిరేకంగా నిలబడి తన వైఖరిని స్పష్టం చేసింది. నెహ్రూ విదేశాంగ విధానం పశ్చిమదేశాలతో భారతదేశ సంబంధాలలో కొన్ని క్లిష్టసమస్యలకు కారణమైంది. భారతదేశం ఒకవైపు నిస్సంకోచంగా వలస, నయావలస విధానాలను వ్యతిరేకించుట, మరోవైపు సామ్రాజ్యవాదశక్తులు వివిధ రాజకీయ, ఆర్థిక ఒత్తిడులను ఎదుర్కొనవలసివచ్చింది. అమెరికాసైనిక సహాయాన్ని భారతదేశం 1950-51లో నిరాకరించినా, సాంకేతిక సహకార ఒడంబడికలను చేసుకొన్నది, అదే వివిధ రంగాలలో అమెరికా జోక్యానికి, అవకాశాలను కలుగజేసాయి.

సోషలిస్టుదేశాలతో భారతదేశం బహుముఖ సహకార సంబంధాలను అభివృద్ధిచేసింది. భారత- రష్యాదేశాల నాయకులు పరస్పరం దేశాలను సందర్శించుకొన్నారు. సాంస్కృతిక ప్రతినిధి వర్గాలు సందర్శనలకు, ప్రదర్శనలకు ప్రోత్సాహం లభించింది. చైనాతోను అదేవిధంగా పరస్పర సంబంధాలు విస్తరించాయి. భారత-చైనా సహకారం చరిత్రాత్మక బాండుంగు సమావేశ విజయానికి తోడ్పడింది, అలీన వుద్యమం బలపడి విస్తరించింది.

# 2

## టిబెట్‌ఘటనలు: భారత-చైనా స్పందనలు

టిబెట్ గత300 సంవత్సరాలుగా రాజకీయంగా యేస్థితిలో వున్నా పొరుగు దేశాలతో ఒడంబడికలు, సరిహద్దు సంధులు నేరుగా చేసుకొనగలిగిన స్థితిలోవుంది. టిబెట్, లడక్‌లలో 1684, 1842లలో నేపాలుతో 1856లో చేసుకొన్న ఒడంబడికలు టిబెట్ విదేశాలతో నేరుగా సంబంధాలను పెట్టుకొనగల రాజకీయ స్థానాన్ని తెలియజేస్తున్నది. టిబెట్-నేపాలు ఒడంబడిక ఒక శతాబ్దం పూర్తిగ అమలులో వుంది. బ్రిటిష్ ప్రభుత్వం, చైనా ప్రభుత్వం టిబెట్‌కు సంబంధించి చేసుకొన్న ఒడంబక విషయమై 1890లో తన అసమ్మతిని తెలియజేసింది. దాని అమలును విజయవంతంగా వ్యతిరేకించింది. అకారణంగా బ్రిటన్, టిబెట్‌తో 1904లో ప్రత్యేక ఒడంబడికను చేసుకొనవలసివచ్చింది. టిబెట్ నేరుగా జరిపే సంప్రదింపులను చైనా వ్యతిరేకించక, వాటికి తోడ్పడుట జరిగింది. టిబెట్ 1911లో స్వాతంత్ర్య ప్రకటన గావించుట అందరకూ తెలిసినదే. సైద్ధాంతికంగా టిబెట్‌తో చైనా సంబంధాలు

ఎలావున్నా, యితర దేశాలతో సంబంధాలను నెరపుకొనగల అధికారాలను తిరిగి పొందగలిగింది.

టిబెట్ సమాజం భూస్వామ్యవ్యవస్థపై నిర్మింపబడిన బానిస సమాజం, ప్రధాన వృత్తి వ్యవసాయం. అత్యధిక భాగం భూమి, పశుసంపద బానిస యజమానులు, ప్యూడలు అధికారవర్గం, మత పీఠాధిపతులు అను మూడు రకముల భూస్వాముల చేతులలో వుంది. మొత్తం 12లక్షలమంది జనాభాలో వీరు 5శాతం వుంటారు. రైతులెవ్వరికి భూమి, పశువులు ఏమిలేవు. వారు, వారిపిల్లలు తరతరాలుగ భూస్వాముల బానిసలుగ సేవలు చేస్తూనేవున్నారు. నేడు 2-3 వందల మంది ప్రభువులు వారసత్వంగా కొనసాగుతున్నారు. వారి ఆస్థిని బట్టి సమాజంలో వారి స్థానం మారుతుంటుంది. ఉన్నత ప్రభువులు 10 వంతు లేక 20 మంది వరకు వున్నారు. వారికి ఒక్కొక్కరికి డజనులకొలది ఎస్టేటులు, వేలకొలది బానిసలు వున్నారు. టిబెట్ పరిపాలన ఉన్నత ప్రభువుల అధికారంలో వుంది. బానిస యజమానుల మధ్య, వారికి బానిసలకు మధ్య భేదాలు, అంతరాలు కఠినంగా అమలు జరుగుతున్నవి. ప్రభువులకు బానిసలు ఎదురు పడరాదు, తొలగిపోవాలి. పారిపోయిన బానిసలను ప్రభువులు పట్టుకొని వారి ఇష్టానుసారం హింసించవచ్చు. ప్రభువులకు బానిసలు వొంగి వొంగి నమస్కారాలు చేయాలి. కొరడాదెబ్బలు, ముక్కులు కోయుట, చేతులు నరకుట, మోకాలి చిప్పలు తీసివేయుట, కళ్ళుపీకించుట వంటి హింసాత్మక శిక్షలు సర్వసాధారణము.

"మత పీఠాధిపతులు టిబెట్ ప్రజల సామాన్య జీవితంలో అత్యంత ప్రముఖ స్థానాన్ని కలిగి వున్నారు. వారి చర్యలను మత స్వతంత్ర విశ్వాసాలను ప్రజలు గౌరవించి, రక్షించాలి. నేటి వరకు మతాధిపతులందరు బానిస యజమానులుగనే వున్నారు. మతపీఠాలు, బానిసలదోపిడి, ప్రభుత్వోద్యోగుల, ప్రభువుల దోపిడిని మించే వుంటుంది. వారికి మతం పెద్ద అండ, ఆ అండతోనే ఆదోపిడి తీవ్రత ఎక్కువగానే వుంటుంది. చిన్నలామాలు, పెద్ద పీఠాలలామాలు, మతపీఠాధిపతులు వారి యిష్టానుసారం బానిసలను శిక్షించుటకు స్వంత జైళ్ళను సైతం కలిగి వున్నారు[1].

టిబెట్‌లోని సాగుభూమిలో ప్రభువులు 30% మతాధిపతులు 30%, మిగిలిన 40% భూమిని ప్యూడలు ప్రభుత్వోద్యోగులు కలిగి వున్నారు. సహజంగానే అభివృద్ధినిరోధక, క్రూరాతి క్రూరమైన ఆటవిక హింసా బానిస విధానంలో అధికారమంతా, కొద్దిమందిదిగా వున్న మత, రాజకీయ పెద్దపెద్ద బానిస యజమానుల చేతులలో కేంద్రీకరించబడివుంది. వీరి మధ్య అంతర్గత పోరాటాలు, ఆశ్చర్యాన్నిగొల్పే లంచగొండి తనాలు, అన్ని అవాంఛనీయాలు చేరివున్నవి. లెక్కలేనన్ని హత్యలు, విషప్రయోగాలు, దలైలామాను చుట్టియున్న అత్యున్నత అధికారుల చేతులన్నీ రక్తసిక్తాలైవున్నవి. నెహ్రూ చెప్పినట్లు దలైలామా అత్యున్నత గౌరవాలను పొందుటలేదు. తద్విరుద్ధంగా వారు దలైలామాను

1. *టిబెట్ డాక్యుమెంట్సు (1959) కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్ (ఆంగ్లంలో.పే 29-30లలోని వుదహరింపు.*

తోలుబొమ్మగా వారు చెప్పేవి చేయునట్లు చేస్తూ, వీలుకానిచో అంతంచేస్తున్నారు. పొట్లా భవనంలో 11వ దలైలామా అకస్మాత్తుగా 1855లో 18సంవత్సరాల వయస్సులోనే చనిపోయాడు. తరువాత 1875లో 12వ దలైలామా 20సంవత్సరాలకే అకస్మాత్తుగా చనిపోయాడు. తమ ముఠాలో లేనివానిని, బ్రిటిష్ ప్రభుత్వం టిబెట్‌నంతా ఆక్రమించిన తరువాత, గొంతునులిమి అంతమొందించారు. జీవితంపై ఆశతో 1923లో 9వ పంచన్‌లామా దేశంలోని లోతట్టు ప్రాంతాలకు పారిపోయాడు. దలైలామా రీజంటు అయిన రెబొహెన్‌హుటుకు 8సంవత్సరాలు జైలులో నిర్బంధించబడి, జైలులో గొంతునులిమి చంపబడ్డాడు. నేటి దలైలామా తండ్రి దేశభక్తుడైనందున విదేశీయ ఏజెంట్లు అభివృద్ధినిరోధకులచే విషప్రయోగం చేయబడ్డాడు. దలైలామా వారిపెత్తనాన్ని ఆమోదించక పోవుటే అతని చావుకు కారణమైంది. టిబెట్ శాంతియుతంగా విముక్తి పొందగలందుకు 1950లో, జీవించి యున్నబుద్ధుడు' జెడా' ప్రయత్నించిందుకు, చామోచే విషప్రయోగం చేయబడి, సాక్ష్యలభించకుండా దహనం చేయబడ్డాడు. విదేశీ ఆక్రమణదారుల ఏజంట్లను అనేక మందిని అదేవిధంగా క్రూరాతి క్రూరంగా అంతంచేశారు.

"సమాజపురోగమనం స్తంభించిపోయింది. ఆర్థిక పతనం, సాంస్కృతిక తిరోగమనం, జనాభా అభివృద్ధి క్షీణించింది. సమాజంలో " మానవీయత " పేరుకు కూడలేకుండా పోయింది. అభివృద్ధి నిరోధకత్వం, వెనుక బాటుతనం, హింసాయుత ఆటవికత మూర్తీభవించాయి[1].

టిబెట్ సామాజిక పరిస్థితి ఫ్యూడల్ భూస్వామ్య, లామాల, అధికారుల అధ్వర్యంలో మధ్యయుగాల బానిసత్వాన్ని మరపించే దశలోవున్నపుడు చైనా ప్రధాన భూభాగంలో విజయవంతమైన ప్రజాస్వామ్యవిప్లవంతో, టిబెట్‌లోని శాంతియుత విముక్తి ఉద్యమం నుండి ప్రజాస్వామ్య సంస్కరణలు చేపట్టింది.

టిబెట్1951లో శాంతియుతంగా విముక్తి చేయబడి, రహదారులనిర్మాణం, ఆసుపత్రుల నిర్మాణంతో పాటు వడ్డీలేని అప్పులు యివ్వబడినాయి. వ్యాపారం అభివృద్ధి చేయబడింది. టిబెట్‌లోని అభివృద్ధి నిరోధక ఉన్నత వర్గాలు ప్రజాస్వామ్య సంస్కరణలను అమలు చేయుటను ప్రతిఘటించ సాగాయి. మధ్యయుగాల బానిసత్వం, వెట్టిచాకిరి విధానాలనే కొనసాగాలని కోరుతున్నారు.

ప్రజాస్వామ్య సంస్కరణలు రెండు దశలుగా చేపట్టింది. మొదటి దశలో, బానిస యజమానులైన ప్రభువులు. లామాలు, ప్రభుత్వ వుద్యోగులకు వెట్టిచాకిరి రద్దుకావాలని వుద్యమం చేబట్టింది. దానితో పాటు కౌలు తగ్గించాలని. ఉచిత సేవలు రద్దుకావాలని, దున్నేవానిదే భూమి అనే నినాదాలతో ఉద్యమాన్ని సాగించారు. అభివృద్ధి నిరోధకులు సంస్కరణలను వ్యతిరేకించుటయేగాక, టిబెటియన్ సైన్యాన్ని పునర్నిర్మించుటను తీవ్రంగా వ్యతిరేకించారు.

---

*1. టిబెట్ డాక్యుమెంట్సు (1959) కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్ (ఆంగ్లంలో పే.31-35.*

అభివృద్ధినిరోధక విద్రోహులు, దలైలామాతో కలిసి, పరిస్థితిని పూర్తిగ తప్పుగా అంచెనా వేసి, విదేశీ సామ్రాజ్యవాదులతో కుట్రలు చేసి, "స్వతంత్ర టిబెట్", "చైనీయులను పారద్రోలాలి" అనే నినాదాలతో 10 మార్చి, 1959న తిరుగుబాటును లేవదీసారు. అది సైనిక ప్రతీఘాతక విప్లవ శక్తుల సాయుధ తిరుగుబాటు. దేశభక్తులు, అభివృద్ధికరవాదులు అయిన టిబెట్ అధికారులను పూచకోతకోసారు. ప్రజావిముక్తి సైనికుల నెందరినో గాయపరిచారు. రవాణాసౌకర్యాలను ధ్వంసం చేసారు. ప్రజలపై హింసాకాండ సాగించారు. ఆవిధంగా వారు తమ సర్వనాశనాన్ని కోరుకొన్నారు.

కేంద్రప్రభుత్వం 28 మార్చి 1959న అభివృద్ధినిరోధక టిబెట్ స్థానిక ప్రభుత్వాన్ని రద్దుచేసింది. టిబెట్‌లోని అగ్రస్థానాలలోని దేశభక్తి వర్గాలు, ప్రజాసామాన్యపు మద్దతుతో తిరుగుబాటును అణచి వేసింది.లక్షల కొలది బానిసలు, ఫ్యూడలు వర్గాలచే అమానుష ఘోరహింసలకు లోనైన వారు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సమాజాన్ని మొత్తం కదలించివేసే మహాప్రదర్శన గావించారు. ఉద్యమం దావానలంలా వ్యాపించింది.

టిబెట్‌లోని వ్యవసాయ భూముల ప్రాంతాలలో " మూడింటికి వ్యతిరేకంగా " రెండు తగ్గించుట" అనే మహోధ్యమాలు " తిరుగుబాటుకు ప్రతి స్పందనగా కన్పించినా, చైనా ప్రధాన భూభాగంలో అట్టిసంస్కరణలు, రెడ్ ఆర్మీ, న్యూఫోర్తు ఆర్మీ ఆక్రమిత ప్రాంతాలలో యుద్ధకాలంలో ప్రారంభించబడినవని అందరకు తెలుసు. తిరుగుబాటు వ్యతిరేకత, వెట్టిచాకిరికి వ్యతిరేకత, వ్యక్తి బానిసత్వ వ్యతిరేకతలు మూడు అంశాలు: కౌలు తగ్గింపు, వడ్డీరేటు తగ్గింపులు అనే రెండు అంశాలు మహోద్యమాలుగ అమలు చేయబడినవి. మతపీఠాలలో మూడు వ్యతిరేక, రెండు తగ్గింపు వుధ్యమాలు కొనసాగినవి. అదే విదంగా ఫ్యూడలు తిరుగు బాటు ప్రభువులందరి పై యీవుధ్యమాలు కొనసాగి, అమలు చేయబడినవి, ప్రజాస్వామిక యాజమాన్యం ప్రవేశపెట్టబడింది.

ప్రజాస్వామ్యసంస్కరణల ప్రజోధ్యమాల రెండవ దశలో వ్యవసాయ భూముల పంపక వుధ్యమం చేబట్టబడింది. బానిస యజమానుల, తిరుగుబాటు దారుల భూములు, గృహాలు, పశుసంపద, వ్యవసాయ పరికరాలు ఎట్టిమినహాయింపులు లేకుండా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. తిరుగుబాటులో పాల్గొనని ప్రభువుల, లామాల, ఉద్యోగుల భూములు వగైరాలను ప్రభుత్వం కొనివేసింది. ఈ విధంగా టిబెట్‌లోని లక్షలకొలది బానిసలు విముక్తి పొందారు. బానిసలుగానే కాక రాజకీయంగా విముక్తి పొందారు. వారు యిప్పుడు టిబెట్ సమాజంలో సర్వస్వతంత్రులు. వ్యవసాయ భూములు వారికి పంచబడుటతో కొంత వరకు ఆర్థిక స్వాతంత్ర్యంకూడ పొందారు.

మార్చి, 1959 తిరుగుబాటు విఫలమయ్యేలక్షణాలు పొడగట్టిన వెంటనే భూస్వామ్య ప్రభువులు, మతాధిపతులు అనేక మంది, భారతదేశపు సరిహద్దులవైపు, టిబెట్ దలైలామాను తమవెంట తీసుకొని ఏప్రిల్‌లో ముస్సోరి ప్రాంతానికి వచ్చి ఆశ్రయం కోరారు. భారత ప్రభుత్వం, వారి కోరికపై అక్కడ వుండ గలందులకు ఆమోదించి, వారిని నిరాయుధులను చేసింది. తదనంతరం కొన్ని వేల మంది టిబెట్ దేశస్థులు,

భారతదేశంలోనికి వివిధ మార్గాల ద్వారా వచ్చారు. కొంతమంది సిక్కిం చేరి తాత్కాలిక కాంపులలో నివశించసాగారు. నెహ్రూ 27 ఏప్రిల్ 1959న పార్లమెంటులో "దలైలామా తనయిష్టానుసారంగా సరిహద్దులను దాటివచ్చారు. భారతదేశమునకు రమ్మనమని మేము ఎప్పుడు కోరలేదు. ఆశ్రయం కోరినపుడు సహజంగానే యిచ్చాము"[1] అని చెప్పారు. ఈ సందర్భంలో మూడు సంవత్సరాల క్రితమే టిబెట్‌లోని ఈశాన్య ప్రాంతంలోని కంపా ఉపజాతులు తిరుగుబాటు చేసాయి. నాటి నుండి అవి కొనసాగుతునేవున్నది. ఈ అలజడి ప్రాంతాలు భారతదేశ సరిహద్దునంటి పెట్టుకొన్నవికావు. టిబెట్‌లో దూరంగావున్న లోతట్టు ప్రాంతాలు, టిబెటియన్‌లు ఈ తిరుగుబాటులకు దూరంగానే వున్నారు. " నిష్కారణంగా నేడు భారతదేశంలోని కలింపాంగ్ తిరుగుబాటు దారుల కుట్రలకు కేంద్రమని నిందించుట" జరిగిందని, " భారత దేశంలో నుండి విద్రోహచర్యలు జరుపుటకు భారత ప్రభుత్వం అంగీకరించదు, అట్టి నింద నిర్హేతు కమైనదని" నెహ్రూ అన్నారు.

ప్రధాన మంత్రి "చౌయెన్‌లై భారతదేశం సందర్శించినపుడు టిబెట్‌పై చర్చించాము. హృదయపూర్వకంగా మాట్లడుకొన్నాము. టిబెట్ చైనాలో అంతర్భాగమైనా, చైనాలో ఒకరాష్ట్రంగా లేదని, చైనీయులకు, మిగత స్వపరిపాలిత ప్రజల కంటె భిన్నమైనవారని, స్వపరిపాలిత ప్రాంతంగా నెంచుతున్నామని"[2] అన్నారని పార్లమెంటుకు తెలిపారు. ఆసమయంలో దలైలామా యిక్కడే వున్నాందున "ఆవిషయాన్ని తెలియజేసి, చౌయెన్‌లై వాగ్ధానాలను విశ్వసించి, సంస్కరణలకు పూర్తి సహకారాన్ని యివ్వవలసిందిగా" కోరినట్లు తెలిపారు. "విచారకరమైన సంఘటనలు తదనంతరం జరిగినపుడు మానవతాదృక్పధంతో స్పందించి ఎట్టి రాజకీయ ప్రమేయంలేకుండా, మత,సాంస్కృతిక సంబంధాల వలన భారతదేశం ఆశ్రయమిచ్చింది. లాసా లోని తమ భవనంపై కాల్పులు జరుగుటతో ఇండియాకు వచ్చామని దలైలామా చెప్పినట్లు, నెహ్రూ లోకసభలో తెలియజేసారు.

భారతదేశాన్ని అప్రదిష్టపాలు చేయుటకు చైనా ప్రభుత్వం తరుచుగా "టిబెట్‌లో తిరుగుబాటుకు సహాయంచేస్తూ, ప్రోత్సహించుటయేగాక, అనేక మంది టిబెట్ కాందిశీకులకు ఆశ్రయమిచ్చి, వారిచైనా వ్యతిరేక రాజకీయచర్యలకు మద్దతునిచ్చుచున్నదనే" దుష్ప్రచారాన్ని విస్తృతంగా చేసింది. భారత ప్రభుత్వం టిబెట్ తిరుగుబాటుతో ఎట్టిసంబంధంలేదని నిర్ధ్వందంగా ఖండించింది. దలైలామాతో పాటు కాందిశీకులుగా వచ్చిన వారికి, వారు రాజకీయాలలో కలుగజేసుకొనమని, యిచ్చిన అవగాహన ననుసరించే, అంతర్జాతీయ న్యాయసూత్రాల ననుసరించి, మానవతాదృక్పధంతో ఆశ్రయమిచ్చింది. ఈ కాందిశీకులు రాజకియచర్యలలో పాల్గొనుటకు భారత ప్రభుత్వం యెట్టి ప్రోత్సాహమివ్వలేదు, యివ్వదు.

టిబెట్ తిరుగబాటు అనంతరం, చైనా భారతదేశం, చైనా ప్రాంతంలోని అనేక ప్రదేశాలను

---

*1. నెహ్రూ జవహర్‌లాల్ (1964) జవహర్‌లాల్ నెహ్రూ స్పీచెస్. వా. 4.1957- 1963 పబ్లికేషన్స్ డివిజన్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా (ఆంగ్లంలో) పే.186.*

*2 ---అదే ---- పే. 190*

తమవిగా పేర్కొందని అనునింద, అసంగతం. ఇండియా మ్యాపులు కనీసం 100సంవత్సరాల నుండి, రెండు దేశాల మధ్య సాంప్రదాయ సరిహద్దును సూచించుతూనే వున్నవి. భారత ప్రభుత్వ సర్వేమ్యాపులు అనేక పునర్ముద్రణలై, బహుళ ప్రచారంలో వుండగా, చైనీయులు తమకు తెలియదనుట ఆశ్చర్యం. అనేక సమయాలలో ఈమ్యాపులు అధికారపూర్వకంగా టిబెట్ ప్రభుత్వానికి అందజేయబడినవి. టిబెట్‌లో స్వయంపాలనా ప్రతిపత్తిని చైనా ప్రభుత్వం అణచివేయ నిర్ణయించిన తరువాతే, ప్రధాని చౌయెన్‌లై మొట్టమొదటసారిగా 1959 జనవరిలో, భారత-చైనా సరిహద్దు నిర్ధారణకాలేదని అన్నారు. మార్చి1959లో దలైలామాకు కాందిశీకులకు ఆశ్రయం భారతదేశం యిచ్చిన తరువాత, చైనా ప్రధాని స్పష్టంగా 50 వేల చదరపు మైళ్ళ భారత భూభాగాన్ని తమదిగా చెప్పుట జరిగింది. భారతప్రభుత్వం దానిని ఖండించుట జరిగింది. సరిహద్దు వివాదం రాజకీయ నేపథ్యంలో వచ్చిందనుట స్పష్టం.

టిబెట్ ఘటనలపై భారత ప్రభుత్వ వైఖరిని, నెహ్రూ భారతపార్లమెంటులో దానిని వివరించుతూ చేసిన వివిధ వుపన్యాసాలను, చైనా పీపుల్సు డెయిలి పత్రిక 6మే 1959న సుదీర్ఘ సంపాదకీయంలో "టిబెట్‌లో విప్లవం, నెహ్రూతాత్విక సిద్ధాంతం " అన్నశీర్షికలో తీవ్రవిమర్శ చేసింది.

"టిబెట్ ప్రజలపై స్వచ్ఛందంగా సానుభూతి చూపుతున్నారు. వీరు సానుభూతి చూపేది టిబెట్ ప్రజలపైగాదు, వారిని శతాబ్దాలుగ అణచివేస్తూ, దోపిడిచేస్తూ, తనసంతతిని తానే తినే నికృష్ట టిబెట్‌సమాజాన్ని, బానిసలకళ్ళుపీకించే, గుండెలుతోడించే పెద్దబానిస యజమానుల యెడల మాత్రమే ఈపెద్దబానిస యజమానులు, ప్రభువులు ప్రజావిముక్తి సైనికులు ఖైదీలుగా చిక్కినపుడు నిర్ధాక్షిణ్యంగా హతమార్చినపుడు స్పందించి ఈ మానవతావాదులు కాదనలేదు. కాని ప్రజావిముక్తి సైన్యాలు రక్షణ పోరాటం చొరవను తమ చేతులలోనికి తీసుకొని పోరాటాన్ని తీవ్రతరం చేసి తిరుగు బాటు దారులపై విజయాలను సాధించునపుడు, "దుర్ఘటన", "సానుభూతి", "మానవత్వం", "స్వపరిపాలన", "స్వాతంత్ర్యం" అనే మాటలు ప్రవాహంగా వచ్చాయి. ఈ కారణంగానే "అపవిత్రఐక్యత" అమెరికా, బ్రిటన్ సామ్రాజ్యవాద శక్తుల నుండి, సింగ్‌మన్‌రీ, ఛాంగ్‌గైషేక్, ఇండియాలో ప్రజాసోషలిస్టులు, జనసంఘం, అభివృద్ధినిరోధకుల కూటమి యేర్పడి, కుట్రలు, మోసాలుతో భారతదేశానికి, భారత చైనా మైత్రికి వ్యతిరేకంగా, నెహ్రూ ఆకూటమిలోనికి నెట్టబడి, ప్రధాన పాత్రదారిగా టిబెట్‌పై సానుభూతి అనే ఉద్యమంలోనికి రెండు పులులు పోరాడుతుంటే, తాము కొండపై నుండి వీక్షించ తలచే ఉచ్చులో భారత ప్రధాని నెహ్రూ పడిపోవుటే మమ్ము ఆశ్చర్యరకితులను చేస్తున్నది. "మా మిత్ర దేశపు ప్రధాన మంత్రి నెహ్రూ ప్రపంచ ప్రఖ్యాత రాజకీయవేత్త, మరుపరాని చైనా మిత్రుడు, సామ్రాజ్యవాద దురాక్రమణ యుద్ధ వ్యతిరేకి సమాజాభివృద్ధికై వెలుగును ప్రసరింపజేసిన వ్యక్తితో వాగ్వివాదం జరుపవలసిన స్థితికి మేము నెట్టబడుటకు మేమెంతో భాదపడుతున్నాము. సంస్కరణల పేరుతో వారికేమి జరుగుతుందోనని నెహ్రూ భయపడుట మేము హర్షించజాలము. చైనా మొత్తంపై ప్రధాన మంత్రి సానుభూతి చూపినపుడు, హన్‌జాతీయులైన పెద్ద భూస్వాములపై

సానుభూతి చూపలేదు. చైనాలో భాగమైన టిబెట్‌పై సానుభూతి చూపుట అంటే టిబెట్ లోని చిన్న ఛాంగ్‌గైషేక్‌లకు సానుభూతి చూపుట అగుతుంది.

టిబెట్‌లో ఎట్టి జోక్యం కలుగ జేసుకొనలేదని నెహ్రూ, దశాబ్దాల నుండి భారత్ ప్రదర్శించిన స్నేహ, సౌభ్రాతత్వాలను యేకరువుపెట్టారు. ఒక దేశపు అంతర్గత విషయాలలో మరొకదేశము కలుగజేసుకొనుట వివిధ రూపాలలో వుండవచ్చు, భారత ప్రభుత్వం యేవిధంగాను కలుగజేసుకొనలేదని నమ్మించజాలదు. చైనా ప్రభుత్వం టిబెట్‌లో తనసైన్యాలు ప్రవేశించుటకు ఆజ్ఞలు పంపుతూ, సంప్రదింపులకు టిబెట్ స్థానిక ప్రభుత్వ ప్రతినిధులను ఆహ్వానించింది. చైనా సార్వభౌమాధికారంలోని టిబెట్‌లో యిదిపూర్తి ఆంతరంగిక విషచయం. అయినా భారత ప్రభుత్వం అక్టోబరు 1950లో రెండు నోటులను, నవంబరులో మరోనోటు పంపుతు, చైనా సైనికుల టిబెట్ ప్రవేశం, ఆక్రమణగ తప్పమరోవిధంగా పరిగణించ జాలమని, కారణంలేకుండా జరిగినదని, విచారకరమని, భారత ప్రభుత్వం " అత్యంత ఆశ్చర్యకరము, సంతాపకరమైనదిగా తలంచు చున్నాదని ప్రకటించింది". చైనా ప్రభుత్వం సమాధానంగా,టిబెట్‌లో చైనా సైన్యం ప్రవేశించుతూ జాతీయ సార్వభౌమాధికారాన్ని అమలు చేసిందని,అది ఆంతరంగిక సమస్యయని, ఎట్టివిదేశీయ జోక్యం సహించేదిలేదని తెవిపింది. అంతేగాక, ఇండియలో వున్న టిబెట్ స్థానిక ప్రభుత్వ ప్రతినిధి వర్గం, టిబెట్‌యన్ సైన్యం ఘోరపరాజయం పొందిన తరువాత 1951 ఏప్రిల్ చివరకుగాని సంప్రదింపులకు పెకింగ్ రాలేదు. సంప్రదింపుల అనంతరం17 అంశాల శాంతియుత విముక్తి వొప్పందం మే 1951లో జరిగింది. ఈ కథనాన్ని గుర్తుచేయుట అంతగా రుచించకపోయినా, వాస్తవఘటనలు, వాస్తనాలు చైనా పత్రిక వ్రాసిన మరొకవిషయాన్ని వుదహరించవలసి వున్నది. నెహ్రూ "టిబెట్‌లో స్వపరిపాలనపై, టిబెట్-చైనాల మధ్య జరిగిన వొప్పందం, భారతదేశానికిచ్చిన హామీలు పెకింగు అమలుపరచలేదు. అక్కడ సైనిక చర్య జరుగుచున్నదని" ఏప్రిల్ 13న "టిబెటియన్ ప్రజలు తమస్వపరిపాలనను కొనసాగించి, అనునభవించగలరని, యితరులు దానిని అణచివేయలేరని హృదయకాంక్ష" అని ఏప్రిల్14న అన్నారని వ్రాసింది. "ఇవన్నీ, చైనా ఆంతరంగిక విషయాలలో కలుగజేసుకొనుటగాక, యేమతుందని" పశ్నించింది. ఇంకా "దలైలామాకు భారత ప్రభుత్వం బ్రహ్మాండమైన స్వాగతంచెప్పుట, ముస్సోరిలో నెహ్రూ స్వయంగా స్వాగతం చెప్పుట, తిరుగుబాటు దారుల సమావేశంలో వుపన్యసించుట మిత్రదేశం చేయవలసిన పని యేనా" అనిచైనా పేపరు ప్రశ్నించింది. కాంగ్రెసు శెక్రటరీ శ్రీమతి సుచేతా కృపాలానీ టిబెట్ స్వయం పాలిత దేశమని ప్రకటించి, కాంగ్రెసుతో సహా అన్ని పార్టీలుగల టిబెట్ సహాయకమిటీని యేర్పరచి, టిబెట్ సమస్యను ఐక్యరాజ్యసమితికి సమర్పించాలని ఎందుకు కోరిందని ప్రశ్నించింది. ఇది పంచశీల సూత్రాలను పాటించుటయేనా" అని ప్రశ్నించింది.

భారత ప్రభుత్వానికి టిబెట్‌ను ఆక్రమించాలనిలేదని, అదే విధంగా పూర్తిస్వాతంత్ర్యం కలిగి వుండరాదని కాని, చైనా టిబెట్‌పై సర్వాధికారాలను పొందుటకు యిష్టంలేదు.

భూటాన్, సిక్కింలవలే రహదారి, తంతిసమాచార, విదేశీసంబంధాలలో భారతదేశానికి లోనైన, స్థానిక స్వపరిపాలనలాంటిది. టిబెట్‌లో వుండాలని భారతదేశపు వాంఛలాగ కన్పించు చున్నదని పీపుల్సుడెయిలీ పత్రికవ్రాసింది. భారత టిబెట్‌కు కావాలనే స్వపరిపాలన, జాతీయ ప్రాంతీయ స్వపరిపాలనకు భిన్నమైనది, చైనా రాజ్యాంగం ఆమోదించనిది.

చైనా ప్రభుత్వం, కమ్యూనిస్టుపార్టీనాయకత్వం, సామ్రాజ్యవాద వ్యతిరేక అలీన దేశాల బాండుంగు వైఖరిని, పంచశీలసూత్రాలు తదితర సమిష్టి అవగాహనలను విడనాడి, పీపుల్సుడెయిలీ "6మే1959లోని సుదీర్ఘ సంపాదకీయం" టిబెట్‌లో "విప్లవం, నెహ్రూ తాత్వికసిద్ధాంతం" అన్న శీర్షికతో వివరించబడిన భారత ప్రభుత్వ విధానాలను, ప్రధాని నెహ్రూ ఆలోచనా, అవగాహనలను విశ్లేషణగావించి, అందుండి చేసిన తమ అవగాహనలు, నిర్ధారణల స్పూర్తితోనే చైనా ప్రభుత్వచర్యలు అని మనం అర్ధచేసుకొనవలసివుంటుంది. అదే కాలంలో చైనా చేబట్టిన " కమ్యూనిజంలోనికి వేగంగా పురోగమనం", "పెద్దగా దూకుట" "ప్రజాకమ్యూనులు" అనేనినాదాలతో అతివాదం వైపు పయనించిన నెపథ్యంలోనే, చైనా-భారత సరిహద్దు వివాదాన్ని అర్ధంచెసుకోవాలి.

# 3

## భారత - చైనా వివాదం, చారిత్రికాంశాలు

జమ్మూ - కాశ్మీర్ సంస్థానం, చైనా సింకియాంగ్ సరిహద్దు అయిన వాయువ్య ఉత్తర ప్రాంతాలకు సంబంధించిన టిబెట్‌కు వాయువ్య తూర్పు సరిహద్దులకు సంబంధించిన, భారత - చైనా అధికారుల 1960 సమావేశంలో మన ప్రభుత్వం చూపిన సాక్ష్యాధారాలు లడక్, మరోవైపు సింకియాంగ్, టిబెట్ సరిహద్దులను, వాటి పరిమితులను, ఆనవాయితీగా, సాంప్రదాయంగా శతాబ్దాలనుండి, వివాద రహితంగా, స్పష్టంగా వుండుటను తెలియజేస్తుంది.

**పశ్చిమ సరిహద్దు :**

లడక్ రాజుల పత్రాలు, లాద్వాగ్స్‌ర్గియల్ రాబ్స్‌ల 10వ శతాబ్ధపు లిఖిత ఆధారాలు, లడ్‌క్ సరిహద్దు సాంప్రదాయంకంగా, అందరికి తెలిసినదిగా స్పష్టం చేస్తున్నవి. ప్రధాన సరిహద్దులను వివిధ దేశాల యాత్రికుల కథనాలు, వివరణలు యిస్తున్నవి. ఈ యాత్రికులలో డిసిడెరి (1751), బెయిలీ ఫ్రెజర్ (1820), కనింగ్ హామ్ (1854), నైన్‌సింగ్(1873), కారె (1885-87), బౌవెర్(1891), వెల్‌బీ (1898), డెయిసీ (1900) ముఖ్యులు.

భారత దేశం వివిధ రకాల అనేక లిఖిత పత్రాల సాక్ష్యాధారాలను వివిధ దేశాలలోని మ్యాపులలో చూపించిన సరిహద్దులను తన వాదనలను బలపరుస్తూ చూపించింది. సింకియాంగ్ దక్షిణ సరిహద్దు క్యూయిన్ పర్వతశ్రేణి దక్షిణానికి విస్తరించియుండలేదని చూపు 6వ శతాబ్దపు చైనా మ్యాపులను చూపించింది. ఆ పర్వత శ్రేణి వరకు కూడ చైనా 19వ శతాబ్దపు చివరకు చేరిందని రుజువు చేసింది. ఇవి అక్సాయ్‌చిన్ పీఠభూమి

లింగ్‌జీటాంగ్ మైదానాన్ని చైనా యెప్పుడూ చేరలేదు. నెయిఫూయుటు (1760), హిసియుటు చీహో(1762)ల ప్రసిద్ధ రచనలలోని సంక్షిప్తాలు, మ్యాపునం.6, టాచింగ్‌హుయిటెన్ (1818), సియాన్ చియాంగ్ లూహి (1821) మ్యాపు నెం.:7, సియూషియూటావ్ చి (1824), సిన్ చియాంగ్‌టుచి (1911) రచనల నుండి సంక్షిప్తాలు అధికార సాక్ష్యాధారాలుగ చూపుట జరిగింది. ఆ మ్యాపులు భౌగోళికంగా సరియైనవే గాక వారి స్వహస్త విరచితాలు, అధికార పూర్వకమైనవి, చైనా చట్టాలననుసరించినవి. అందులో అధునాతనమైన 8 సెప్టెంబర్ 1936 ప్రభుత్వ ఆర్డినెన్సు, మ్యాపులు, చార్టుల పరిశీలనకు సంబంధిచినది, కేంద్ర ప్రభుత్వ ప్రత్యేక అనుమతి లేకుండా ఆ దేశంలో ప్రకటించబడనివి. అందులో 1893లో కాష్గర్‌లోని బ్రిటిష్ కౌన్సిలర్, చైనా అధికారి హంగ్‌టా చెన్‌కు సమర్పించినవి. చైనా ప్రభుత్వంచే ప్రకటించబడినవి. 1917లోని పోస్టల్ అట్లాస్‌లోని మ్యాపు, 1919, 1933లలో ఆక్సాయ్‌చిన్ ప్రాంతాన్నంతా, లింగ్జిటాంగ్ అంతా భారతదేశంలోని భాగంగా చూపించబడి వున్నాయి.

ఆక్సాయ్‌చిన్ ప్రాంతం, చైనా సాక్ష్యాధారాలు లేకుండా యెల్లపుడూ తమ అధీనంలో వున్న దానిలాగ చెపుతున్నది. పశువులకు బీడులుగా, వ్యాపార, వేట ప్రాంతాలుగ, రాతి వుప్పు సేకరించు ప్రాంతాలుగ నేడు చెపుతున్న ఆక్సాయ్‌చిన్ తదితర ప్రాంతాలు లడక్ ప్రజల వుపయోగములో వున్నవనుటకు తగిన ఆధారాలను, పత్రాలను భారత ప్రభుత్వ పక్షం చూపించింది. ఆ భాగపు అత్యధిక ప్రాంతంలో జన సంచారం లేనప్పటికి, వందల సంవత్సరాలు భారత దేశ పాలక వర్గాల అధికారంలో వున్నదనుటకు అధికార పత్రాల రుజువులను, సాక్ష్యాధారాలను ప్రదర్శించింది. కాశ్మీర్ ప్రభుత్వం పోలీసు చెక్ పోస్టులను కొనసాగించుటను, ఆక్సాయ్‌చిన్ ఉత్తర ప్రాంతంలో 1865 పురాతన కాలంలోనే ఆధార పత్రాలను చూపించింది. చైనా నేడు తమదే అంటున్న ప్రాంతంలో శిస్తు నిర్ణయ నివేదికలు, అనేకం వున్నవి. ఆక్సాయ్‌చిన్, చాంగ్ చెన్మొలోయ మొత్తం, టాంక్సె, లడక్ తహశీలులలోని ఇలాక్‌లోనివని, 1908-9 రెవిన్యూ మ్యాపును చైనా పక్షానికి పరిశీలనకు అందచేయుట జరిగింది. చైనా పక్షం వాటిని కాదనలేకపోయింది. వాటిపై ఆధిపత్యం వివిధ సరిహద్దు ప్రాంత గ్రామాల శిస్తు సేకరణ అధికార పత్రాలను దశాబ్దాల వారిగ చూపించుట జరిగింది.

ధెంచౌక్ దక్షిణాన వున్నది. దానికి సంబంధించిన పరిపాలన, రెవిన్యూ సెటిల్‌మెంటు, జనాభా లెక్కల సేకరణ యిత్యాది 19 ప్రముఖ అదికార సాక్ష్యాధారాలను 1865 నుండి వర్తమాన కాలం వరకు గల అధికార పత్రాలను ప్రదర్శించింది. కనీసం 19వ శతాబ్దం నుండి గల వ్యాపార సంబంధాలు, ఆ ప్రాంతంలోని బాటలను కాశ్మీర్ ప్రభుత్వ అధీనంలో వున్న వనుటకు సాక్ష్యాధారలను అందించింది. ఆంగ్ల భారత ప్రభుత్వం 1870లో కాశ్మీర్ ప్రభుత్వంతో వ్యాపార మార్గాలను సర్వే చేయుటకు, చాంగ్ చెన్మొలోయ ప్రాంతంతో సహా పరిశీలించుటకు అధికార వొప్పందాన్ని చేసుకొన్నవి. దెంచౌక్, కుర్మాక్ ప్రాంతాలలో, చాంగ్ చెన్మొలోయ అంతటా వేట సాగించుటకు చట్టరీత్యా శాసనాన్ని కావించింది. నేటి వరకు భారత అధికారులు క్రమంగా పర్యటించుతు, సర్వే బృందాలు, గస్తీ దళాలు ఎప్పుడూ సాంప్రదాయ సరిహద్దు వరకు గస్తీ తిరుగుతునే వున్నవి.

సాంప్రదాయ సరిహద్దులను లడక్-టిబెట్‌లు 1684లోను, లడక్-టిబెట్ చైనాతో సహా 1842లో జరిగిన ఒడంబడికలను భారత ప్రభుత్వం చూపెట్టింది. బ్రిటిష్ భారత ప్రభుత్వం చైనా కేంద్ర ప్రభుత్వాల మధ్య జరిగిన రాయబార వుత్తర, ప్రత్యుత్తరాలు ధృవపరుచటను, స్థానిక వొడంబడికలు. రెండు ప్రభుత్వాల సరిహద్దు అధికారల మధ్య 1852లో జరిగిన స్థానిక వొడంబడికలను, ఆధార సాక్ష్యాలను భారత ప్రభుత్వం చూపెట్టింది.

చైనా పక్షం తమ వాదనను బలపరుస్తూ ఎట్టి సాక్ష్యాధారాలను చూపెట్టక పోగా, మరో 2,500 చ.మై. భారత భూభాగాన్ని, వారి 1956 మ్యాపుకు వ్యతిరేకంగా, తమదని చూపెడుతూ మరో మ్యాపును తాజాగా చూపెట్టింది.

పశ్చిమ ప్రాంతంలో "వాస్తవాధీన రేఖ"గా పేర్కొనబడుతున్నది, తమదిగా చైనా చెప్పుతున్నది. 7 నవంబరు 1959న వున్నదంటున్నది. 1960లో భారత భూభాగంలోని మరికొన్ని స్థలాలను తమవిగా చెప్పుకొంటున్నవి మ్యాపులలో చూపబడిన వాటికి భిన్నంగా వున్నవి.

**మధ్య సరిహద్దు ప్రాంతం**

సహజ, భౌగోళిక ఆధారంగా హిమాలయ పర్వతశ్రేణి నీటివాలు రేఖ మద్దతునే గాక సాహిత్య, మత సాంప్రదాయక, పురాతన లిఖిత ఆధారాలు, మధ్యప్రాంత సరిహద్దు నిర్ధారణలను ఆశ్చర్యాన్ని గొల్పే విధంగా నేటి సరిహద్దులను స్పష్టం చేస్తున్నవి. సిప్టి ప్రాంతం లోయలోని కౌరిక్, గైయును, నిలాంగ్ - జాదాంగ, బారాహోతి, సాంగ్చామల్లా, లాప్తాల్ చరిత్ర పుట్టిన నాటినుండి భారత రాజ్యాలలోని ప్రాంతాలున వున్నవి. సరిహద్దు పురాతన భారత రాజ్యాల బషాహర్ గార్వాల్ నీటి పారుదల సరిహద్దులను సాంప్రదాయకంగా బలపరిచే అనేక లిఖిత పురాతన ఆధారాలున్నవి. వీటి గురించి తెలిపిన వారిలో ఫరిస్తా చరిత్రకారుని వొకనిగా పేర్కొనవచ్చును. ప్రఖ్యాత చైనా యాత్రికుడు హుయాన్ సాంగ్ యీ ప్రాంతాన్ని 7వ శతాబ్దంలో సందర్శించి, యీ ప్రాంతం భారత దేశంలో భాగంగా వుదహరించి, భారత దేశ వాదనకు బలాన్ని చేకూర్చాడు. ఈ ప్రాంతాలు 8వ శతాబ్దం తరువాత వరుసగా కట్యూరి, చంద్, పాల, మల్లలు పాలించగా, గార్వాలీరాజులు 18వ శతాబ్దపు ద్వితీయ భాగం వరకు పాలించారు. తరువాతనే పాల్ రాజులు కొన్ని ప్రాంతాలను ఆక్రమించగా, 1815లో అప్పటి భారత ప్రభుత్వం తిరిగి పొందగలిగింది. భారత ప్రభుత్వం గత 150 సంవత్సరాల అనేక ప్రమాణ పత్రాలు, పరిశీలకుల, యాత్రికుల కధనాలను హిమాలయ పర్వతశ్రేణి నీటివాలు సరిహద్దును బలపరుస్తూ సాక్ష్యాధారాలను ప్రదర్శించింది. సరిహద్దులను బలపరిచే అనేక బ్రిటిష్ అనధికార మ్యాపులనే గాక, జర్మనీ, రష్యా, ఫ్రాన్స్ అన్నిటిని మించి ప్రత్యేకించి రెండు చైనా మ్యాపులను సాంప్రదాయక సరిహద్దులను బలపరుస్తూ చూపెట్టింది. ప్రతి ఒక్క స్థలానికి ప్రాంతానికి సాక్ష్యాధారాలను చూపెట్టింది. వివాద ప్రాంతాలు అనబడేవి ఎల్లప్పుడూ, భారత ప్రభుత్వ అధీనంలో వున్నవని, శిస్తు వసూలు రికార్డులు, అధికార గ్రామ మ్యాపులు, అధికారుల పర్యటన కధనాలు రుజువులుగా చూపెట్టింది. బాటల నిర్మాణాలు, భౌగోళిక, నైసర్గిక సర్వేల నివేదికలు చూపెట్టింది. శిస్తు నివేదికలు ముఖ్యంగా నిలాంగ్, జటదాంగ్‌లకు సంబంధించి 1868 నుండి 1951 వరకు యేయే గ్రామాలు ఎక్కడ నుంచి

ఎక్కడ వరకు గలవో, వివిధ రకాల భూములు, విస్తీర్ణాలు, అడవుల వివరాలు అన్నీ వివరంగా యివ్వబడినాయి. నేటి వరకు ఎడతెగకుండా భారత ప్రభుత్వం అధీనంలో వుండుటను అత్యంత శ్రమపడి చూపించారు. అధికారుల సంప్రదింపులలో చైనా అధికారులకు యీ సాక్ష్యాధారాలన్నిటిని చూపెట్టి, శాంతియుత పరిష్కారాన్ని ఆశించారు.

చైనా ప్రభుత్వానికి కూడా యీ ప్రాంతంలో సరిహద్దు ఎక్కడ వున్నదో నిస్సందేహంగా తెలుసు, 1954లో జరిగిన భారత-చైనా వొడంబడిక సరిహద్దు లోయల మార్గాలను స్పష్టంగా, మధ్య ప్రాంత సరిహద్దుకు సంబంధించినంత వరకు వుదహరించుట కూడా జరిగింది. ఆ విధంగా సాంప్రదాయ సరిహద్దును ధ్రువీకరించింది. ఎట్టి సందేహము సరిహద్దుల విషయమై వున్నా వొడంబడికపై సంతకాలు జరుగునప్పుడు లేవనెత్తుటకు తగిన సమయంగా వుండేది. రెండు పక్షాలకు సరిహద్దులు తెలియకుండానే శాంతియుత సహజీవన పంచశీల సూత్రాలలోని, ఇరుదేశాల దేశ సమగ్రతలను గౌరవించుటను ఆమోదించి సంతకాలు చేయుట జరిగిందని వూహించజాలము.

**తూర్పు సరిహద్దు ప్రాంతం**

" ఈ ప్రాంతంలో నివశించేవారు టిబెటియనులు లేక వారికి దగ్గరి సంబంధం కలిగిన వారుగా చాలాకాలం నుండి వున్నారు". అని చైనా వాదనగా వుంది. జాతి రీత్యా టిబెటియనులకు చెందిన వారని చైనా చెప్పుకొనుట చేస్తున్నది. చౌయెన్‌లై 9 జూలై 1957లో చైనా జాతీయ ప్రజా కాంగ్రెసు 4వ మహాసభలో చేసిన ప్రకటనను పరిశీలించిన ఆ వాదనలోని అవాస్తవికత బహిరంగమవుతుంది. చైనా ప్రధాన మంత్రి యీ క్రింది విధంగా అన్నారు". సరిహద్దు సమస్య, చైనా-బర్మా సరిహద్దలలో కొన్ని ప్రాతాలలో విస్తారంగా నివశించే ఉపజాతుల ప్రయోజనాలకు నేరుగా సంబంధం కలిగివుంది. ఆ కారణంగా ఈ సమస్యను పరిగణించునపుడు వారి ప్రయోజనాలను ప్రత్యేకంగా గమనించవలసి వుంటుంది. ఒక విస్తీర్ణ ప్రాంతంలో నివశించే ఉపజాతులు సరిహద్దుకు ఆవలి తట్టున, యీవలి తట్టున వుండుట మనకు తెలుసు. ఇది చారిత్రకాభివృద్ధి ఫలితంగా జరిగింది. చైనా - బర్మా సరిహద్దు నిర్ధారణ జరిగిన వివిధ ప్రాంతాలలో ఒకే జాతి ప్రజలు సరిహద్దుకు రెండువైపులా నివశించి వుండుటను చూపగలము. చైనా-బర్మా సరిహద్దును నిర్ధారణ కానిదానిని నిర్ణయించునపుడు జాతులను చీల్చకుండా వుండుట కష్టతరమైన సమస్యఅగుతోంది.

ఈ చారిత్రికాంశాల మౌలికాభిప్రాయాలను భారతదేశమూ కలిగివుంది. ఆఫ్రో-ఏసియన్ దేశాలలో వాస్తవంగా భారత దేశపు తూర్పు ప్రాంతంలో సరిహద్దుల విషయమై వారివైఖరిపై అభిప్రాయానికి విరుద్ధంగా వుంది. ఇండియాలో వివిధ జాతులు, ఉప జాతులు, తెగలు, ప్రజలు ఒకే విధమైన పౌరసత్వాన్ని అనుభవించుతున్నారు. వేలకొలది టిబెటియన్ జాతీయులు భారతీయ పౌరులుగా వున్నారు. గతంలో టిబెటియన్ చరిత్ర గలిగిన వీరు భారత దేశపు దేశభక్తులుగ వున్నారు.

ఈశాన్య ఏజన్సీ ప్రాంతం భారత సార్వభౌమాధికారంలో వుంది. వివాదాంశంగా యెప్పుడూ లేదు. అధికారల సంభాషణలు 1960లో జరిగి పర్వత దిగువ ప్రాంతం, ప్రధాన హిమాలయాలు, పర్వత పాద ప్రాంతాలు మధ్య ప్రాంతం, ఎప్పుడు ఏ విధంగా భారత భూభాగంగా వుందో తెలియజేయుట జరిగింది. అవిభాజ్య భారత దేశపు పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతంలో, దేశపు మధ్య భాగంలో వివిధ ఆటవిక తెగల, జాతులపై పాలనాధికారాలను కలిగి వుండుటను అదేవిధంగా, అహోం రాజుల పాలనాధికారాలను పొందిన బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం ఈశాన్యపు తెగల, జాతులపై పాలనాధికారాలను కలిగి వుంది. ఈ ప్రాంతంపై భారత దేశం సార్వభౌమాధికారం కలిగివుందనుటకు సరైన సాక్ష్యాధారాలున్నవి.

ఈ ఆటవిక తెగల ప్రత్యేకతలను రక్షించుటకు గాను ప్రత్యేక పరిపాలనా రూపాలను, రూపొందించుట జరిగింది. ఈ ప్రాంతాలలోనికి బయటి వారి ప్రవేశంపై ఆంక్షలు విధించబడినవి. పరిపాలనలో విడిగా చూపుటకు బ్రిటిష్ మ్యాపులలో అంతర విభజన రేఖ, సాధారణ పాలన ప్రాంతాల నుండి విడిగా చూపుటకు అనుసరించబడింది. అంతర పరిపాలన రేఖ సాధారణ పరిపాలన ప్రాంతాల పరిమితిని, అంతర్జాతీయ సరిహద్దు రేఖకు, ఉన్నత హిమాలయ పర్వత శ్రేణుల నీటి వాలుకు భిన్నంగా చూపబడింది. రాజకీయ అధికారుల సంవత్సరిక నివేదికలు 19వ శతాబ్దపు మధ్యనుండి నిరవధికంగా పాలనాధికారాన్ని వహించుటను స్పష్టంగా బ్రిటిష్ అధికారుల ప్రత్యేక పాలనను తెలియచేస్తుంది. ఈ ప్రాంతాలు ఎల్లప్పుడూ భారతదేశానికి చెందిన వనుటకు, వివిధ శాసన చట్టాలు, పరిపాలన సూచనలు స్పష్టం చేస్తున్నవి. ఇండియా 1873, 1880,1884 1914, 1919, 1928, 1929, 1935 వివిధ చట్టాలు, 1950 భారత రాజ్యాం చట్టము యీ విషయాన్నే స్పష్టం చేస్తున్నది.

ఇందుకు భిన్నంగా, చైనా తమవని అంటున్న ప్రాంతాలపై హిమాలయ పర్వతశ్రేణి నీటి వాలు దక్షిణ ప్రాంతాలపై తమ పరిపాలనాధికారము చూపించే ఒక్క చట్టాన్ని గాని, యే యితర సాక్ష్యాధారాలను చూపజాలక పోయింది. ఒకే వొక మతాధికార సంబంధ పత్రాన్ని మాత్రం చూపగలిగినా, సార్వభౌమాధికారాన్ని కలిగి యుండుటను చూపజాలక పోయింది.

*ఈ ప్రాంత సరిహద్దు విషయమై చివరి అంశంగా, మెక్‌మహన్ 1914 వొప్పందాన్ని ప్రస్తావించవలసి వుంది.*

ఈ సహజ, సాంప్రదాయ, ఆచరణలో ఆనవాయితిగా వున్న సరిహద్దు 1914లో మెక్ మాహన్ వొప్పందంగా, చైనా ప్రభుత్వం ఎరుకతో భారత, టిబెట్‌యన్ ప్రభుత్వ ప్రతినిధులచే సంతకాలు చేయబడినది. వాస్తవానికి ఒప్పందం జరిగిన సిమ్లా సమావేశంలో, చైనా ప్రభుత్వంతో సహా భారత్, టిబెట్ మూడు దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు. నిజానికి చైనా ప్రభుత్వం టిబెట్‌ను ప్రతినిధికి పూర్తి అధికారాన్నిచ్చింది. దలైలామా పేరుతో పూర్తి అధికారాలు పొందిన టిబెట్‌ప్రతినిధి అధికారాన్ని ఎట్టి పరిమితులు లేకుండా చైనా ప్రభుత్వం ఆమోదించింది. అయితే తదనంతర చర్యగా బ్రిటిష్ ప్రతినిధి రహస్యలేఖల ద్వారా టిబెటన్

ప్రతినిధితో ఉత్తర ప్రత్యుత్తరాలతో ఒప్పందం జరిగింది. దలైలామా నుండి, భారత-చైనా-టిబెట్‌కు సంబంధించిన అన్ని సమస్యలుపై పూర్తి అధికారాలు యివ్వబడినవి. చైనా ప్రభుత్వం అంతర్జాతీయ సమావేశాలలో రాయభార ప్రతినిధులు సార్వభౌమాధికారం గల ప్రభుత్వాల ప్రతినిదులుగ వ్యవహరించు రాయబార విధానాలననుసరించింది.

చైనా ఒడంబడికను తదుపరి ధృవపరచలేకపోయినా, ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా 24, 25 మార్చి 1914 తేదీలలో జరిగిన ఒడంబడిక చెల్లనిది కాదు. బ్రిటీష్ టిబెటన్ ప్రతినిధులు సంతకాలుచేశారు. ఉభయ దేశాల అధికారుల సమావేశాలలో చూపిన ఆధారాలు, టిబెట్ ప్రాదేశికమైనవే గాక, సరిహద్దుల విషయమై చైనా ప్రభుత్వ ఆమోదంతో టిబెట్ ప్రతినిధులు, సరిహద్దుల నిర్ధారణలలో పాల్గొనుట జరిగింది. ఇండియా-టిబెట్ సరిహద్దు ఒడంబడికలలోని పశ్చిమ, మధ్య ప్రాంత అంశాలను ఆమోదించతు, అందులోని భాగమైన తూర్పుప్రాంత, మెక్‌మెహన్ ఒడంబడికను ఆమోదించకపోవుట సహేతుకంగా లేదు. చైనా ప్రభుత్వం, 1947లో భారత దేశానికి అధికార మార్పిడి అనంతరం అప్పటివరకు వున్న సంధి, ఒడంబడికల హక్కులు, భాద్యతలను వహించుచున్నదాయని విచారించింది. ఇండియా-చైనా ఒడంబడికలు భిన్నమైనవిగా కూడా వుదహరించింది. ఇది అత్యంత బలవత్తరమైన ఆధారం, మెక్‌మాహన్ సరిహద్దు ఒప్పందంను చైనా ప్రభుత్వం గుర్తించింది అనుటకు యిది సుముఖ ఆధారమని, భారత ప్రభుత్వపు అభిప్రాయంగా వుంది. కరుణాకర గుప్త తన "స్పాట్‌లైట్ ఆన్ సినో-ఇండియన్ ఫ్రాంటియర్స్" అనే గ్రంధంలో భారత చైనా సరిహద్దులకు సంబంధించిన చారిత్రకాంశాలను దాచిపెట్టబడిన వాటిని, ఫోర్జరీ చేసిన వాటిని, వికృత విపరీత అసంఘటిత వ్యాఖ్యలను పరిశోధించి బ్రిటిష్ ప్రభుత్వపు కుటిల రాజనీతిని బట్టబయలు చేశారు. ఇది ప్రత్యేకంగా చివరి భాగంలో వివరించబడింది.

# 4

# సరిహద్దు సాయుధ గస్తీదళాల సంఘర్షణలు

ప్రధాని నెహ్రూ, చైనా ప్రధాన మంత్రి చౌయెన్‌లైని న్యూఢిల్లీ ఆహ్వానించుట, సరిహద్దు సమస్యలను శాంతియుతంగా పరిష్కరించుకొనుటకు మార్గాలను ఫిబ్రవరి 1960లో అన్వేషించుట, విజయాన్ని పొందజాలకపోవుట, భేదాభిప్రాయాలను ఉన్నతాధికారులు పరిశీలన సాగించుటకు ఆమోదించుట ముందు పర్వంలో తెలుకొన్నాము. 1960 అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీల సమావేశంలో సరిహద్దు సమస్యపై భారత కమ్యూనిస్టుల అభిప్రాయాలను అజయ్‌ఘోష్ సుదీర్ఘ వుపన్యాసంలో వివరించుటను తెలుసుకొన్నాము. సరిహద్దు సమస్య తదనంతర కాలంలో తీవ్ర పరిణామాలకులోనైన క్రమాన్ని క్లుప్తంగా తెలుసుకొందాం.

వాయువ్య సరిహద్దు ఏజన్సీ కామెంగ్ సరిహద్దు డివిజన్‌లో 5మైళ్లలోన భారత

భూభాగంలో వున్నతక్తసాంగ్, గోంపాలోనికి, 3 జూన్ 1960లో వొక పెద్ద చైనా సైనిక దళం ప్రవేశించిందని భారత ప్రభుత్వం ప్రకటించింది. తరువాత జూన్ 25న సురియాలోనికి చైనా సర్వే పార్టీ ప్రవేశించుటతో జూన్ 29న తక్తసాంగ్, గోంపాలలోనికి చైనా సైనికుల ప్రవేశానికి తన అసమ్మతిని అధికార రీత్యా తెలియచేసింది. అంతేగాక, మార్చి 1960 నుండి 52 సార్లు, టిబెట్ నుండి వెళ్ళు చైనా విమానాలు భారత ఆకాశమార్గాన్ని అతిక్రమించుటను చైనా ప్రభుత్వ దృష్టికి భారత ప్రభుత్వం తెచ్చింది. సిక్కింలోని జెల్లిప్లాపాస్ వద్ద చైనా గస్తీ దళం సరిహద్దును దాటి 22 సెప్టెంబరులో రాగా, 27న సిక్కింలోనికి చొరబడి వచ్చుటకు భారత ప్రభుత్వం తన అసమ్మతిని తెలియజేసింది. పశ్చిమ ప్రాంతంలోని హాట్‌స్ప్రింగ్స్ పరిసరాలలోకి చైనా సాయుధ దళం 13 అక్టోబరులో ప్రవేశించింది. సరిహద్దు అతిక్రమణలు జరిగిన ప్రాంతాలన్నీ చైనా తమ భూభాగంలోనివని చెప్పుకొనుట ప్రారంభించింది.

భారత ప్రభుత్వం, సరిహద్దు సమస్యపై రెండు పక్షాల అధికారుల నివేదికలను 14 ఫిబ్రవరి 1961లో ప్రకటించింది. విస్తార ఆధారాలతో సాంప్రదాయకంగా పరిగణింపబడుతున్న సరిహద్దులలోని భారత భూభాగంలోని 50 వేల చదరపు మైళ్ళ ప్రాంతాన్ని తమదిగా చెబుతున్నదని, చట్టవ్యతిరేకంగా 12 వేల చదరపు మైళ్ళ భారత ప్రాంతాన్ని ఆక్రమించిందని నివేదిక స్పష్టం చేసింది. చైనా ప్రభుత్వం అట్టి నివేదిక వున్నదని వొప్పుకొనక, చివరికి అయిష్టంగా కుదించిన చైనా భాగాన్ని మే1962లో ప్రకటించింది. ఏప్రియల్ 20న చైనీయులు సిక్కింలోని జెలెప్లాపాస్‌ను దాటారు. పశ్చిమ సరిహద్దు ప్రాంతంలోని చుషుల్ భారత భూభాగంగా చెప్పబడుతున్న ప్రాంతంలోనికి చైనీయులుచొరబడ్డారు.

మన విదేశాంగ శాఖ కార్యదర్శి కౌల్ మంగోలియాకు పెకింగ్ గుండా వెళుతూ చైనా ప్రభుత్వ ప్రతినిధులను జూలై 13న కలుసుకొని రెండు ప్రభుత్వాల వుద్యోగులు సమర్పించిన నివేదిక ఆధారంగా యేమైనా పురోగమనంకు అవకాశాలున్నవాయని తెలుసుకొనుటకు తిరిగి ఢిల్లీ వచ్చే ప్రయాణంలో ప్రయత్నించాడు. జూలైలో చైనా గస్తీదళం, కామెంగ్ సరిహద్దు డివిజనులోని కెమోకార్పొలా పశ్చిమాన మైలు దూరంలోని తూర్పు సెక్టరులోనికి చొచ్చుకొని వచ్చింది. లడక్‌లో డంబుగురు దగ్గరలోని లాంగ్జు ప్రాంతంలో చైనా సైనికులు ఆగస్టులో మూడు చెక్ పోస్టులను నిర్మించారు. చైనా సాయుధ సైనికులు సెప్టెంబరు 12న జెలెప్లాలోయగుండా సిక్కింలోనికి ప్రవేశించారు. సరిహద్దులలో జరిగిన అనేక అతిక్రమణలను భారత ప్రభుత్వం అక్టోబరు 31న, చైనా ప్రభుత్వ దృష్టికి తెస్తూ, విస్తారమైన భారత భూభాగాన్ని ఆక్రమించి నూతన రోడ్లు, చెక్ పోస్టులను యేర్పాటు చేయుటను గర్హించింది. భారత భూభాగాన్నుండి నిష్క్రమించాలని, దురాక్రమణ చర్యలను ఆపివేయాలని, చైనా ప్రభుత్వానికి నొక్కిచెప్పింది.

జనవరి 1960లో చైనా సివిల్, సైనికాధికారులు తూర్పు సరిహద్దు లాగ్జు దగ్గర ప్రాంతంలోని అరమైలు లోపల సరిహద్దు నుండి అరమైలు దూరంలోగల రాయ్ గ్రామానికి వెళ్ళారు. జనవరి 14న వారి ($78^{0}$ $12^{|}$ తూర్పు, $35^{0}$ $19^{|}$ ఉత్తరాన గల) చెక్ పోస్టు నుండి

12 మైళ్ళ లోపలకు ప్రవేశించారు. లడక్‌లో చైనా అగ్రగామి గస్తీ దళం చొరబాటుకు భారత ప్రభుత్వం, చైనా ప్రభుత్వానికి తన అసమ్మతిని తెలియజేసింది. భారత ప్రభుత్వం ఏప్రిల్ 15న, లడక్‌లోని సరిహద్దుకు 6 మైళ్ళ పశ్చిమాన సైనిక చెక్ పోస్టును యేర్పాటు చేసినందుకు చైనా ప్రభుత్వానికి అసమ్మతిని తెలియజేసింది. అదేవిధంగా తూర్పు ప్రాంతంలో రాయ్ గ్రామంలోనికి చైనీయులు చొరబాటుకు, ఏప్రిల్ 18న తన అసమ్మతి తెలిపింది.

లడక్‌లోని చిప్ చాప్ ప్రాంతంలో ఏప్రిల్-మే నెలలో ఎడతెగకుండా చైనీయుల గస్తీ దళాలు, చొరబాటు గస్తీని కొన సాగించాయి. చైనా ప్రభుత్వం కార్కోరం పాస్ నుండి కాంగ్‌కా పాస్ వరకు తమ దళాలకు గస్తీ ఆజ్ఞలు జారీచేశామని, తమ భూభాగంలోని రెండు చెక్ పోస్టుల నుండి భారతీయులు వుపసంహరించాలని కోరింది. భారత ప్రభుత్వం దీనికి పాటించనిచో సరిహద్దు ప్రాంతమంతా తిరిగి గస్తీ ప్రారంభించబడుతుందని ప్రకటించింది. పాకిస్తాన్ చైనాప్రభుత్వాలు, చట్ట వ్యతిరేకంగా పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతంలో వున్న కార్కోరం పాస్‌కు పశ్చిమాన వున్న సరిహద్దు నిర్ణయానికి, వొప్పందాల కొరకు సంభాషణలు ప్రారంభించగలమని ప్రకటించాయి.

భారత ప్రభుత్వం మే 10న, జమ్మూ-కాశ్మీర్ పూర్తి సంస్థాపన సార్వభౌమాధికారం సంపూర్తిగా ఇండియన్ యూనియన్‌కు దాఖలు పరచబడివున్నదనే వాస్తవాన్ని చైనా ప్రభుత్వ దృష్టికి తెచ్చింది. కాశ్మీర్ సరిహద్దులపై పాకిస్తాన్, చైనాలు ఎట్టి వొప్పందం చేసుకొన్నా చట్టరీత్యా చెల్లనేరదని స్పష్టం చేసింది. స్పాన్గూర్‌కు నైరుతిగా 10 మైళ్ళ దూరంలో నూతన చైనా చెక్‌పోస్టు ఏర్పాటు చేయబడింది.

మే14న లడక్‌లోని చిప్‌చాప్ ప్రాంతంలోచైనా సైనికులు దురాక్రమణ గస్తీ తిరుగుటపై భారత ప్రభుత్వం అసమ్మతిని తెలిపి, ఇండియా-చైనా సైనికులు పశ్చిమ ప్రాంతంలో ఆనవాయితీగా, సాంప్రదాయకంగా చైనా,భారత దేశాలు అనుసరించుతున్న రేఖ వెనుకకు యిద్దరూ తమ సైనికులను వుపసంహరించుకొవాలనే సలహాను తిరిగి పునచ్ఛరణ చేసింది. భారత ప్రభుత్వం శాంతి వొప్పందం ప్రయోజనం కొరకు అక్సాయిచిన్ రోడ్డును చైనా సివిల్ రవాణా కొరకు వినియోగించుటకు ఆమోదాన్ని తెలిపింది. మే 21న భారత ప్రభుత్వం స్పాన్గూర్ దగ్గర నూతన చెక్ పోస్టును యేర్పాటు చేయుటకు చైనా ప్రభుత్వానికి అసమ్మతిని తెలిపింది.

టిబెట్‌లోని భారత యాత్రికులను, వ్యాపారులను, భారతీయులను యిబ్బందులకు లోను చేస్తూ, భారత భూభాగంలో దురాక్రమణ చేస్తున్నందున 1954 వొప్పందం లక్ష్యాన్ని అక్షరాలా అతిక్రమించుతున్నందున ఆచరణలో జూన్ ప్రారంభానికి ఆ ఒప్పందం రద్దు అయ్యింది. భారత ప్రభుత్వం డిగ్రీలు, రేఖాంశాలను వుదహరించుత భారత భూభాగాన్ని కొత్త రోడ్డు కొరకు శుభ్రం చేయుట, దక్షిణంగా 79 డిగ్రీలు, తూర్పున 34 డిగ్రీలు, ఉత్తరాన నూతన చెక్ పోస్టును యేర్పాటు చేయుటపై చైనా ప్రభుత్వానికి జూన్ 16న అసమ్మతిని తెలిపింది. తిరిగి జూన్ 28న చిప్ చాప్ నదీ ప్రాంతంలో నూతన సైనిక పోస్టును యేర్పాటు చేయుటపై తన అసమ్మతిని తెలియజేసింది.

# "ముందడుగు విధానం" లేక " చెక్ పోస్టుల చదరంగం"

అక్సాయ్ చిన్‌ను చైనా తెలిసో తెలియకో చట్ట వ్యతిరేకంగా ఆక్రమించి, సింకియాంగ్‌కు రోడ్డును నిర్మించి దానిని సమర్థించుకొనుటకు కుంటి వాదనలు తీసుకొచ్చి, వివాదంలో పట్టు విడుపులు వుండాలంటూ, అక్సాయ్ చిన్-రోడ్డు ప్రాంత విషయాన్ని భారత్ ప్రశ్నించకుండా వుంటే, తాము తూర్పున మెక్‌మాహన్ రేఖను తాము ప్రశ్నించకుండా ఆమోదించగలమనే సూచనలు చేస్తూ వచ్చింది. మెక్ మాహన్ రేఖను అక్సాయ్‌చిన్‌కు పోటీగా పెట్టి తానున్న క్లిష్ట పరిస్థితినుండి బయట పడాలనే ఎత్తుగడగా కన్పించుచున్నది. ఇండియా అక్సాయ్ చిన్ ప్రాంతంలో చైనా రోడ్డు నిర్మాణం సకాలంలో గుర్తించి తగిన చర్యలు గైకొనిన పరిస్థితి విషమించేది కాదు. ఆలస్యంగానైనా రోడ్డు నిర్మాణాన్ని ఖండించి, తొలగవలసిందని కోరగా చైనా నిరాకరించింది. ఇండియా అక్సాయ్‌చిన్ తమదని నిరూపించే ప్రయత్నాలు చేసి, విఫలమై యితర మార్గాలు చేబట్టవలసి వచ్చింది. అందుచేతనే 1959లో "యథాస్థితి" వొడంబడికను, దానితో పాటు రెండు పక్షాలు సాయుధ గస్తీ చర్యలు విరమించాలనే చౌయెన్‌లై ప్రతిపాదనలను భారత దేశం నిరాకరించింది. ఇది భారత వైఖరి.

భారత ప్రభుత్వం అక్సాయ్ చిన్ ప్రాంతంలో చైనీయుల ఉనికి, దురాక్రమణ చర్యగా చెప్పి, సంప్రదింపులు విఫలమైతే మరే విధంగానైనా వ్యవహరించే భాధ్యత తనపై వేసుకొన్నది. చైనీయులను తొలగించుటకు, ప్రతిపక్షాలు, విమానాల ద్వారా బాంబులు వేయుట, పెరాట్రూపరులును, సైన్యాన్ని వుపయోగించాలనే దుందుడుకు ప్రతిపాదనలను నెహ్రూ నిరాకరించుతూనే, సహజంగా యుద్ధ వ్యతిరేకిగావున యితర పద్ధతులు విఫలమైతే ప్రభుత్వం వుపేక్షించి వుండదన్నాడు. సైనిక బలంతో చైనీయులను తొలగించు ప్రతిపాదన త్రోసి వేయబడింది, కారణం అది పెద్దయుద్ధానికి దారి తీస్తుంది. యథాస్థితిని సరిహద్దులపై కొన సాగించుట వోటమిని అంగీకరించుటయే అని అక్టోబు 1959లో టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక సూచించినదే మూడో మార్గం. అదే న్యూఢిల్లీ సరిగా సాయుధులైన గస్తీ దళాలను చైనా ఆక్రమిత ప్రాంతాలోనికి పంపుటలో విఫలమైతే చైనా ఆక్రమణను ఆమోదించుట, మెక్ మాహన్ రేఖను అతిక్రమించుతామనే చైనా భయపెట్టుటకు తలవొగ్గుటయే అవుతుంది". అనే అవగాహనకు ప్రభుత్వం వచ్చింది. చౌయెన్‌లై న్యూఢిల్లీ సందర్శనానంతరం చైనా చేరిన తరువాత చైనా ఆక్రమిత భారత భూభాగంలోనికి గస్తీ దళాలు వెళ్ళి వచ్చే ప్రయత్నాలు చేయవలసి వుంటుందని, ప్రభుత్వ వర్గాలు వెల్లడించాయి. చైనా స్థావరాలపై దాడిమాత్రం గాదు, అగ్ర నాయకత్వ ద్వయం, భారత్-చైనాలు సంఘర్షణలను అన్నివిధాల నివారించే ప్రయత్నం చేయుటకు ఆమోదించి ప్రకటించింది. ఇప్పుడు భారత గస్తీ దళాలు చైనీయులు లేని ప్రాంతాలలో వున్న చోట్ల తప్పుకొంటూ తమ పని చేయవలసి వుంటుంది.

ఈ "ముందడుగు విధానం", 1960 ప్రారంభంలో పరిస్థితుల ప్రభావం నుండి వుద్భవించిన (విష) కన్యకు జనకులుగ గొప్పగా చెప్పుకొనేవారు చాలమంది వున్నారు.

అది విష ఫలితాల నిచ్చుటతో ప్రతివారు తాము కాదంటున్నారు. జనరల్ కౌలు 1962 అక్టోబర్‌లో చీఫ్ ఆఫ్ జనరల్ స్టాఫ్‌గా వుండి, రక్షణ మంత్రి కృష్ణ మీనన్ కాక తానే నెహ్రూకు "యీ ముందడుగు విధాన అవగాహనను" కలుగజేసినట్టు మాక్స్ వెల్‌కు చెప్పినట్లు వుదహరించబడింది[1]. తదుపరి నెహ్రూ రూపొందించారని చెప్పారు. కృష్ణ మీనన్ పరిస్థితుల ప్రభావంలో రూపొందిందని. అది చదరంగం ఆటలాగ అంతవరకే పరిమితమై వుంటే, ఆవిధానం వైఫల్యం చెందేది కాదని ఆయన వొక్కరే నిజాయితీగా చెప్పింది.

"ముందడుగు విదాన ధ్యేయం": 1) చైనా ఆక్రమణ జరుగు మార్గాలను మూసివేయుట 2) ఆక్సాయ్‌చిన్ ప్రాంతంలో భారత ఉనికిని స్థిర పరచుట, నెహ్రూ చెప్పే "యిద్దరూ ఉపసంహరించుట"ను అర్థవంతం చేయుట, ఆ ప్రాంతం నుండి చైనీయులు వుపసంహరించునట్లు చేయు రాయబార వర్గాల ప్రయత్నాలు ఫలవంతమగునట్లు చేయుట, వివాదాస్పదమైన ప్రాంతంలో అక్కడక్కడ చైనావారి అధీనంలో లేని ప్రాంతాలలో భారత సైనిక చెక్ పోస్టులను యేర్పాటు చేసి, చైనీస్ పోస్టుల మధ్య వారు లేని చోట్ల గస్తీచర్యలు కొనసాగినన్తా వారి నన్లయి మార్గాలను చేధించుతు, ఏకపక్షంగా వారు వుపసంహరించుకొనునట్లు చేయుట. కాని "విధానం వుద్భవించిన" తరువాత ధ్యేయం, దాని వున్నత రూపం మరో మార్గం లేక ఆచరణ రూపొందింది.[2]

మన ప్రభుత్వం 'ముందడుగు విధానం'లో యిమిడివున్న అంశాలను అంతగా పరిశీలించినట్లు కనిపించదు. చట్ట దృక్పథంలో ఆక్సాయ్‌చిన్ ప్రాంతంలో స్వాధీనబలంలో 90 శాతం కావున, ఎన్ని స్థానాలలో వీలైతే అన్ని స్థానాలలో సమాన స్థాయిలో వుంటే, చైనా ఆటదాని అంతట అదే కట్టుబడుతుందని, ముందడుగు విధానం యిచ్చిన అవగాహన. పశ్చిమాన భారత ప్రాంతాలని వాదన సాగిస్తే, తూర్పున మెక్ మాహన్ ప్రాంతంలో ఎదురు దాడి జరుగుతుందని చైనా ఖండితంగా చెప్పిన దానిని లెక్కలేనట్లుగా త్రోసి బుచ్చుట జరిగింది. చైనా ఖచ్చితంగా చెప్పిన దాని అర్థం తరువాత నిర్ధారణ అయిన దానిని బట్టి గూడా, భారత దేశం యెన్ని చెక్ పోస్టులను యేర్పాటు చేసినా భారత సైన్యం చైనా పోస్టులపై దాడి జరపనంతవరకు చైనా సైనిక చర్యను చేపట్టదని, అది జరిగితే తూర్పున మెక్ మాహన్ రేఖను అతిక్రమించుట జరుగుతుందని హెచ్చరికను అర్థం చేసుకొనవలసి వుంటుంది. చైనా తమ ప్రాంతం అంటున్న ఆక్సాయ్ చిన్‌ప్రాంతంలో ఎన్ని గస్తీకేంద్రాలను యేర్పరచి గస్తీ దళాలను పంపినా భారత సైనిక దళాలపై చైనా దాడి చేయదనే అభిప్రాయం భారతప్రభుత్వానికి, సైన్యానికి బలంగా వుంది. లాంగ్జు, కొంగాలోయ ఘటనలలో 1954లో ఇండియా చైనాను తూటాలు వాడుటలో సంతోషాన్ని పొందుతోందని నిందించినపుడు, రెండు పక్షాలు కాల్పులు జరిపినపుడు ప్రాణ నష్టం జరుగగా, చైనాదాడి చేసిందన్న దానిని ఖండించి కాల్పులకు, తమ సైనికుల ఎదురు సమాధానం మాత్రమే చెప్పారన్నది. అట్టి సంఘటనలకు మరొకసారి అవకాశం లేకుండా, తమ సైన్యాలను వుపసంహరించుకొంది.

1. నెవెల్లీమాక్స్‌వెల్ (1971) ఇండియాస్ చైనా వార్. జైకోబుక్ పే 174

2. నెవెల్లీమాక్స్‌వెల్ (1971) ఇండియాస్ చైనా వార్. జైకోబుక్ పే 174&175

లాంగ్జూ విషయంగా చైనా కథనం ఇండియా కాల్పుల దాడి చేయగా రక్షణకు ఎదురు కాల్పులు తాము చేయక తప్పలేదంటున్నది. ఈ రెండిటిలో ఏది వాస్తవమో లేక సత్యానికి దగ్గరిగా వున్నదో చెప్పే మార్గంలేదు. రెండు ప్రభుత్వాలలో యేదో వొకటి సరిహద్దు సైన్యాధికారుల రిపోర్టులతో తప్పుదారి పట్టిందనుట మాత్రం నిజం. చైనా మెక్ మాహన్ రేఖపై ఖింజమాన్, లామండెన్‌లపై దాడి చేయకుండుట, లాంగ్జూలో కావాలనే దాడి చేసారనే భారతదేశపు నింద సత్యాసత్యాలను స్పష్టం చేస్తున్నది. లాంగ్జూ ఘటన యాధృచ్ఛికంగా, అనుకోకుండా జరిగిన సంఘటనయని నిర్వివాదాంశముగ చెప్పవచ్చు.

సత్యాగ్రహం, సహాయ నిరాకరణ లాంటి, ఈ ముందడుగు విధానంతో, ఎవ్వరూ ఎదుర్కొన లేని నైతిక బల విశ్వాసంతో, చైనా దాడిచేయకుండాచేయగలమని, గతంలో బ్రిటిష్ వారు బలాన్ని వుపయోగిస్తే, అది వారినే బలహీనపరచిన అవగాహన అట్టి గస్తీ కేంద్రాల ఏర్పాటు, చదరంగ ఆట ఆచరణకు మూలము. ఆక్సాయ్ చిన్ ప్రాంతంలోనికి భారత సైనిక గస్తీదళ సత్యాగ్రహాలు ఆ నైతిక బలంతో వెళ్ళగలరని, భారతదేశపు ప్రపంచ ప్రఖ్యాతి, ఆ నైతిక బలానికి తోడ్పడుతుందని భారత ప్రభుత్వ అవగాహన.

ఈ"ముందడుగు విధానం'తో ఆక్సాయ్ చిన్ లో బలాబలాల తూకాన్ని చివరకు మార్పుచేసి, భారత దేశ బలాన్ని వుపయోగించి చైనీయులను తొలగించి వేయవచ్చని తలంచుట, వ్యూహాజనితం, అవాస్తవ అవగాహన అయితే యిట్టి అవగాహన జనించుటకు, బలపడుటకు 1961లో లోక్ సభలో వెలువడిన కొన్ని అభిప్రాయాలు కారణమైవుండవచ్చు అని అనుకొనుట నిర్హేతుపుకాదు. "ఎక్కడ యుద్ధమన్నా నా ఆత్మ దానిని వ్యతిరేకిస్తుందని" 1961లో లోక్‌సభలో ఒక విధమైన ఆక్రమణ మన దేశపు ప్రాంతంలో జరిగింది." అన్నది వాస్తవమని "దీనిని యేమి చేయాలి? మెట్ట మొదటి ధ్యేయదమేమిటి? నిస్సందేహంగా ఆ దురాక్రమణను వుపసంహరించుకొనునట్లు చేయుట మన లక్ష్యం. అది ఎలా చేయగలుగుతాము? సంప్రదింపులు రాయబారాల ద్వారా, యితర మార్గాల ద్వారా చివరకు మీరు కోరినట్లయితే యుద్ధం ద్వారా" అని నెహ్రూ అన్నారు. భారత బడా బూర్జువా వాణియైన మసానీ "నీ ప్రాంతాన్ని నీవు రక్షించుకొనుట అట్టి చర్య యుద్ధం కాజాలదు" అని చెప్పగా నెహ్రూ నిరాకరించారు. నిజాం సంస్థానాన్ని భారత దేశంలో విలీనం చేయు సందర్భంలో సైనిక చర్యనే పోలీసు చర్యగా నామకరణం చేసి కార్యాన్ని సాధించిన ప్రస్తావన పార్లమెంటులో వచ్చింది. అన్యాపదేశంగా కొందరు, ప్రత్యక్షంగా కొందరూ సూచించారు. నెహ్రూ "ఒక చర్య స్వభావం పేరుమార్చినంత మాత్రాన మారదని" అంటూ ప్రతిపక్షాల సూచనలను నిరాకరించారు. చిన్న స్థానిక యుద్ధాలు అన్ని కాలాలలో అన్ని చోట్లా జరుగకుండా నివారించుట సాధ్యం కాదని కృపలాని వాదించారు. అట్టి యుద్ధాలు సంభవించినపుడు ప్రపంచం విజ్ఞతతో వాటిని స్థానికంగానే పరిమితం చేసి, తరువాత పరిష్కారాన్ని కనుగొనగలదు. కావున చైనాతో సంఘర్షణ ప్రపంచ యుద్ధానికి దారి తీస్తుందని, మానవ వినాశనమగుతుందని భయపడరాదు. ప్రపంచం అట్టివి జరుగకుండా చూచుకొనగలదు. ప్రతిపక్షం అట్టివి జరుగకుండా చూచుకొనగలదు. ప్రతిపక్షం అట్టి సందేహాలను నివృత్తి

చేస్తూ యుద్ధం భారతీయులందరిని యేకం చేస్తుందని, ప్రజల జాగృతిని పెంచుతుందనిన వాదించారు.

"ముందడుగు విధానం" భారత దేశం ఎప్పటికైనా గస్తీని, దళాల పోస్టులను. చైనా ఆక్రమిత ప్రాంతంలోనికి పంపించవలసి వుంటుందనే అభిప్రాయం 1960లోనే వచ్చినా, 1961 చివర వరకు వొక స్వరూపాన్ని తీసుకొనలేదు. కారణం అట్టి ప్రయత్నాలకు సైన్యం సుముఖంగా లేదు. ప్రభుత్వవిధానం 1959 చివరలో నెహ్రూ సెప్టెంబరు మొమరాండంలో సరిహద్దులలో యధాస్థితిని కొనసాగించాలని, ఎట్టి రెచ్చగొట్టు చర్యలనైనా జరగకుండా వాటికి లోను గాకుండా చూడాలని, పెద్దవే కాదు, ఎంతటి చిన్నవైనా జరుగకూడని విధానాన్ని అనుసరించి, సైనికాధికారులు అన్ని సెక్టారులలో తగు చర్యలు తీసుకొన్నారు. ఆ కాలంలో జనరల్ తిమ్మయ్య సర్వసైన్యాధిపతిగా వున్నారు.

ప్రధాని నెహ్రూ, వి.కె.కృష్ణమీనన్, విదేశాంగ కార్యదర్శి, సర్వసైన్యాధిపతి థాపర్ ,కౌలు, ఇంటిలిజెన్స్‌బ్యూరో డైరెక్టర్ మల్లిక్ తదితర అధికారులు, ప్రధాని ఆఫీసులో 2 నవంబర్ 1961న సమావేశమయ్యారు. విదేశాంగ అధికారులు, మల్లిక్ చిప్‌చాప్ లోయలో నూతన చైనా పోస్టును ఆధారం చేసుకొని, తమదిగా అని చెపుతున్న రేఖ వరకు ఆక్రమించుటకు చైనావారు ముందుకు వస్తున్నారనే నిర్ణయానికి వచ్చారు. థాపర్ తన సైనికులు చిప్‌చాప్ లోయలో చైనీయుల పోస్టును మొట్టమొదట సెప్టెంబరులో చూసినా అది యెప్పుడు ఏర్పాటు చేసింది చెప్పుట సాధ్యం కాదన్నారు. కాని మల్లిక్ 1959-60 తదనంతరం ఏర్పాటుచేయబడిందని, చైనీయులు తమదిగా చెప్పబడుతున్న ప్రాంతం వరకు వచ్చుట, వారి లక్ష్యంగా వుందని, భారత్ సైనికులు వున్న ప్రాంతాలకు దూరంగా వైదొలగి వుంటారు. కావున ఖాళీ ప్రాంతాలలోనికి భారతీయులు వెంటనే ప్రవేశించాలి. లేనిచో చైనీయులు ఆక్రమించగలరని మల్లిక్ అభిప్రాయం. భారతీయులు ఖాళీ ప్రాంతాలలో పోస్టులను ఏర్పాటు చేసినా చైనీయులు ప్రతిస్పందించరనే మల్లిక్ అభిప్రాయాన్ని విదేశాంగ శాఖాధికారులు బలపరచారు. రాయబార మార్గాలలో నిరసన తెలియజేస్తారు. కాని, బలప్రదర్శన చేయరని అభిప్రాయపడ్డారు. ఈ సమావేశం ఈ క్రింది నిర్ణయాలను ఆచరణ సూచనలను చేసింది[1].

1) లడక్‌కు సంబంధించినంత వరకు ప్రస్తుత మన కేంద్రాలనుండి అంతర్జాతీయ సరిహద్దు వరకు సాధ్యమైనంత ముందుకు గస్తీ చర్యలను, మన పోస్టులను ఏర్పాటు చేయు లక్ష్యంతో కొనసాగించాలి. అదే చైనీయులను యింకా ముందుకు చొచ్చుకొని రాకుండా ఆపగలదు. యింతకు ముందే వారు ఏర్పాటు చేసుకొన్న పోస్టుల నుండి అధిక్యతను పొందకుండా చేస్తుంది. ఇది యెట్టి సంఘర్షణకు తలపడకుండా చేయాలి. ఆత్మ రక్షణకు అవసరమైతే తప్ప సంఘర్షణ పడరాదు.

2) ఉత్తరప్రదేశ్ మధ్య ప్రాంతానికి సంబంధించి యిటువంటి కష్టమైన సమస్యలు

1. నెవెల్లీమాక్స్‌వెల్ *(1971)* ఇండియాన్ చైనా వార్, జైకోబుక్ పే *221 & 222*

లేవు. కాన మనం సాధ్యమైనంత ముందుకు వెళ్లాలి. సరిహద్దు వరకు గల ప్రాంతాన్నంతా సమర్థవంతంగా విస్తరించి యుండాలి. ఎక్కడైనా ఖాళీ ప్రదేశాలుంటే మన పోస్టయినా యేర్పాటు చేయాలి, లేదా గస్తీ చర్యలైనా సమర్థవంతంగా నెరవేర్చాలి.

3) అనేక ఆచరణ పాలనా ఇబ్బందులు వున్నందున సరిహద్దులోని మన అగ్రగామి పోస్టుల వెనుక సరిహద్దు అంతటా ప్రధాన సైన్యాలను వ్యూహాత్మకంగా సమీకరించాలి. అవి అక్కడ కొనసాగాలి. అక్కడినుండి సరిహద్దులలోని పరిస్థితిని పునరుద్ధరించగలగాలి.

పైఅంశాల క్రమము, మాటలపొందిక, సమావేశ చర్చలలోని సమతూకాన్ని ప్రతిబింబించుచున్నది.

సర్వసైన్యాధిపతి జనరల్ థాపర్ 5 డిశెంబర్ 1961న తూర్పు పశ్చిమ సైన్యాధిపతులకు, సైనిక పోస్టుల వెనుక వుండే వ్యూహాత్మక సైనిక తదితర సమీకరణ గురించి ప్రస్తావించక, ప్రభుత్వ సైనిక గస్తీ చర్యలు, సైనిక పోస్టుల ఏర్పాటు విధానాన్ని సమీక్షించి సూచనలు చేసిందని, ఆ నిర్ణయాలను యిలాయిచ్చారు. "(లడక్‌లో) మన స్థావరాలనుండి నుండి సాధ్యమైనంత ముందుకు, మనం గుర్తించిన అంతర్జాతీయ సరిహద్దు వరకు గస్తీ చర్యలు కొనసాగించాలి. చైనీయులు యింకా ముందుకు రాకుండుటకు, చైనా పోస్టులపై ఆధిక్యతను మన ప్రాంతంలో సంపాదించుటకు అదనపు పోస్టులను యేర్పాటు చేయు లక్ష్యంతో ఈ గస్తీ చర్యలు కొనసాగాలి.

అంతేగాక జనరల్ థాఫర్ లేఖ "ఈ ముదడుగు విధానం" చైనీయులతో ఎట్టి సంఘర్షణలో ఇరుక్కొనకుండా, ఆత్మరక్షణ తప్ప' అని స్పష్టంచేయబడింది. "వ్యూహాత్మక మద్దుతుకై కావలసిన వాటికి ప్రతిపాదనలు పంపవలసినదిగా సూచన యిచ్చాడు. ఆ విధంగా "ముదడుగు విధానం" సైనిక ఉన్నత ఆఫీసు నుండి ఆర్డరుగా, వెన్వెంటనే ఆచరణ పెట్టవలసి వచ్చినది. పార్లమెంటులో వచ్చిన వొత్తిడికి సమాధానమిస్తూ డిశెంబరు ప్రారంభంలో "మద్దతు నిచ్చే స్థావరాలు లేకుండా తీసుకొనే ఏ చర్య అయినా సాహసిక చర్య అవుతుంది, సైన్యానికి, జాతికి తగిన చర్యకాదని స్పష్టం చేశారు. "ముందడుగు విధానంలో చేసిన మార్పు, యిచ్చిన ఆజ్ఞ నెహ్రూ కోరిక పై గాక, ఆయన ఎరుకలేకుండా జరిగినట్లు కనపడుతుందని, మాక్స్‌వెల్ అభిప్రాయం. అంతేగాక "ఆజ్ఞా పత్రంలో సైనిక సమీకరణకు సంబంధించిన అన్ని మాటలను తొలగించి, యుద్ధరు ప్రాంతీయు సైనికాధికారులకు ఆజ్ఞలు జారీ చేయుట జరిగింది." అని కూడా పేర్కొన్నారు.

కేంద్రసైనిక ఆఫీసులో చాలా మార్పులు వచ్చాయి. చీఫ్ ఆఫ్ జనరల్ స్టాఫ్‌గా కౌల్ అఫిసియేటు చేస్తున్నారు. జనరల్ థాపర్ మార్చిలో సర్వసైన్యాధ్యక్షుడుగా అయ్యారు. కౌల్, అనుయాయులు, సహచరులతో సి.జి.యస్ ఆఫీసు ఆధ్వర్యం వహించుతున్నారు.

జనరల్ థాఫర్ సర్వసైన్యాధిపత్యానికి రాజీనామా యిచ్చిన తరువాత మౌనంగా వుండి స్టేట్స్‌మన్ (1971)లో ఒక వ్యాసంలో నెహ్రూ "ముందడుగు విధానాన్ని" బలపరచారు.

థాపర్ తన ప్రధాన దాడిని కృష్ణమీనన్‌పై కేంద్రీకరించి, అత్యల్ప కారణాలనుచెపుతూ పూర్తి సైనిక వ్యవహారాలలో కలుగ జేసుకొనుట, చైనాతో యుద్ధాన్ని రెచ్చగొట్టుటను నిందించారు. ముందడుగు విధానంగా చెప్పబడుతున్నది గాక, థాగ్లా శ్రేణి శిఖరాగ్ర ప్రాంతాన్నుండి చైనీయులను తొలగించి వేయాలన్న మన నిర్ణయం దానికిచ్చిన ప్రచారం యుద్ధానికి దారి తీసింది. ప్రధాన మంత్రి విదేశాలలో వున్నపుడు, సహచర మంత్రులతో సంప్రదించకుండానే నేను వెలిబుచ్చిన సందేహాలను, చైనీయులు ప్రతిస్పందించిన తీరును, తత్ఫలితాలను లెక్కచెయ్యకుండా యీ నిర్ణయాన్ని మిస్టర్ కృష్ణ మీనన్ తీసుకొన్నారు అని థాపర్ పేర్కొన్నాడు. విలేఖరులు తొలగించే ఆజ్ఞలను గురించి ప్రశ్నించగా అప్పుడు నేను రాజీనామా యిచ్చి వుండవలసింది. అపజయ, అవమానాల నుండి నా దేశాన్ని కాపాడగలిగే వాడిని". ఇంకా "సందేహాలను నాతోటి సీనియర్ జనరల్స్‌తో చర్చించాను. రాజకీయ పరిస్థితుల కారణంగా చైనా బలమైన సైనిక చర్యతీసుకొన జాలదని నిర్ణయానికి, రహస్య శాఖ అంచెనాను బట్టి టిబెట్‌లో 8-10 డివిజన్‌లు సైన్యమున్నప్పటికి, అట్టి చర్య తీసుకొనదనుకొన్నాము" అని అంటూనే "బహుశా భారత సైనికాధికారులు తొలగించే ఆజ్ఞను నిరోధించినా త్రోసిబుచ్చేవారు". ఈ విషయంలో నెహ్రూ నమ్మకానికి ఆధారమేమిటి? "ముందుకు పురోగమన విధానాన్ని" అవలంభించిన, చైనా వారు యుద్ధ చర్యలలో ప్రతిస్పందించరనీ అవగాహన రహస్య శాఖ డైరెక్టర్ మల్లిక్ నుండి వచ్చింది. కాని 1962 వేసవిలో చైనా మందకొడి తనాన్ని ప్రదర్శించుతుందనే అంచనా. కాని చైనా విధానం మార్చబడింది. భారత సైన్యం స్థానికంగా దాడి జరిపినా చైనా సైనికంగా స్పందించదనే అభిప్రాయం బలపడి వుంది.[1]

# 5

## భారత్-చైనా సరిహద్దు వివాదంపై అమెరికా,రష్యాల వైఖరి

అమెరికా చైనాలలో అంతర్యుద్ధ కాలంలో అవలంభించిన వైఖరినే యుద్ధానంతరం, తైవాన్‌లో ఛాంగై షేక్ స్థావరం యేర్పాటు చేసుకొని చైనాపై తన శక్తి కొలది జరుపుతున్న పోరాటానికి అమెరికా అన్ని విధాల సహాయం చేస్తునే వున్నది. ప్రపంచ ఐక్యరాజ్య సమితిలో చైనా స్థానాన్ని పునరుద్ధరించుటకు వ్యతిరేకించుతునే వున్నది. ఒక్క మాటలో చైనా వ్యతిరేక విధానాన్నే అమెరికా అనుసరించుతూ దానిని వీలైనంతవరకు ప్రపంచ రాజ్యాల నుండి వేరు చేయుటకు ప్రయత్నించుచున్నది. శతృవు శతృవు తనకు మిత్రుడు అనే సిద్ధాంతాన్ని అనుసరించుతు, చైనా వ్యతిరేక దేశాలన్నిటికి అన్ని విధాల సహాయాన్ని అందించుచున్నది. ఈ దృక్పధంతో భారత-చైనా సరిహద్దు వివాదంలో, సంఘర్షణలో దాని వైఖరిని పరిశీలించవలసి వుంటుంది.

---

1. *నెవెల్లీమాక్స్‌వెల్ (1971) ఇండియాన్ చైనా వార్. జైకోబుక్ పే 452*

సోవియట్ యూనియన్, ప్రజా చైనా రిపబ్లిక్‌ల మధ్య 1957 ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల మాస్కో సమావేశం నుండి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం అనుసరించవలసిన విధానం అవగాహనలపై అంతర్గత సిద్ధాంత చర్చలు, వివాదాలు జరుగుతునే వున్నవి. అవి 1960 ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల సమావేశంలో సమావేశానంతరం తీవ్రమై పరాకాష్టకు చేరి, బహిరంగ సైద్ధాంతిక వాగ్వివాదాలుగా పరిణామమొందాయి. చైనా వొక ప్రత్యామ్నాయ విధాన సిద్ధాంతాన్ని ప్రచారం చేయుటయే గాక, అదే వైఖరిని వివిధ సమస్యలలో అనుసరిస్తున్నది. వీటిని ప్రత్యేకంగా అధ్యయనం చేసి వున్నాం. ఆ నేపథ్యంలోనే భారత-చైనా సరిహద్దు వివాదాంశాలపై సోవియట్ వైఖరిని పరిశీలించవలసి వున్నది. ఈ సందర్భంలో సోవియట్ యూనియన్‌కు చైనా ప్రజా రిపబ్లిక్‌లకు గూడ మధ్య సరిహద్దు వివాదాలు, సరిహద్దు గస్తీదళాల మధ్య సాయుధ సంఘర్షణలు జరుగుతున్న విషయాన్ని మరువరాదు.

“టిబెట్‌లోని కంపాస్ అను వొక ఉపజాతి తెగ సి.ఐ.ఎ. అమెరికన్ గూఢచారి యేజంట్ల ప్రోద్బలంతో తిరుగుబాటు చేయగా అణచి వేయబడిన తరువాత, భారత దేశంలో కలింపాంగ్ కేంద్రంగా విద్రోహచర్యలకు పాల్పడుతున్నారని వారికి ప్యారాచూట్ల ద్వారా అందజేసిన ఆయుధాలతో మార్చి తిరుగుబాటు లేవదీసారు. వీరికి భారత సి.ఐ.డి. అధికారుల ప్రోద్బలం వుందని మార్చిలో దలైలామా భారత దేశానికి వచ్చుటలో వీరి పాత్ర వుందని, యేయిబ్బంది లేకుండా వీరందరకూ కోరిన వెంటనే రాజకీయ ఆశ్రయం లభించిందని, కాని ఆ తరువాత భారత రాయబార కార్యాలయాలు దలైలామా ప్రచారానికి తోడ్పడుటతో చైనా నిరసన తెలుపుట జరిగింది. భారత చైనా సరిహద్దు వివాదం కారణంగా చైనా నాయకత్వపు సంబంధాలు నెహ్రూతో విషమించటంతో కృచ్చేవ్ వుపయోగించుకొనగలిగాడు. భారత - చైనా సరిహద్దు మొట్ట మొదటి సంఘర్షణ 26 ఆగస్టు 1959లోజరిగింది. సెప్టెంబరు 6న చైనా విదేశాంగ శాఖ మంత్రి సోవియట్ విదేశాంగ శాఖ మంత్రిని కలిసికొని “నెహ్రూ పన్నిన ఉచ్చులో పడవద్దని ” తెలిపి సోవియట్ యూనియన్‌ను చైనా పె వొత్తిడి చేయుటకు భారతదేశం వుపయోగించుకొంటున్నదని వివరించాడు. సెప్టెంబర్ 9న సోవియట్ మంత్రివర్గం, భారత్-చైనా సరిహద్దు సంఘర్షణపై వొక ప్రకటన తయారు చేసింది. చైనా మంత్రివర్గం,చౌయెన్‌లై నెహ్రూకు సంభాషణల విషయమై ఉత్తరం వ్రాస్తున్న కారణంగా ప్రకటించవద్దని కోరింది. చైనా అభ్యర్థనను లెక్క చేయకుండా సోవియట్ యూనియన్ ఆదే రాత్రి ప్రకటించి, భారత-చైనా సంబంధాలు విషమించాయని బహిరంగంగా ప్రపంచానికి తెలిపింది. తరువాత ఆరు రోజులకే కృచ్చేవ్ కాంప్‌డేవిడ్‌లో ఐసెన్‌హోవర్‌తో శిఖరాగ్ర సమావేశం జరిపాడు. చైనీయులు చెప్పినట్లుగా సోవియట్ యూనియన్ చైనా రిపబ్లిక్ తో చేసుకొన్న అణు సాంకేతిక విజ్ఞాన వొడంబడికలను ఏకపక్షంగా శిఖరాగ్ర సమావేశానికి బహుమతిగా రద్దు చేసుకుంది.

సోవియట్ వైఖరికి అనేక కారణాలున్నవి. ఇండియా-చైనా సపరిహద్దులపై సంప్రదింపులు, రష్యా-చైనా సరిహద్దు సంప్రదింపులకుదారి తీయవచ్చనే భయముంది. సోవియట్ దీర్ఘకాల వ్యూహం హిందూ మహాసముద్రంపై కేంద్రీకరించి వుంది. రష్యాతన

ఆర్థిక విస్తరణకు ప్రధానంగా ఇండియాను ఎంచుకొనుట. సోవియట్ యూనియన్ ప్రపంచంలో శక్తివంతమైన రాజ్యంగా రూపొందాలనే బలమైన వాంఛతోనే "సౌహార్ద దేశాన్ని" విడనాడింది. భారత-చైనా సంఘర్షణలకు అనుబంధంగానే ఆగస్టులో సోవియట్-చైనా సరిహద్దులలోని సింకియాంగులో సంఘర్షణలు జరిగి ప్రాణ నష్టమైంది. కాని ప్రకటించబడలేదు[1]

కృశ్చేవ్ సెప్టెంబరు 30, 1959 చైనా ప్రజా రిపబ్లిక్ 10వ వార్షికోత్సవ సందర్భంలో చైనా-భారత సరిహద్దు సమస్యను లేవనెత్తి చైనా"దురాక్రమణను" నిరసించాడు, చైనా విదేశాంగ మంత్రి మార్షల్ చెన్‌యితో కరచాలనం నిరాకరించుతూ "సైనిక తత్వవాదులు అంటు ఇష్టంలేదన్నాడు. ఇండియా పక్షంలో అనేకమంది చనిపోయారు. ఎవరి వైపు ఎక్కువ మంది చనిపోయారో వారు దురాక్రమణకు లోనయ్యారనుట స్పష్టం" అని అణుయుద్ధం ఎంత భయంకరమైనదో తెలిసి. "ఒక్క సోవియట్‌యూనియన్ మాత్రమే అట్టి యుద్ధాన్ని చైనాపై అమెరికా చేయకుండా ఆపగలదని" అన్నాడు.

అక్టోబరు 1962లో పెకింగ్‌లోని సోవియట్ రాయబారికి చైనా విదేశాంగ మంత్రి భారతదేశం విస్తృత సైనికచర్య సరిహద్దులలో మొదలు పెట్టే ప్రయత్నంలో వుందని తెలిపారు. సోవియట్ హెలికాప్టరులు, విమానాలు, సైనిక సరఫరాలను సరిహద్దుకు చేరవేస్తున్నవని "ఇండియా దాడి చేస్తే మా అంతట మేము రక్షణ చేసుకొంటామని" చెప్పారు.

అమెరికారాయబారి జాన్ కెన్నెత్ గాల్‌బ్రేత్ తన అమెరికా ప్రభుత్వానికి సైనిక సన్నాహాలపై హెచ్చరించినా, భారత దేశాన్ని సంఘర్షణ విషయమై నిరుత్సాహ పరచలేదు. ఆ సంవత్సరం చివరలో సెనెట్ ఫారెన్ రిలేషన్సు కమిటీ సమావేశంలో జనరల్ మాక్స్‌వెల్ టైలర్ ఈ వాస్తవాన్ని బయట పెట్టాడు.

అమెరికన్ రాజకీయ వర్గాలలో, ఆసియాలో చైనా తన నాయకత్వాన్ని సుస్థిరం చేసుకొనుటకు భారత దేశాన్ని ఏకాకిగా చేయుటకు చేయు ప్రయత్నాలలో భాగంగానే భారత-చైనా సరిహద్దు వివాదమని అదే విధంగా భారత దేశం అలీన దేశాలలో తన నాయకత్వాన్ని బలపరచుకొని, శాంతిదూతగా ముందుకు వచ్చుటకు అలీన దేశాల బెల్గ్రేడ్ సమావేశంలో నెహ్రూ వుత్తేజకరమైన వుపన్యాసం, దీనినే సూచిస్తున్నదనే అభిప్రాయం ప్రబలంగానేవున్నది. నైరుతి ఆసియాలో పెకింగ్ న్యూఢిల్లీలు, రాజకీయ విశ్వాసాలను సంపాదించుటలో పోటీలు పడుతున్నవని వ్యాఖ్యానాలు వినపడుతున్నవి. ఈ విధమైన వివరణ అమెరికా ప్రెశిడెంటు జాన్ కెన్నెడీ చేయుటను, భారత దేశం యెడల మొగ్గు చూపుట, సుముఖ వైఖరిని అవలంభించుట. అంతకు ముందు పాకిస్థాన్ యెడల డల్లెస్ సుముఖ వైఖరికి భిన్నంగా చేబట్టుటకు ఆధార భూతమైంది. ఆసియాలో నిరంకుశ చైనాకొక ప్రత్యామ్నాయం ప్రజాస్వామ్య భారతదేశం అని, అమెరికన్, భారత మేధావి వర్గాలు తలంచుచున్నాయి.

---

1. హన్‌సూయిన్ - విండో ఇండేటవల్ (1976) మాసియన్ & చైనీస్ రివల్యూషన్ పే. 167, 168

చైనా, సొవియట్‌తో తన సంబంధాలు రోజు రోజుకు దిగజారుట యెడల యెక్కువగా భయపడుతున్నవి కాని భారత దేశంతో ఆసియాలో పోటీ విషయం గాదు. చైనా ఉత్తర, పశ్చిమ సరిహద్దు అంతా సరిహద్దు సంబంధాలు నానాటికి దిగజారుట పై విచారిస్తున్నది. కాని దక్షిణ సరిహద్దు, ఇండియా సంబంధాల విషయమై అంతగా కలవరపడుటలేదు.

భారతదేశం, సోవియట్ యూనియన్ పై ఆధారపడి యుండుటను చైనా విశ్లేషకులు, స్పష్టంగా చూడగలిగారు. సోవియట్ సహాయం జాతి దీర్ఘకాల పెట్టుబడి రాజకీయ ప్రలోభాల సంచితంగా వుంటుందని చైనాకు స్వానుభవంలోతెలుసు. సోవియట్ సహాయపు ఆటు పోటుల కారణంగానే చైనా గొప్పగా ముందుకు దూకుట కార్యక్రమంలో సంభవించిన ఘోరపరిణామాలని చైనా అవగాహన, కోపతాపాలు, ప్రత్యామ్నాయంగా దేశంలోని రాజకీయ శక్తులు కలుగజేయవలసి వుండిన రాజకీయ విస్తృత సదుపాయాలు, చైనాకు స్పష్టంగా తెలుసు.

భారత ప్రణాళికలు 1950 దశకంలో విస్తృత సంక్షోభంలో పడినపుడు సోవియట్ యూనియన్ తోడ్పడింది. ఫలితాలు 1960 దశకంలో సోవియట్ యూనియన్ పొందనారంభించింది. భారతదేశ విస్తృతావసరాలకు బీద చైనా చేయగలిగిన సహాయం, ప్రణాళికల విజయానికి తోడ్పడుటకు చేయగలిగిందేమిలేదు. సోవియట్‌యూనియన్ అధునాతన సైనిక సామాగ్రినంతా చైనాకు యివ్వక పోయినా భారతదేశానికి సప్లయి చేస్తున్నది. చైనా యెడల భారతదేశము అనుసరించే విధానం, సోవియట్ యూనియన్, బహుశా అమెరికాతోకలిసి (?) అనుసరించే వ్యూహంలో భాగంగా చైనా తలంచుటలో వింతలేదు.

సోవియట్ యూనియన్, భారత-చైనా సరిహద్దు సంఘర్షణలలో తన సమస్య సమాలోచన, అంతర్గతంగా యిమిడి వున్నట్లు కన్పడుతుంది. అమెరికాకు భారతదేశం సరిహద్దు సమస్య ఫలితంగా సంక్షోభంలోనికి దిగ జారుతుందని తెలిసినా, దాని తీవ్రతను తగ్గించుటకు ఎట్టి ప్రయత్నం చేయలేదు. సంక్షోభంలోనే భారతదేశం తన ఆలోచనలకు స్పందించగలదని వేచి చూస్తున్నది.

# 6

# భారత-చైనా సరిహద్దు యుద్ధం

భారతప్రభుత్వం గాల్వాన్‌నదీతీరాన వున్న భారతగస్తీ దళాల సైనిక పోస్టును చైనా సైన్యాలు చుట్టుముట్టుటపై చైనా ప్రభుత్వానికి తన అసమ్మతిని జులై12న తెలిపింది. జూలై 12నచిప్‌చిప్, చాంగ్‌చెన్మొ, సాన్‌గాంగ్‌లలో నూతన చైనా సైనిక పోస్టులను యేర్పరచుటపై తీవ్రఅసమ్మతిని తెలపింది. భారతప్రభుత్వం జులై26న లడక్‌లోని

తీవ్రపరిస్థితిని చైనాప్రభుత్వదృష్టికి తెచ్చింది.నేటి తీవ్రపరిస్థితి తగ్గి తగిన వాతావరణంయేర్పడిన చర్యలుకొనసాగించుటకు,1960 వుద్యోగుల నివేదికప్రాతిపదికగా, చైనా చెప్పుతున్నట్లు శాంతియుతపరిష్కారానికి, చైనా తనవాదనలను ఆధారాలతో వివరించదలచితే, భారతప్రభుత్వం వాటిని పరిశీలించుటకు తన సంసిద్ధతను తెలిపింది. పాన్‌గాంగ్ ప్రాంతంలోని 'యులు' దగ్గర భారతగస్తీదళాలపై దాడిచేయుటను జులై28,30లలో చైనా ప్రభుత్వానికి, భారతప్రభుత్వం తన అసమ్మతిని తెలియజేసింది.

చైనాప్రభుత్వం, భారతప్రభుత్వపు శాంతిసంభాషణలు, చర్చలకు పంపిన ఆహ్వానాన్ని ఆమోదించుతూ, పూర్తిగ వారిషరతులపై జరగాలని వెల్లడించింది. పూర్వయథాస్థితిని పునరుద్ధరించుటకు వారే బలంతో తారుమారు చేసినందున, వర్తమానంలో కాని భవిష్యత్తులోకాని సంప్రదించుటకు అంగీకారంకాదని స్పష్టంచేసారు. ఆగస్టు22న భారత ప్రభుత్వం, గత 5సంవత్సరాలుగ చైనాప్రభుత్వం లడక్‌లో బలాన్ని వుపయోగించి మార్చిన దానిని, యదాస్థితిని పునరద్ధరించుటకు రెండు ప్రభుత్వాలు తిరిగి చర్చించవచ్చని సూచించింది. తీవ్రపరిస్థితిని యేమాత్రం తగ్గించకుండా, తగిన వాతావరణాన్ని సృష్టించకుండా, సరిహద్దుసమస్యను చర్చించాలని చైనా తన పూర్వఅభిప్రాయాన్ని పునరుద్ఘాటించింది.

భారతప్రభుత్వం ఆగస్టు22న, చైనా సైనికపోస్టులను, సరిహద్దు ఆవల భారతదేశంలో చాలా దూరం లోపల 18సైనిక పోస్టులను, చిప్‌చాప్, గాల్వానేలోయ, పాన్‌గాంగ్, స్పాన్గూర్, ఓరాక్వాష్ ప్రాంతాలలో యేర్పాటు చేయుటకు అసమ్మతిని తెలిపింది. అదేవిధంగా పాన్‌గాంగ్ ప్రాంతంలో 4నూతన సైనిక పోస్టులను చైనా యేర్పాటు చేయుటకు ఆగస్టు 24, 27లలో అసమ్మతిని తెలియజేసింది. సెప్టెంబరు7న కూడ, చాంగ్, చెన్మోవాలీ, పాన్గాంగ్, స్పాన్గూర్ ప్రాంతాలలో 2చెక్ పోస్టులను చైనా యేర్పాటు చేయగా, భారతప్రభుత్వం అసమ్మతిని తలియ జేసింద. అదే కాలంలో మరోవైపు,చిప చాప ప్రాంతంలో చైనా సైన్యం భారత గస్తీదళాలపై దాడులు కొనసాగించుటను ఆగస్టు27, సెప్టెంబరు 2లలో భారతప్రభుత్వం తన అసమ్మతిని ప్రకటించింది.

**ఆక్రమణ ప్రారంభం:**

1. భారతవాయువ్య ప్రాంతంలోని థాంగ్లా పర్వతశ్రేణి ఏజన్సీని దాటి చైనా సైన్యాలు భారతదేశంలోనికి 8సెప్టెంబరు, 1962న ప్రవేశించాయి. భారత-చైనా సరిహద్దు యుద్ధం ప్రారంభమైంది. థాంగ్లాపర్వతశ్రేణి ధక్షిణప్రాంతానికి చైనా సైన్యాలు చొరబడి వచ్చుటకు, చైనా ప్రభుత్వం బాధ్యత వహించవలసి వుంటుందని భారత ప్రభుత్వం సెప్టెంబరు17న హెచ్చరించింది. భారతదెశ సమగ్రత ప్రశ్నించరానిదని, ధృఢనిర్ణయాన్ని పునరుద్ఘాటించుతూ, తగిన స్థాయిలో సంప్రదింపులు,చర్యలు భారతప్రభుత్వం సూచించింది.

2. చైనాసైన్యాలు చిప్‌చాప్ ప్రాంతంలోనే ప్రవేశించాయి, భారతప్రభుత్వం సెప్టెంబరు 20న తన అసమ్మతిని తెలియజేసింది. చిప్‌చాప్ పరిసరప్రాంతాలలో చైనా సైనికులు ఆరు నూతన సైనిక పోస్టులను యేర్పాటు చేయుటపై చైనా ప్రభుత్వానికి భారతప్రభుత్వం తన

అసమ్మతిని సెప్టెంబరు 21 తెలియ జేసింది. అదే రోజున వాయువ్య ఏజన్సీలోని ధోలాప్రాంతంలో చైనా సైన్యాలు భారతసైనిక పోస్టులపై దాడిచేయగా భారత ప్రభుత్వం అసమ్మతిని తెలిపింది.

3. భారతప్రభుత్వం అక్టోబరు 6న, తాజాసరిహద్దుఅతిక్రమణలను చైనాప్రభుత్వం సరిచేయనిచో, భారతప్రభుత్వం ఎట్టిసంప్రదింపులు, చర్చలు కొనసాగించజాలదని స్పష్టం చేసింది. తూర్పుసరిహద్దు ప్రాంతంలో అంతర్జాతీయ సరిహద్దు నుండి తమవైపుకు తమసైన్యాలను వుపసంహరించుకొనాలని స్పష్టంచేసింది.

భారత రక్షణ సైనిక పోస్టులపై చైనా సైనికదళాలు విశాలవిస్తృత, తూర్పు, పశ్చిమ ప్రాంతాలలో ద్విముఖ దండయాత్రసాగించి, భారతప్రాంతంలోనికి చాలదూరం చొచ్చుకొని వచ్చి,అక్టోబరు 24న చైనా ప్రధానమంత్రి మూడు అంశాల ప్రతిపాదనలు చేస్తూ, భారత ప్రధానికి లేఖపంపారు. రెండు దేశాలు వాస్తవాధీనరేఖను గౌరవించాలి. రెండు పక్షాల సైన్యాలు యీరేఖకు 20కిలోమీటర్లు దూరం వుపసంహరించుకొనాలి. తూర్పురంగంలో చైనా సైన్యాలు ఆరేఖకు వుత్తరానికి వుపసంహరించుకొంటాయి. ఇండియా, చైనాలు వాస్తవాధీనరేఖను దాటవని ప్రకటించాలి. రెండు దేశాల ప్రధాన మంత్రులు సరిహద్దు సమస్యలపై కలసి స్నేహసంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొనాలి. అంటె, దురాక్రమణ ఫలితాలను చైనా అనుభవించు అవకాశాలను కలుగజేయుట. భారతప్రధాని అక్టోబరు27న, భారత దేశంలో చైనా సైన్యాలు ప్రవేశించి, నూతన దురాక్రమణలను కొనసాగించుతూ వుంటే, ఎట్టి సంప్రదింపులు, చర్చలకు భారతప్రభుత్వం అంగీకరించ జాలదని, జవాబు వ్రాసారు. భారతప్రధాని సెప్టెంబరు 8కి ముందున్న యధాస్థితిని పునరుద్ధరించి, సరియైన వాతావరణాన్ని చైనా కలుగజేయాలని ప్రకటించారు. అంటే సెప్టెంబరు 8 తరువాత జరిగిన దురాక్రమణ ఫలితాలు చైనా అనుభవించుటకు వీలులేదని స్పష్టం చేసారు.

ఈ యుద్ధానికి కారణాలైన కొన్ని ముఖ్యఘటనలను, పరోక్షంగా ప్రేరకాలైన అవగాహనల గురించి తెలుసుకొనవలసిన కొన్ని ముఖ్యాంశాలు యీలావున్నవి.

భారతదేశం తన ఆర్థిక విధానాన్ని అంతర్జాతీయ శాంతి పరిస్థితులలో అభివృద్ధిపరచుకొనచూస్తున్నది. సామ్రాజ్యవాదులతో వైరుధ్యం కలిగియుంది. అదేకాలంలో భారతబడా బూర్జువావర్గం సామ్రాజ్యవాదులతో లెక్కలేనన్ని ఆర్థిక సంబంధాలను కలిగి, విదేశీపెట్టుబడిపై ఆధారపడి వుంది. అంతేగాక బడా బూర్జువావర్గం, బాహ్యాఆర్థికవిస్తరణ వాంచను కలిగి, వీలైతే స్వతంత్రంగాను, లేనిచో సామ్రాజ్యవాదంతో కలిసి, వారి ప్రభావంలో అట్టి విధానాలకు లోనగుతున్నది. అంతర్జాతీయ సంబంధాలలో భారతప్రభుత్వం నెహ్రూ నాయకత్వంలో వలస విధాన, సామ్రాజ్యవాద వ్యతిరేకతను ప్రదర్శించుతూ, సోషలిస్టుదేశాలతో శాంతి, స్నేహ, సహకార సంబంధాలు పెంపొందించుచున్నది. ఈ విధంగా భారత బడా బూర్జువావర్గం ద్వందవిధానాన్ని అవలంభించుచున్నది. చారిత్రిక కారణాలవలన భారత బూర్జువావర్గం, బ్రిటిష్ వలస విధానాలను కొన్నింటిని వారసత్వంగా పొందింది.

సర్వసాధారణంగా, చైనా విదేశాంగ విధాన పరిశీలకులు సైద్ధాంతికంగా భారతదేశాన్ని వెనుకకు నెట్టుట, టిబెట్‌లో వ్యూహాత్మకర రహదారుల ప్రాముఖ్యతను మాత్రమే పరిగణించుచు, చైనా అంతర్గత రాజకీయ శక్తులను వదలి వేస్తున్నారు.అంతర్జాతీయ రాజకీయ పోటీప్రధానమైనదే. భారతదేశంలో సైనిక తిరుగుబాటులో అధికారంలోనికి వస్తే,అమెరికా నైరుతి ఆసియా సైనికా కూటమిలో, వారి దురాక్రమణలో పరోక్షంగానో భాగస్వాములగు అవకాశం వుందనే అంశం, చైనా భారతదేశ విదేశాంగ విధానంలో బలంగా వుంది. చైనా సైద్ధాంతిక అవగాహన, వాస్తవికతా ధృక్పధం శిలాసదృశ్యంగా, ఏకేదిశ కేంద్రీకరణగా తలచి, నమ్మితే తప్ప, యేసైద్ధాంతిక, వాస్తవికతా తత్వం పైచేయి అయింది స్పష్టంగాదు. ఏదైనా, మావోమాటే పైచేయి అయినా, అది ప్రతి పక్షవాదనలను అనుసరించినట్లు కన్పడుతున్నది. ప్రపంచంలో చైనా వేరు పడియుండుటను సమన్యగా నెంచినవారు, భారతదేశాన్ని దూరం చేసుకొన ప్రయత్నించరు. యేమైనా యితరదేశీయ. అంతర్జాతీయ అంశాలు ప్రాధాన్యతవహించినట్లు కన్పడుతున్నది.

"భారతదేశ రాజకీయ పరిణామాలపై చైనా అధ్యయనం పూర్తిగ సరియైనది కాదనేది స్పష్టం, చైనీయులు రష్యా-అమెరికనుల కలయికను, భారతదేశం వారికి లొంగివుండుటను, అతాగా నొక్కిచెప్పారు. అమెరికా-రష్యాలపోటీని, సంఘర్షణలను తక్కువగా చేసి చెప్పారు"[1], ఇది, అవగాహనలను ప్రక్కదారులు పట్టించింది.

పశ్చిమదేశాల పరిశీలకులు, చైనా వారివలెనే చైనా విధానాల రక్షణ స్వభావాన్ని నొక్కిచెప్పుతున్నారు. చైనా మిత్రులు కాని అమెరికన్ సైనికవర్గాల నుండి లభించే సాక్ష్యాధారాలు భారత సైన్యమే విశాల, విస్తార ఉత్తర ప్రాంతాలకు పురోగమించిందని స్పష్టంగా తెలియ జేస్తున్నవి. ఏమైనా చైనా అంతపెద్దయెత్తున సైన్యసమీకరణ కావించి, సరిహద్దు పొడవునా విస్తృత దండయాత్రలను సాగించుటకు గల రాజకీయ అవసరపు వివరణల అధ్యయనం కన్పించదు. చైనాలో ఆర్థికాభివృద్ధి తిరోగమనం, ఛాంగ్‌కైషెక్ సైన్యాల తూర్పు సరిహద్దులలో జరుపుతున్న దాడులను అరికట్టలేక పోవుట, చైనా దక్షిణ సరిహద్దులలోని లావోస్‌లో అమెరికా సైనిక చర్యలు ఉత్తరాన, పశ్చిమాన సోవియట్-చైనా సరిహద్దు సైన్యాల సంఘర్షణలు, అవమానాల పరిస్థితులలో చైనా జాతీయ సార్వభౌమాధికారాన్ని,టిబెట్‌లో, చైనా -భారత సరిహద్దులలో పటిష్టంచేయు ప్రయత్నాలను పెకింగులో ఎవరూకాదనజాలరు. జాతీయ అవమానాన్ని యేజాతీయ శక్తులు సహించజాలవని భారతీయులకు అనుభవంలో స్పష్టంగా తెలుసు. చైనా విదేశాంగ విధానాన్ని అధ్యయనం చేయునపుడు జాతీయ సంఘటలన్నిటిని, జాతీయ లేక సైద్ధాంతిక సమస్యలుగ దర్శించే వైఖరి చాలాబలంగా వుంది. తగినన్ని ఆధారాలు లేనందున దేశీయ రాజకీయాలను పరిగణలోనికి తీసుకొనజాలని వైఫల్యం కన్పడుతున్నది. అంచేత నిర్ణయాత్మక అంశాలు కొన్నిటిని త్రోసిబుచ్చుట జరుగుతున్నది. జాతీయ కాంగ్రెసులో ప్రధాని నెహ్రూ, రక్షణ మంత్రి కృష్ణమీనన్‌లు ఉత్తరాభి ముఖంగా సైనికవొత్తిడి కొనసాగించుటకు పూర్తిగ వారి హస్తాలలోనే

1.ఎడ్వర్డ్‌ఫ్రెయిడ్‌మన్ (1971)చైనాఅండ్ ఇండియా-ది అన్‌నెసరీ ఎనిమీస్.ఇంకియన్ లెఫ్ట్‌రివ్యూ.వా.1.నం.1.పే. 46-47.

నిర్ణయాలను ఎందుకువుంచింది. మితవాద వర్గాల వత్తిడి వలనే అని అనుకొనవలసి వుంది. నిజానికి స్పష్టంగా అర్ధంకాని విషయంగానే వుండి పోయింది. చైనాతో సంఘర్షణలలో నెహ్రూ, కృష్ణమీనన్‌లు నాయకత్వం వహించుటలోని సౌలభ్యత భారత బడా బూర్జువావర్గాలకు బాగా తెలుసు. నెహ్రూ, కృష్ణమీనన్‌లు సామ్రాజ్యవాద వ్యతిరేకులు అభ్యుదయకాముకులు, ప్రపంచశాంతి ప్రియులు, కమ్యూనిస్టు, సోషలిస్టు అభిమానులగ ప్రపంచ ఖ్యాతివహించన వారుగాన, చైనాతో సంఘర్షణలలో వారినాయకత్వాన్నే భారతబడా బూర్జువావర్గం నిజానికి కోరుకొంటున్నది. మరిన్ని ప్రయోజనాలకై వొత్తిడి చేయుట వేరే విషయం. వారైతేనే ప్రపంచ అభ్యుదయ శక్తులలో భ్రమలు కల్పించగలరు, ఆవిధంగా తమ ప్రయోజనాల కాపాడు కొనగలరు.

భారత దేశం- చైనా రిపబ్లిక్‌ల మధ్య విస్తృత సంఘర్షణల వలన ప్రయోజనం పొందగల అవకాశాలు యెక్కవగ కల జాతీయ, అంతర్జాతీయ వర్గాలేవి? ఈ విషయం అధ్యయనం చేస్తే తెరవెనుక విషయాలు కొన్నైనా బహిర్గత మయ్యే అవకాశంవుంది.

చైనా -సోవియట్ సరిహద్దు సంఘర్షణల నేపధ్యంలో భారత సరిహద్దులలో చైనాసైనికచర్యలు ప్రధానంగా దేశీయ రాజకీయాంశాల ప్రొద్భలం పరోక్షంగా కన్పడుతున్నది. చైనాకు సైనిక చర్యలు లాభప్రదమైనవికావు. అవి అమెరికా, రష్యా, జపాన్‌లకు భారతదేశం వారికి దూరమగునట్లుగాక వారి ఆయుధసహాయాన్ని (?) ఆహ్వానించునట్లు సంఘర్షణలు చేస్తాయి. ఇది వూహించరాని ఫలితంకాదు. భారతదేశ మిత్రత్వాన్ని, స్నేహాన్ని కోల్పోవుటయేగాక అనేక ప్రపంచ దేశాల స్వచ్ఛంద సౌభాతృత్వాన్ని కోల్పోయే ప్రమాదంలో చైనా పడింది. ఒక్కపాకిస్తాన్‌కు మాత్రమే చేరువైంది. చైనా ప్రపంచంలో వేరు పడిదూరమగుట, దాని స్వయం కృతాపారధం అనే వాదనవున్నా, దీర్ఘకాలంగా అమెరికా విజయవంతంగా చైనాను దూరం చేయుప్రయత్నాలను, ముఖ్యంగా ప్రపంచ అంతర్జాతీయ ప్రధాన పాత్రల నుండి దూరంచేయుప్రయత్నాలను పరిగణించకపోవుట సరియైన అవగాహనలకు మనలను చేర్చదు. ఈ సందర్భంలో చైనా ప్రపంచ సమాజంలోనికి వచ్చుటకు తోడ్పడిన బర్మాకు, ప్రధాన మంత్రి చౌయెన్‌లై కృతజ్ఞతాభావందనలను బహూళంగా పేర్కొనుటను గుర్తుపెట్టుకానాలి.

చైనాలో అతివాది, రక్షణశాఖ మంత్రి లిన్‌పియావో సైనికంగా యెట్టిప్రధాన విజయాన్ని పొందలేదు. లావోస్ సంఘర్షణలో చైనా రాయబారుల చొరవతో 1961-62లలో పరిష్కారం పొందగలిగింది, అది చౌయెన్‌లై విజయమైంది. చైనా తూర్పుప్రాంతంలో పెద్దసైన్యసమీకరణ కావించినా 1962 వసంతకాలంలో సముద్రగర్భం తైవాన్‌లో నుండి ఛాంగ్‌గైషేక్ సైన్యాలు చైనా భూభాగంలోని సైనిక కేంద్రాలపై దాడులు విజయవంతంగా జరుపుతున్నా, చైనా సైనికసంఘర్షణలలో ప్రధానంగా యెట్టివిజయాన్ని పొందలేదు. ఛాంగ్‌గైషేక్ సైన్యాలను అదుపులో పెట్టమని అమెరికాను కోరుట తప్ప యేమీచేయలేక పోయింది. ఈ పరిస్థితులు భారత సైన్యం "ముందడుగు విధానాన్ని" అవలంభించుతున్నపుడు, లిన్‌పియవో మరోఅపజయాన్ని చవిజూడదలచలేదు. టిబెట్‌లో కమాండరు చౌంగ్‌కొహువా, సమస్యను విజయవంతంగా పరిష్కరించగలనని తెలిపినా, ఆగ్నేయ ఆసియా రాజకీయ

యంత్రాంగమంతా, పెకింగ్‌లో పార్టీ అగ్రనాయకత్వంతో డెంగ్ సియాహోపింగ్‌తో సహా సమావేశమయ్యారు. లీషాచీ "ముందుకు గొప్పగా దూకుట" విధానాన్ని వదలి, డెంగ్‌సియాహోపింగ్ గ్రూపుపై ఆధారపడుతూ జాతీయ అధికారనిరంకుశత్వంతో చేతులు కలుపుతున్నాడు. ఈ కారణంగా, మావోప్రజాపంథా" ప్రాముఖ్యత తగ్గిపోయింది. తూర్పుతీరం, చైనా మిలిషియా ఛాంగ్‌గైషేక్‌ను అదుపులో పెట్టలేక పోయింది. లావోస్ గెరిల్లాపోరాటం అమెరికాపై ఆధిక్యతను సాధించజాలకపోయింది. టిబెట్‌లో ప్రధానసైన్యం వొకనూతన "మ్యూనిచ్"ను నివారించగలదు. అట్టివిధానాన్ని రాయబార, వ్యాపారవర్గాలు, ముఖ్యంగా తృతీయ ప్రపంచ తటస్థ విధానాలతో ముడివేసుకొన్నవారు మాత్రం వ్యతిరేకించగలరు. ఆఫ్రికా, మధ్య ఆసియా, ఇండియాలలో చైనా వ్యతిరేక సోవియట్ విధానం,తృతీయ ప్రపంచం, చైనా రాయబార విధానాలకు యేమాత్రం సహాయకారిగాలేదు. చైనా రక్షణచర్యలు భారతదేశాన్ని మరికొంత సోవియట్ బాహుబంధాలలోనికి త్రోసివేసినా, యేవిధంగానైనా జరుగువలసిన దానిని కొంత వేగిరపరచినా, కనీసం భారతదేశపు" కుహనాత్మకతటస్థ విధానం"బహిర్గతమగుతుంది. చైనాకమ్యూనిస్టుపార్టీ,సైన్యం, శెక్రటెరియట్, రక్షణశాఖామంత్రి విజయాన్ని కోరుతున్నారు. అవసరం అని అంచెనావేసారు. మావో టెలిఫోన్‌లో చాంగ్ కౌఫ్రవాకు "పరిస్థితిచేతిలోనికి తీసుకొని జాగ్రత్తగా చూడమన్నారు.[1] ఈవిధమైన అవగాహన చైనాలో కన్పడుతున్నది.

"లిన్‌పియావో,లీషాచీ యిద్దరూ వొత్తిడి చేయుటతో మావో అంగీకరించారా? భారతప్రధాని మంత్రి తనకు తెలిసిన వారందరిలోన "అత్యంతపెడసరి రాజకీయవేత్తని రాజీ, రాయబారాలు లాభంలేదని సైనిక చర్యయే, యేకైక మార్గమని" చౌయెన్‌లై నిర్ధారణకొచ్చినందున, మావో ఆమోదించారా? మావోకు చౌయెన్‌లై రాయబార విధానాలపై పూర్తి విశ్వాసంవుంది. రాజకీయ విశ్లేషణా పరిశీలకులు వ్యక్తిగతాంశాలను, చౌయెన్‌లై-నెహ్రూ సంబందాలను,లిన్‌పియావోకు విజయావసరం, లీషాచీ-డెంగ్‌సియాహోపింగ్, ఆగ్నేయాసియా నిరంకుశ పార్టీ, సైనిక, అధికారయంత్రాంగపు కొంగుముడి ప్రాధాన్యత లేక పోలేదు. సాంస్కృతిక విప్లవకాలంలో అన్నివర్గాలను కూలద్రోసి, నూతనవర్గాలు అధికారంలోకి వచ్చుట యీ అవగాహనకు బలాన్నిచేకూర్చుతుంది.[2]

భారతసైన్యంలో 1960దశకంలో ముఖ్యస్థానాలలో వుండి, భారత-చైనా సరిహద్దు యుద్ధాన్ని నడిపిన సైనికాధికారులు 1970 దశకంలో తమగళాలను విప్పి కొన్ని విషయాలు తెలిపారు. వారు తమ చర్యలను, ఆచరణను సమర్థించుకొంటూ పొరపాట్లన్నిటీని రాజకీయ నాయకులపై నెట్టివేసారు.

జనరల్ థాపర్ జనవరి 9,1971లో తనమౌనాన్ని వదలి, రాజీనామా తదనంతరం స్టేట్స్‌మన్‌లో వ్యాసం వ్రాస్తూ నెహ్రూముందడుగు విధానాన్ని బలపరస్తూ, దాడిని కృష్ణమీనన్

1. ఎడ్వర్డ్ ఫ్రెయిడ్‌మన్(1971) చైనా అండ్‌ఇండియా-ది అన్రెస్టరీ ఎనిమీస్. ఇండియన్

2. ఎడ్వర్డ్ ఫ్రెయిడ్‌మన్(1971) చైనా అండ్‌ఇండియా-ది అన్రెస్టరీ ఎనిమీస్. ఇండియన్ వెస్టంటరివ్యూ [illegible] 47.వెస్టంటరివ్యూ.వా1,నం1:పే.46-47.

పై కేంద్రీకరించారు. స్వచ్ఛమైన సైనిక సమాలోచనలలో చనలలో యేదో చిన్న రాజకీయ కారణం చెప్పి, తలదూర్చుట కొనసాగించారు.వివాదాన్ని పెద్దది చేయుటపై "యుద్ధానికి దారి తీసింది", ముందడుగు విధానంగాక చైనీయులను థాంగ్లా పర్వతశ్రేణుల నుండి తొలగించాలనే మననిర్ణయం, దానికి మనమిచ్చిన ప్రచారం"కారణమన్నారు. "ఈనిర్ణయం కృష్ణమీనన్‌చే నెహ్రూ, విదేశాలకు వెళ్ళినపుడు తీసుకొనబడింది, తన సహచరులతో గూడ సంప్రదించలేదు, చైనా ప్రతిస్పందనపై,తత్ఫలితాలపై నేను వెలిబుచ్చిన సందేహాలను త్రోసిబుచ్చి నిర్ణయించారు" అనివ్రాసారు. "చైనీయులను తొలగించి వేయుమని యిచ్చిన ఆర్డరుపై సర్వసైన్యాధిపతి థాపర్" నేను వెనుతిరిగి చూస్తే అప్పుడు రాజీనామా యిచ్చివుండవలసిందిగ తలంచుతాను, నాదేశాన్ని అపజయం నుండి, అవమానా న్నుండి కాపాడకలిగేవాడిని" అని వ్యాఖ్యానించినట్లు చెప్పబడింది.ఈవ్యవహారంలో సమతూకాన్ని ప్రదర్శించుటకు కృష్ణమీనన్‌కు యుద్ధం ఎలా చేయాలో తెలియదు" అని థాపర్ తాజాగా పేర్కొన్నారు.

"తొలగించాలని యిచ్చిన 'ఆజ్ఞ' సందేహాలను తను ఎలా నివృత్తి చేసుకొన్నదీ థాపర్ యిలా వివరించారు". నేను నాసందేహాలను నాసీనియర్ ఆఫీసరులతో చర్చించాను. చైనా రాజకీయ పరిస్థితి కారణంగా గట్టిగా స్పందించదు, టిబెట్‌లో 8-10 డివిజనుల సైన్యమున్నావారు కంపాల తిరుగుబాటును, అణచుటకు, రోడ్ల నిర్మాణానికి వినియోగిస్తున్నారు. ప్రభుత్వం థాగ్లా శిఖరాగ్రం నుండి చైనీయులను తొలగించిన, వారితో జరుపబోవు సంభాషణలలో సౌలభ్యం వుంటుందని నమ్ముతున్నది. సంభవించగల పరిణామాల గురించి హెచ్చరించి, ఆజ్ఞలను పాలించుట మా విధియై యున్నది". అని జనరల్ థాపర్ వివరించారు. భారతదేశంలో "ముందడగు విధానం" కర్తల గురించి వాదనలున్నవి. థాపర్ మొట్టమొదటగా రికార్డులలో, 5డిశంబరు 1961 ఆర్డరులో సైనిక కేంద్ర ఆఫీసు నుండి సంబంధిత సైన్యాధికారులకు వ్రాస్తూ వుదహరించుట జరిగింది. అయితే దానికి సామ్రాజ్యవాద చరిత్ర చాలా వుంది. ఈశాన్యసరిహద్దు వివాదాలపై బ్రిటిష్ 19వ, శతాబ్దపు విధానంపై చర్చల్లో "ముందడుగు విధానం " అనేమాటను రూపొందించినట్లు కన్పడుతుందని నెవెల్లె మాక్స్‌వెల్ పాదపీఠికలో పేర్కొన్నారు.[1]

థాగ్లా శిఖరాగ్రాన తమ సైన్యాలపైదాడి చేసినా చైనా బలంగా ప్రతిస్పందించదనే రాజకీయ అవగాహన మన ప్రభుత్వ నాయకులకు యెంతబలంగా వున్నదంటే, తొలగించాలనే ఆర్డరును వ్యతిరేకించినా త్రోసిబుచ్చేవారు. నెహ్రూ అంతటి బలమైన విశ్వాసం కలిగి వుండుటకు కారణమేమిటి? చైనా వారు యీ ముందడుగు విధానానికి తీవ్రంగా ప్రతి స్పందించరని, రహస్యశాఖాధిపతి మల్లిక్ కలిగించారు, నెహ్రూ ఆమోదించారు. భారత సైన్యం లోకలుదాడులు చేసినా, చైనా ప్రతిచర్య తీసుకొనదనే నమ్మకానికొచ్చారు. ఈ అభిప్రాయాన్ని రష్యనులు కలిగించి, బలపరచినట్లు యిప్పుడు చెప్పబడుతున్నది. విదేశాంగశాఖ కార్యదర్శిగా వున్న యం.జె. దేశాయి సెప్టెంబరు 9,1962న,కృష్ణమీనన్

1. నెవిల్లె, మాక్స్‌వెల్ (1971) ఇండియాస్ చైనావార్.పే.449

యేర్పాటు చేసిన సమావేశంలో చెప్పినట్లు యిప్పుడు చెప్పబడుతున్నది.చైనా యెప్పుడూ భారతదేశంపై దాడి చేయదనే అవగాహనను,అంచెనాను, భారతదేశానికి రష్యాపంపింది. చౌయెన్‌లై తానే, రష్యా భారతదేశానికి అట్టి అంచెనాను, అవగాహనను యిచ్చినట్లు పేర్కొన్నారు. చౌయెన్‌లై 1971లో భారత -చైనా సంఘర్షణకు "సోవియట్ సంస్కరణ వాదులు ఇండియాకు "చైనా స్పందించి పోరాడదని" 1962లో చెప్పారని, రచయిత మాక్స్‌వెల్ పేర్కొన్నారు.[1]

జనరల్ కౌల్ "పాకిస్థాన్‌తో సంఘర్షణ" అనే పుస్తకంలో, 1962లో భారతదేశం చైనా యుద్ధంలో బలహీనంగా వున్నా, సప్లయిల కొరత వున్నా ధృడమైన వైఖరి అవలంభించుటకు బి.యన్.మల్లిక్ డైరెక్టర్, ఇంటిలిజన్సు బ్యూరో అనుమానా స్పదస్థలాల నుండి సేకరించిన సమాచారానికి మరికొంత రంగుపులిమి సెప్టెంబరు 1962నివేదికలో "నమ్మకమైన ఆధారాలంటూ సమర్పించిన సమాచారం తప్పుదారి పట్టించిందని వ్రాసారు.

నెహ్రూ తరువాత ఎవరు? అనే గ్రంధంలో జనరల్ కౌల్‌ను అతిగా పొగిడిన వెల్లెస్ హాంగన్ "ఉత్తర సరిహద్దు లడక్‌లో చైనీయులకు వ్యతిరేకంగా అను సరించిన 'ముందడుగు విధానం' విషయంలో కౌల్, కృష్ణమీనన్‌ను త్రోసిబుచ్చి, నెహ్రూ వద్దకు వెళ్ళి, చైనా సైనిక పోస్టులకు ప్రక్కగా మనసైన్యం అగ్రగామి సైనిక పోస్టులను యేర్పాటు చేయు విధానాన్ని ప్రధాని ఆమోదించునట్లు చేసారు". అని వ్యాఖ్యానించుట, యింతకు ముందు రూపొందిన అభిప్రాయాలను బలపరచుచున్నది.[2]

భారతదేశం-చైనాల మధ్యసరిహద్దు సైనికుల తీవ్రసంఘర్షణలు, అదే విధమైన సరిహద్దు సంఘర్షణలు సోవియట్ యూనియన్-చైనాల మధ్య 1962 మధ్య భాగంలో జరుగుటయే గాక, దగ్గరదగ్గరగా అదే కాలంలో క్యూబామిసలీల విషయమై అమెరికా-సోవియట్ యూనియన్‌లు మానవజాతిని ప్రపంచ అణుయుద్ధ పొలిమేరలవరకు తీసుకొని వెళ్ళాయి. ఈ ఘటనల క్రమాన్నంత యాదృచ్ఛికంగా జరిగిందిగా తలంచుట శాస్త్రీయ విధానం కాదు. ప్రపంచ పరిస్థితులలో యేర్పడుతున్న సంక్షోభపరిస్థితుల బహుళపార్శ్వాలుగా నెంచితేనే సమస్యలకు వివరణలభించుతుంది.

భారతదేశం చైనాను విస్తరణవాదిగా నిరంతరం పేర్కొంటూ, నెహ్రూ నవంబరు1961లో భారతదేశ సరిహద్దుల అతిక్రమణ జరిగిందని పేర్కొన్నారు. సంఘర్షణల తత్వం విస్తరించి "ముందడుగు విధానంతో సైనిక సన్నాహాలు చైనాలో పోరాటానికి ప్రారంభమైనవి. తనకు చేరిన సమాచారాన్ని బట్టి నెహ్రూ మే 1962లో చైనాలో "పంటలు వరుసగా పోయాయని" ఫలితంగా "భగ్గున మండే పరిస్థితిలో వున్నదని" మాట్లాడారు.

అక్టోబరు 1962లో పెకింగ్‌లో సోవియట్ రాయబారికి, చైనా విదేశాంగ మంత్రి, "భారతదేశం విస్తృత సైనిక చర్యకు ఉపక్రమించే ప్రయత్నంలో వుందని," "ఇండియా

*1. నెవెల్లి మాక్స్‌వెల్ (1971) ఇండియాస్ చైనావార్.పే.450 & 451*

*2. నెవెల్లీ మాక్స్‌వెల్ (1971) ఇండియాస్ చైనావార్.పే.452*

దాడి చేస్తే మాఅంతట మేము రక్షణ చేసుకొంటామని" చెప్పారు. ఇండియాలోని అమెరికా రాయబారి జాన్ కెన్నెత్ గాల్బ్రేత్ అటువంటి సమాచారాన్నే పంపినట్లు, సెనేట్‌లో జనరల్ మాక్స్‌వెల్ టైలర్ బయటపెట్టారు. ఈవిధంగా భారతచైనాలు యుద్ధపు పొలిమేరలకు చేరాయి.

# 7

# భారత్‌చైనా సరిహద్దు యుద్ధం, కమ్యూనిస్టుల వైఖరి

భారత కమ్యూనిస్టు పార్టీ 6వ కాంగ్రెసు వరకు భారత-చైనా సరిహద్దు వివాదంపై చెలరేగిన ఘటనలు, అంశాలపై పార్టీ వైఖరిని అధ్యయనం చేస్తూ అందులో భాగంగానే ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల నవంబరు 1960 సమావేశంలో సరిహద్దు వివాదంపై అజయ్ ఘోష్ పార్టీ దృక్పదాన్ని సోదర పార్టీలకు వివరించుట తెలుసుకొన్నాము. తదనంతర కాలంలో పార్టీ ప్రధాన తీర్మానాలు, ప్రకటనలు ముఖ్యంగా సరిహద్దు యుద్ధ సమస్యలపై అధికార పూర్వక అవగాహనలు, ఆచరణలు యిప్పుడు తెలుసుకొందాము.

## భారత్-చైనా ప్రభుత్వాధికారుల బృందం సరిహద్దుల అధ్యయనం

వివాద సరిహద్దులను రెండు ప్రభుత్వాల అధికారుల బృందం అధ్యయనం చేశాయి. కాని దురదృష్టకరంగా ఒకే నివేదికను నిర్ధారణలను చేయజాలక రెండు నివేదికలను ప్రభుత్వాలకు సమర్పించాయి. అవి పరస్పర విరుద్ధ అవగాహనలను, అభిప్రాయాలను కలిగి వున్నాయి. కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి 18 ఫిబ్రవరి 1961లో సమావేశమై పశ్చిమాన సాంప్రదాయ సరిహద్దులను, తూర్పున మెక్ మాహన్ రేఖను సరిహద్దుగా ఆమోదించిన నవంబరు 1959లోని మీరట్ తీర్మానాన్ని పునరుద్ఘాటించుతూ తీర్మానించింది. స్నేహభావాలు అంతరించి, కాఠిన్యత, పరస్పర అనుమానం, అప నమ్మకం చోటు చేసుకొన్నవంది. జాతీయ సమితి లడక్ ఘటనలలో ప్రాణాలు కోల్పోయిన భారతీయులకు గాఢ విచారాన్ని వెలుబుచ్చి వారి కుటుంబాలకు ప్రగాఢ సంతాపాన్ని తెలిపింది. సమితి రెండు పక్షాలు సరిహద్దుల వివాదంపై తమ తమ వాదనలను సమర్ధించు లక్ష్యంతో ప్రతి పక్షవాదనలను ఖండించుటకై సమాచారం సేకరించుట జరిగిందికాని సమిష్టిగా రెండిటిని పూర్వ పక్షం చేసి సమన్వయంగా వొకే నివేదిక సమర్పించి సమస్య పరిష్కారానికి తోడ్పడు వాస్తవ శాస్త్రీయ విధానాన్ని అనుసరించలేదు. ఫలితంగా అధికారుల సంభాషణలలో ప్రతిష్టంబన యేర్పడింది. ప్రతిష్టంబన పరిష్కారానికి రెండు ప్రభుత్వాలు రాజకీయ ప్రాతిపధికగా నేరుగా సంభాషణలను చేబట్టవలసి వున్నది.

జమ్మూ కాశ్మీర్, పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతంతో సహా ఇండియన్ యూనియన్‌లో భాగమైనందున, ఏ దేశమైనా భారత దేశంతోనే వ్యవహరించవలసి వుంటుంది. పాకిస్తాన్‌కు

ఏ దేశంతోనైనా సంభాషణలు జరుపుటకు గాని, వొప్పందం చేసుకొనుటకు గాని చట్టబద్ధమైన ఎట్టి అధికారం లేదు. భూటాన్ ప్రభుత్వం ఉత్తర సరిహద్దులకు సంబంధించిన సమస్యలపై సంప్రదింపులకు నిర్ణయాలకు భారత ప్రభుత్వానికి పూర్తి అధికారాన్ని యిచ్చింది. కాని భూటాన్ ఉత్తర సరిహద్దు విషయమై చైనా భారత ప్రభుత్వంతోనే సపంప్రదింపులు జరుపవలసి వుంటుందని కమ్యూనిస్టు పార్టీ ప్రకటించింది. సిక్కిం ఉత్తర సరిహద్దుల విషయమై భూటాన్ వలెనే భారత దేశంతోనే సంప్రదించవలసి వుంటుంది.

కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి, ప్రపంచ శాంతి, ఆఫ్రో ఏసియన్ ఐక్యత, వలస వ్యతిరేక పోరాటం దేశాభివృద్ధి దృష్ట్యా రెండు దేశాలు పంచశీల సూత్రాల ననుసరించి, సంప్రదింపుల ద్వారా వివాద విషయాలను పరిష్కరించుకొంటారని ఆశించుతూ తీర్మానించింది.[1]

## తూర్పు ప్రాంత మెక్ మాహన్ సరిహద్దు రేఖ

కమ్యూనిస్టు పార్టీ జనరల్ సెక్రటరీ 16 డిశెంబరు 1961న జరిపిన ప్రెస్ సమావేశంలో మెక్ మాహన్ రేఖను దాటుతామనే చైనా బెదరింపులపై ప్రశ్నించగా "చైనా నోటులో అటువంటి బెదరింపులేదన్నారు. చైనీసు నోటులో "దాటుతామన్నది" వుదహరింపు మాత్రంగా వాదన కొరకుగా వున్నదని తాను తలచుతున్నానన్నారు. మెక్ మాహన్ రేఖను చైనా దాటదని తాను ఆశించుతున్నానన్నారు. ఒకవేళ చైనా సైన్యం మెక్ మాహన్ రేఖను దాటితే చైనా సైన్యాన్ని తిరుగగొట్టుటకు చేయు అన్ని ప్రయాత్నాలు సమర్ధనీయము. అందుకై భారత ప్రభుత్వం చేబట్టు అన్ని చర్యలను పార్టీ బలపరుస్తుందని" అన్నారు.

"భారత ప్రభుత్వ విదేశాంగ విధానంపై మామౌలిక అవగాహన ప్రధానంగా శాంతి, వలస వ్యతిరేక అలీన విధానంగా వుంది. అంచేత విదేశాంగ విధానాన్ని బలపరిచాం, బలపరుస్తాం" అని అజయ్ స్పష్టం చేశారు. చైనా పత్రికలలో "భారతదేశం దాదాపు సామ్రాజ్యవాదం వైపు పయనించిందని వాస్తవాలకు భిన్నంగానే గాక" వారి వ్రాతలు "సమతూకము లేకుండుటను తెలియచేస్తున్నవని" అని "ప్రపంచంలోని ఏ యితర పార్టీ కన్నా, చైనా పార్టీతో సహా, భారత స్థితిని, ప్రభుత్వాన్ని, భారత కమ్యూనిస్టు పార్టియె సరిగా అంచెనా వేసిందని స్పష్టం చేశారు.[2]

కమ్యూనిస్టు పార్టీ 1962 ఎన్నికల ప్రణాళికలో మెక్ మాహన్ రేఖ తూర్పు ప్రాంతంలో సరిహద్దుగా, పశ్చిమ ప్రాంతంలో సాంప్రదాయకంగా వున్నదే సరిహద్దుగా గుర్తించాలని, జమ్మూ కాశ్మీర్, పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతంతోసహా భారతదేశంలో భాగమని పార్టీ ఎన్నోసార్లు స్పష్టం చేసింద.

భారత కమ్యూనిస్టు పార్టీ సెక్రటేరియట్ 17 అక్టోబరు 1962న సమావేశంలో తూర్పు

---

1. ది ఇండియా-చైనా బోర్డర్ డిస్ప్యూట్ - కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా. తీర్మానాలు. ఉపన్యాసాలు. స్టేట్‌మెంట్లు *(1959-63)* సి.పి.ఐ. పబ్లికేషన్స్ పేజి : *53-54*

2. ది ఇండియా-చైనా బోర్డర్ డిస్ప్యూట్ - కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా. తీర్మానాలు. ఉపన్యాసాలు. స్టేట్‌మెంట్లు *(1959-63)* సి.పి.ఐ. పబ్లికేషన్స్ పేజి : *56-57*

సరిహద్దు నీఫాలో జరిగిన సంఘటనలకు ప్రాణ నష్టానికి భారత-చైనా సాయుధ సైనికుల సంఘర్షణలకు తీవ్ర ఆందోళన తెలిపింది. ఈ సరిహద్దు ప్రాంతం మెక్ మాహన్ రేఖతో భారత-చైనాల మధ్య చాలావరకు గుర్తింపబడి వున్నందున సంఘర్షణలకు దూరంగా వుంది. భారత ప్రభుత్వ ప్రకటన చైనా సైనికులు మెక్ మాహన్ సరిహద్దు రేఖను దాటి దక్షిణానికి వచ్చి భారత దేశ ప్రాదేశికతను అతిక్రమించారని తెలిపింది. చైనా దీనిని నిరాకరించింది. మెక్ మాహన్ రేఖను సరిహద్దుగా పార్టీ ఎల్లపుడూ గుర్తించుచున్నది. అంచేత దాని రక్షణకై చేబట్టిన అన్ని చర్యలు చట్ట సమ్మతమైనవి. హైదరాబాద్ ఆగస్టు 1962 సమావేశంలో కేంద్ర సమితి భారత ప్రభుత్వపు సంప్రదింపులకు మద్దతునిస్తూ, సరిహద్దు రక్షణకు అవసరమైన అన్ని చర్యలు తీసుకొనాలని తీర్మానంలో కోరిందని, దానిని తిరిగి అక్టోబరులో సెక్రటేరియట్ తీర్మానం పునరుద్ఘాటించింది.[1]

మితవాద అభివృద్ధి నిరోధకులు కమ్యూనిస్టులపై దాడిచేయుట అర్థం చేసుకొనగలము. కాని మిత్రులైన విమర్శకులు తప్పుగా అర్థం చేసుకొనుట విచారాన్ని కలుగజేస్తున్నది. మేము పెకింగ్ దేశభక్తులం కాము, అదే విధంగా వాషింగ్టన్ దేశభక్తులమూ కాము. మేము భారత పౌరులం. భారతదేశం విస్తరణవాది దురాక్రమణ వాది కాదు. శాంతి, అలీన విదేశాంగ విధానం. అట్టి దేశంపై దాడి చేసే ఎవరినైనా త్రిప్పికొట్టాలి.[2]

## చైనా దురాక్రమణ, మాతృ భూమి రక్షణ

భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి 2 నవంబరు 1962న "చైనా బహిరంగ దురాక్రమణకు వ్యతిరేకంగా మాతృభూమి రక్షణకై ఐక్యంకండి అనే తీర్మానాన్ని ఆమోదించి, జాతీయ సంక్షోభంలో మాతృభూమి రక్షణకై అందరూ ఐక్యంకండి అని పిలుపునిచ్చి, జాతీయ ప్రభుత్వం, నెహ్రూ వెనుక నిలబడగలమని ఈ మహత్కార్యంలో అందరితో చేతులు కలుపుతామని ప్రకటించింది.

అత్యంత అననుకూల, కష్టతరమైన ప్రాంతంలో అనన్య సామాన్య ధైర్యసాహసాలు ప్రదర్శించి, దేశరక్షణకై తమ విలువైన ప్రాణాలర్పించిన సైనికులకు నివాళులర్పించింది. చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా మహోన్నత ప్రజా విజృంభణ గత కొద్ది వారాలుగా చూశాము. కమ్యూనిస్టులు, దేశభక్తులతో కలసి జాతీయ రక్షణకు, ఐక్యతకు ప్రజా సమీకరణ చేశారు.

చైనా ప్రభుత్వం మెక్ మాహన్ రేఖను దాటిరానని చేసిన వాగ్దానాలను అతిక్రమించి, చైనా సైన్యం పెద్ద యత్తున బహిరంగంగా, సరిహద్దును దాటి భారత్ దేశంలో అనేకస్థలాలను ఆక్రమించింది. అదే కాలంలో లడక్‌లోని మన స్థానాలపై పెద్ద దండయాత్ర చేశారు.

1. ది ఇండియా-చైనా బోర్డర్ డిస్ప్యూట్ - కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా. తీర్మానాలు, ఉపన్యాసాలు, స్టేట్‌మెంట్లు *(1959-63)* సి.పి.ఐ. పబ్లికేషన్స్ పేజి : *61-62*

2. ది ఇండియా-చైనా బోర్డర్ డిస్ప్యూట్ - కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా. తీర్మానాలు, ఉపన్యాసాలు, స్టేట్‌మెంట్లు *(1959-63)* సి.పి.ఐ. పబ్లికేషన్స్ పేజి : *63-64*

మెక్ మోహన్ రేఖ బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కాలంలోనిది. కాని అంగీకారం కాదని, చైనా ప్రభుత్వం ఆ ప్రాంతాలు తమవనే వాదనతో భారత్‌పై దండయాత్ర కావించుట న్యాయసమ్మతం కాదు. దానిని దాటుట నిస్సందేహంగా దురాక్రమణ, మన దేశాల సమగ్రతను అతిక్రమించుట అగుతుంది.

కమ్యూనిస్టు పార్టీ సభ్యులకు సానుభూతి పరులకు బలపరచే వారికి జాతీయ రక్షణకై కలిసి వచ్చిన అసంఖ్యాక ప్రజానీకానికి ధన్యవాదాలర్పిస్తున్నది. ప్రజా ఐక్యతతో దేశ రక్షణ కార్యకలాపాలను తీవ్ర తరం చేసి బలపరచాలని సభ్యులకు, సానుభూతి పరులకు జాతీయ సమితి విజ్ఞప్తి చేసింది.

సరిహద్దు వివాదంపై సంప్రదింపులకు నెహ్రూ షరతులను, విధానానికి జాతీయ సమితి పూర్తి సహకారాన్నిస్తూ బలపరస్తున్నది. భారతదేశం వివాదాన్ని శాంతియుత సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొనుటకు తన సంసిద్ధతను ప్రకటించియే యున్నది. ప్రధాన మంత్రి కూడా సంసిద్ధతను వెల్లడించారు. అదే కాలంలో దేశ రక్షణకు అవసరమైన అన్ని చర్యలు తీసుకొన్నారు. చైనా సైన్యాలు కనీసం దురాక్రమణకు పూర్వం 8 సెప్టెంబరు 1962 నాటి స్థానాలకు వుపసంహరించుకొనిన వెంటనే సంప్రదింపులు అని స్పష్టం చేశారు.

జాతీయ సమితి మిత్ర దేశాల ప్రభుత్వాలు సంఘర్షణలను తుదముట్టించి, సంప్రదింపులకు మార్గాన్ని సుగమంచేయుటను అభినందించుచున్నది. ప్రపంచంలోని అన్ని అభ్యుదయకర శాంతి శక్తులకు, పోరాట విరమణకు, భారత ప్రభుత్వం కోరిన విధంగా చైనా సైనిక వుపసంహరణకు, సంభాషణలకు తగిన వాతావరణాన్ని కలుగజేయుటకు తమ శక్తిని వినియోగించవలసిందిగా విజ్ఞప్తి చేసింది.

ఈసంఘర్షణ కొనసాగింపు ఆఫ్రో-ఏసియన్ ఐక్యతను విచ్ఛిన్నం చేసి, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటన్ని బలహీన పరుస్తుందని, జాతీయ స్వాతంత్ర్యాలకు, ప్రపంచ శాంతికి ప్రమాదకరమని అందరికి స్పష్టమైంది.

చైనా అధికార వర్గాలు, వారి పత్రికలు భారతదేశం సామ్రాజ్యవాదుల ఏజంటని, అభివృద్ధి నిరోధక, విస్తరణ వాదిగా చేసపిన సూత్రీకరణలను విశ్లేషణలను జాతీయ సమితి పూర్తిగాత్రోసిబుచ్చి ఖండించుచున్నది. భారత కమ్యూనిస్టు పార్టి విజయవాడ, 6వ కాంగ్రెసు, ప్రభుత్వపుదేశ విదేశ విధానాలపై చేసిన పొరపాట్లు వున్నా మౌలికంగా యుద్ధవ్యతిరేక, అలీన శాంతి విధానాలు, సామ్రాజ్యవాద, వలస వ్యతిరేక సరియైన విధానాలని చేసిన విశ్లేషణ సంక్షోభ పరిస్థితులలో కూడా రుజువైంది. అందుకు, రేడియోలో నెహ్రూ జాతినుద్దేశించి చేసిన ప్రసంగమే నిదర్శనం. అజయ్‌ఘోష్ డిశెంబరు 1961లో భారత ప్రభుత్వ నైజము విధానాలపై చైనా విశ్లేషణ తప్పుగా వుందని బహిరంగంగా ఖండించారు.

భారత దేశం యెడల సోషలిస్టు చైనా వైఖరి, ప్రపంచంలోని 81 దేశాల కమ్యూనిస్టు పార్టీల 1960 సమావేశపు సాధారణ పంథా అవగాహనలకు వ్యతిరేకమే గాక శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రయోజనాలకు భిన్నంగా సంకుచిత జాతీయ తత్వ ప్రభావాలకులోనైంది.

చైనా ప్రభుత్వ పొరపాటు వైఖరి, దేశ విదేశాలలోని మితవాద అభివృద్ధి నిరోధకులు బలపడి శాంతి యుద్ధ వ్యతిరేక అలీన అభ్యుదయ కాముకులపై వారి దాడి బలాన్ని పదనును పెంచే యీ అవకాశాన్ని భారతదేశ పూర్తి ఆర్థిక రాజకీయ విదేశాంగ విధానాలను మార్చ ప్రయత్నించే శక్తులకు బలాన్నిచేకూర్చింది.

జాతీయ ఐక్యతకు, రక్షణకై ఉత్పత్తి పెంచుటకు, రక్షణ సమీకరణకై ప్రధాని నెహ్రూ చేసిన విజ్ఞప్తికి ప్రజలు మహోన్నతంగా స్పందించారు. కమ్యూనిస్టు పార్టీ పైవిజ్ఞప్తికి స్పందించి, మాతృభూమిరక్షణకై తమవంతు కర్తవ్యాన్ని తమ శక్తి కొలది నిర్వహించగలమని వాగ్దానం చేసింది.

జాతీయసమితి నవంబరు 1962 తీర్మానం అత్యంత తీవ్ర చర్చల అనంతరం అత్యధిక మెజారిటీతో ఆమోదించబడినదే కాని, ఏకగ్రీవంగా ఆమోదించబడినది కాదు. ఆ సమావేశంలోనే పృద్వీరాజు(?)చే వొక చిత్తు తీర్మానం ప్రతిపాదించబడి వీగిపోయింది. అది పార్టీలోని మెజారిటి "డాంగేనాయకత్వంలో తీవ్ర జాతీయ తత్వానికి లొంగిపోయి, అన్ని విషయాలలో ప్రభుత్వాన్ని బలపరచుతున్నారు. వీరి దృక్పదం నుండి సరియైన పంధాను అన్వేషించక "గుత్త పెట్టుబడిదారి వర్గ నైజ లక్షణమే, సామ్రాజ్యవాద దేశీయ అభివృద్ధి నిరోధకులతోసహకారం, చైనా దురాక్రమణకు కార్యకారణాలను గజిబిజిచేస్తున్నదని" ప్రభుత్వం "మొత్తం బూర్జువా వర్గానికి ప్రాతినిధ్యం వహించదని" కూడా బూర్జువా, భూస్వామ్య వర్గాల నియంతృత్వమని పార్టీ అవగాహనను విమర్శించింది.

నవంబరు 1962 జాతీయ సమితిలో విధానాలలో వచ్చిన భేదాభిప్రాయాల గురించి, కమ్యూనిస్టు పార్టీ (మార్కిస్టు) 7వ పార్టీ కాంగ్రెసులో ఆమోదించిన రాజకీయ నిర్మాణ నివేదికలో మూడు ప్రధాన అభిప్రాయభేదాలను వివరించింది.

**మొదటిది** : మెజారిటి చేబట్టిన మౌలిక రాజకీయ వైఖరి "బూర్జువా జాతీయ తత్వ ప్రవాహంలో కొట్టుకొని పోవుట", మెజారిటీ తీర్మానం, కమ్యూనిస్టు వ్యతిరేకుల, చైనా వ్యతిరేకుల ఆందోళనకు భిన్నం కాని విధంగా చైనాపై బహుముఖదాడి. సరిహద్దు రక్షణకై ప్రభుత్వం చేబట్టు అన్ని చర్యలును ఒక వైపు బలపరుస్తూనే, ఆక్రమించుట చైనా లక్ష్యం, మన ప్రజల స్వాతంత్ర్యాన్ని హరించుట చైనా వుద్ధేశ్యమును పంధాని ఆమోదించక తిరస్కరించింది. తదనంతర కేంద్ర కార్యవర్గ సమితి సమావేశంలో మెజారిటీ వర్గం చైనా వైఖరికి బూర్జువా జాతీయ తత్వం, రైతు మనస్తత్వమే వారి చర్యలకు ప్రేరకాలని పేర్కొంటూ చిత్తు తీర్మానాన్ని ప్రతిపాదించగా, వాటిని సవరించి తొలగించబడ్డాయి. అయినా ఆ వర్గ నాయకుడు 'రైతు మనస్తత్వం' పునచ్చరణ చేశాడు.

**రెండవది** : పార్టిలో మెజారిటీ వర్గం, ప్రభుత్వ ఆమోదంకాని ఎట్టి సంప్రదింపులు పరిష్కారాన్ని ఆలోచించుటకు తయారుగాలేదు. ఉదాహరణకు, ఇండియా, చైనా రెండూ తమ 8 సెప్టెంబు 1962 స్థానాలను పునరుద్ధరించక పోతే సంభాషణలు, సంప్రదింపుల ప్రసక్తి లేదనే వైఖరిని అవలంభించారు. మైనారిటి సంప్రదింపులకు పరిష్కారానికి దారి తీసే ప్రతిపాదనలను రూపొందించవలసిన అవసరం వుందని తలచింది. ప్రబుత్వమే

తరువాత భారత దేశం సెప్టెంబరు 8 స్థానాలను పునరుద్ధరించబడక పోయినా, చైనా వాటి స్థానాలకు నిష్క్రమించవలసిందిగా, సరళం చేసింది. ఇదే వైఖరిని తరువాత మెజారిటీ వర్గం అవలంభించింది.

**మూడవది** : పశ్చిమ దేశాల సైనిక సహాయం విషయమైకూడా మెజారిటీ వర్గం ప్రభుత్వ వైఖరిని సమర్థించుతూ "వ్యాపార షరతులపై మాత్రమే అను దానిని చర్చించి, సైనిక సహాయం వ్యాపార షరతులపై పొందిన అనేక దేశాలు తమ స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయినవనే వైఖరిని మైనారిటీ వర్గం అవలంభించింది.

సంక్షిప్తంగా మెజారిటీ అనుసరించిన విధానం కార్మిక వర్గ సైద్ధాంతిక స్థానాల నుండి తిరోగమనం, బూర్జువా జాతీయ తత్వం, మాతృభూమి రక్షణ అనే పేరుతో పాలక వర్గాలపై పోరాటన్ని వదిలివేయటాన్ని తీవ్రంగా విమర్శించింది.

## అత్యవసర పరిస్థితి : కమ్యూనిస్టులు

భారతదేశంపై చైనా దండయాత్ర ఫలితంగా యేర్పడిన అత్యవసర పరిస్థితిపై పార్లమెంటులో 8 నవంబరు 1962న నెహ్రూ తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఆ తీర్మానాన్ని పార్లమెంటు సభ్యులందరూ ఏకగ్రీవంగా నిలబడి ప్రతిజ్ఞచేస్తూ బలపరచారు. పార్లమెంటు ఆ తీర్మానాన్ని 14వ తేదీన ఆమోదించింది. అత్యవసర పరిస్థితితో పాటు భారత రక్షణ చట్టాన్ని కూడా చేశారు. ప్రభుత్వం అత్యవసర పరిస్థితి అధికారాలను, భారత రక్షణ చట్టాన్ని ప్రత్యేకంగా దేశ రక్షణ అవసరాలకు మాత్రమే వినియోగించగలరని హామీ ఇచ్చింది.

రాజ్యసభలో భూపేష్ గుప్తా, లోక్ సభలో హిరన్ ముఖర్జీలు 8 నవంబరు 1962న, చైనా దురాక్రమణపై భారత కమ్యూనిస్టుపార్టీ వైఖరిని వివరించారు.[1]

మన దేశ గౌరవాన్ని సమగ్రతను పరిరక్షించుటకై తమ ప్రాణాలర్పించిన సైనికులకు ఆఫీసర్లకు గౌరవ పూర్వకంగా నివాళులన్పించి, చైనా దురాక్రమణతో వుద్భవించిన సమస్యలపై కమ్యూనిస్టు పార్టి వైఖరిని వివరించారు. జాతి మొత్తం ఐక్య కంఠంతో సైనికుల త్యాగాలకు నివాళులర్పించింది. భూపేష్ గుప్తా రాజ్యసభలో కమ్యూనిస్టు పార్టీ నాయకుడు, నెహ్రూ చెప్పినట్లు, అనేక వాగ్దానాలు చేసినా మెక్ మాహన్ రేఖను దాటుట గుణాత్మకంగా నూతన అంశమని అంగీకరించుతున్నానన్నారు. సరిహద్దును దాటుటయే గాక, దాని దక్షిణాన అనేక విస్తృత ప్రాంతాలను ఆక్రమించారు. ఈ దురాక్రమణ, భారత చైనా ప్రభుత్వాల ప్రతినిదులు సంప్రదింపులకు సిద్ధమౌతున్న తరుణంలో జరిగింది. దురాక్రమణ సైన్యాలను 8 సెప్టెంబరు 1962 నాటి స్థానాలకు వుపసంహరించుకొనుట సరియైనదని చెప్పుతున్నాను. చరిత్ర ప్రసిద్ధిగాంచిన భారత జాతి ఈ అపజయ అవమానాన్ని సహించి వూరుకొంటుందని అనుకొనుట పొరపాటు. భారత ప్రధాని నెహ్రూ భారత జాతి ఐక్యతతో దురాక్రమణను ఎదుర్కొనండి

*1. ఫార్వార్డ్ టుది డిఫెన్స్ ఆఫ్ మదర్‌లాండ్ అండర్‌ది బానర్ ఆఫ్ జవహర్‌లాల్ నెహ్రూ (1962) సి.పి.ఐ.పబ్లికేషన్ ఆంగ్లంలో). రాజ్యసభలో కమ్యూనిస్టుల ఉపన్యాసాలు. పేజి 1-12.*

అని యిచ్చిన పిలుపు జాతి మొత్తంతో పాటు పార్టీ ప్రతి స్పందించుచున్నది. అంతే గాక చైనా భారతదేశ పరిస్థితిని నెహ్రూ సిద్ధాంతాల విమర్శన, అంచెనా విశ్లేషణలను భూపేష్ గుప్తా అవాస్తవమైనదనీ తీవ్రంగా విమర్శించారు.

మా పార్టీ జాతీయ ప్రజా ఐక్యతను, రక్షణను ప్రజలనైతిక బలాన్ని పెంపొందించే అన్ని చర్యలను పూర్తిగ బలపరచు కార్యక్రమాన్ని చేబట్టి పాల్గొంటుందని ప్రతిజ్ఞ చేస్తున్నది. అట్టి కార్యక్రమాలలో ఇతర ప్రజాసామాన్యంతో కలసి పనిచేస్తున్నది.

దేశంలో వివిధ ప్రాంతాలలో అనేక మంది కమ్యూనిస్టులు అరెస్టు చేయబడ్డారు. మేము మా పార్టీని ప్రధాని పిలుపుననుసరించి సమీకరించునపుడు జాతీయ ఐక్యతను రక్షణను పటిష్టం చేయుట పెంపొందించినపుడు ప్రభుత్వం చేస్తున్న కమ్యూనిస్టుల అరెస్టులు మమ్మొంతో విచారంలో పడవేస్తున్నవి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చేయు యీ అరెస్టులు జాతీయ ఐక్యతకు తోడ్పడవు కాన వెంటనే విడుదల చేయాలని కోరుతున్నానన్నారు బూపేష్ గుప్త. " మాపార్టీ విదానాన్ని జాతీయ సమితి రూపొందించుతుంది. శిక్షణగల మా పార్టీ సభ్యులు తమ శక్తినంతా వినియోగించి అమలు చేస్తారు." అట్టి విశ్వాసం పార్టీకి వుంది.

ముగింపుగా సంక్షోభంలో అన్ని విధాల మా యొక్క మద్దతును, మనస్వాతంత్ర్యం, దేశరక్షణ ప్రమాద స్థితిలో వున్నపుడు ఎంత మందిని అరెస్టుగావించినా ఇతర దేశ భక్తులతో పాటు మాతృదేశ రక్షణకు అన్ని త్యాగాలకు సిద్ధం కావాలని దేశ గౌరవానికి, సమగ్రతకు కమ్యునిస్టులు తమకర్తవ్యాన్ని నిర్వహించుతారని పార్లమెంటు సభ్యులకు తద్వారా దేశప్రజలకు భూపేష్‌గుప్తా వాగ్దానము చేశారు. "నేను తీర్మానాన్ని బలపరుస్తున్నానని ఉపన్యాసం ముగించారు".

హిరేన్ ముఖర్జీ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు 8 నవంబరు 1962న రాజ్య సభలో ప్రధాని నెహ్రూ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని బలపరుస్తూ ఎట్టి పరిమితులు, షరతులు లేకుండా బలపరుస్తున్నామని మాట్లాడారు. ప్రధాన మంత్రి నెహ్రూ నేటి ఘటనలను ప్రపంచ చరిత్ర దృక్పధంలో మనముందుంచారని, వాటిని ఆదృష్టితోనే చూడాలన్నారు. యాదృచ్ఛికంగా చరిత్ర గమ్యం మలుపు కారణంగా మనం పొరుగు చైనా దురాక్రమణకు లోనయ్యాం. మన సరిహద్దులనతిక్రమించి మన దేశంపై దండెత్తింది. చైనా ప్రభుత్వాన్ని ఏ మేధావికలతల ప్రేరణ కారణాలను తెలుసుకొనలేక పోతున్నామన్నారు. మన దేశభక్తి, గౌరవం దెబ్బతిన్నవి. ప్రజల భావాలపై అగాధం పడింది. మన ప్రధాని మనకు చెప్పినట్లు చైనా దురాక్రమణను ఏ కారణాలు సమర్ధించజాలవు అన్నారు. ఈ పార్లమెంటులో నెహ్రూ విధానాన్ని బలపరుస్తూ ఎలుగెత్తి ప్రపంచానికి చాటవలసిన అవసరముందనుకొంటున్నాను అని అన్నారు. కమ్యూనిస్టు పార్టీ సభ్యులు అనేక మంది నేటి పరిస్థితుల ప్రభావంతో అరెస్టు చేయబడుటకు విచారం వ్యక్తం చేశారు. కలత చెందినా విచారిస్తున్నా, ప్రభుత్వ వుద్దేశ్యమేమిటని ప్రశ్నించారు. పార్టీ చెప్పే మాటలలో విశ్వాసం లేని వారికి చరిత్రే సమాధానం చెప్పుతుంది. ప్రవర్తన ఆచరణ సమాధానమవుతుంది. జాతీయ సమితి తీర్మానం అందరికి అందుబాటులో వుంది.

బహిరంగంగా చర్చించబడింది, ప్రచురించబడింది. జరిగిన సుదీర్ఘ చర్చలు ప్రభుత్వానికి రుచించకపోవచ్చు. చర్చల అనంతర నిర్ణయాలలో మాకు విశ్వాసముందన్నారు. ఇతరులు యేమనుకొన్నా తమ పార్టీ క్రమశిక్షణ కలదన్నారు. పార్టీని విడిచిపోవాలను కొంటే తప్ప, నిర్ణయాలకు కట్టుబడి వుంటారు. తీర్మానానికి ప్రతిఒక్కరు మనో,వాక్కాయ, కర్మలా కట్టుబడివుంటారు.

ప్రధానమంత్రి ఐక్యతా పిలుపుకు స్పందించి ప్రజా సమీకరణకు పూనుకొంటున్నాము. అయినా మాకు వ్యతిరేకంగా కొన్ని చర్యలు గైకొనబడుట చూస్తున్నామన్నారు. అస్పష్టంగా కమ్యూనిస్టులు యేమీచెప్పరు. చెప్పదలచుకొన్నది నేరుగా స్పష్టంగా చెప్పుతామన్నారు. అయినా ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలు అవాంఛనీయాలు, అందుకే విచారాన్ని తెలియచేస్తున్నానన్నారు. ఉద్రేకాలు, సమతూకాన్ని గౌరవాన్ని, ప్రవర్తనా ఔన్నత్యాన్ని కాపాడుకొంటూ నిశ్చయాన్ని ఐక్యతను ప్రపంచానికి ప్రకటించామన్నారు హిరన్ ముఖర్జీ. పార్టీ వైఖరిని స్పష్టంగా వివరించారు.

## అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెస్ వైఖరి నవంబరు తీర్మానం

చైనా నీఫా, లడక్‌లలో జరిపిన దురాక్రమణ ఫలితంగా మాతృదేశ సంక్షోభ పరిస్థితులలో అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెస్ సమితి కార్మిక వర్గంలోని అన్ని తరగతులు ఐక్యతతో మాతృభూమి సమైక్యతను దురాక్రమణను త్రిప్పికొట్టుటకు, రక్షణకు అత్యున్నత త్యాగాలకై పిలుపునిచ్చింది. ప్రాణత్యాగం చేసిన జవానులకు అధికారులకు నివాళులర్పించింది.

దేశంలోని వివిధ ప్రాంతాలలోని శాఖలకు, కార్మికులకు దురాక్రమణకు వ్యతిరేకంగా దేశభక్తి ప్రదర్శనలకు నిధుల సేకరణకు చూపిన చొరవను హర్షించింది. "ఎ.ఐ.టి.యు.సి." దేశరక్షణకు దేశ సమగ్రతకు పూర్తి మద్దతునిస్తూ, ప్రధాని నెహ్రూ సంప్రదింపులు ప్రారంభించాలనే, సరిహద్దు వివాదాన్ని సంప్రదింపుల ద్వారా చైనాతో పరిష్కరించుకొనుటను పూర్తిగ బలపరుస్తున్నది. అట్టి సంభాషణలకు చైనా సైన్యాలు 8 సెప్టెంబరు 1962 నాటి స్థానాలకు వుపసంహరించుకొనుట దోహదపడుతుందని తీర్మానం స్పష్టం చేసింది.

జవానులు తుపాకులతో పోరాడుతుంటే జాతీయ పరిశ్రమలు, కార్మిక వర్గం వుత్పత్తిని అన్ని విధాల పెంచుతూ వారి వెనుక నిలబడాలని పిలుపునిచ్చింది. కార్మిక సంఘాల నాయకులను కార్యకర్తలను అరెస్టులు కావించుటకు తన ప్రగాఢ అసంతృప్తి తెలియజేస్తూ, సమితి నిర్ణయాలను అమలు చేయుటకు విడుదల చేసి, వారికి అవకాశం కలుగజేయాలని కోరింది.

జాతీయ సంక్షోభంలో పారిశ్రామిక రాజీ విధానం అనుసరించాలని కార్మికులను కోరుతు, ధరల పెరుగుదలను అరికట్టాలని ప్రభుత్వాన్ని కోరుతు తీర్మానించింది. పారిశ్రామిక విధానం కార్మిక వర్గానికి సంబంధించిన త్రైపాక్షిక సంస్థల నిర్మాణ విషయాలపై వివిధ సవరణలను చిత్తుకు సమర్పించింది. మద్ధతును ప్రకటించింది.

## బూర్జువా వర్గ ప్రభుత్వ సమాచారంపై కమ్యూనిస్టులు ఆధారపడినందున జాతీయతత్వంకు లోనయ్యారు

భారత-టిబెట్-చైనా సరిహద్దుల సమస్యలపై కమ్యూనిస్టు పార్టీ సమగ్ర అధ్యయనం, అవసరమైన పురాతన చారిత్రిక పత్రాల పరిశీలన స్వతంత్రంగా చేబట్టకుండా బూర్జువా వర్గ ప్రభుత్వ సమాచారంపై ఆధారపడినందున పార్టీలోని కొన్ని వర్గాలు జాతీయ తత్వంగాలిలో కొట్టుకు పోవటం జరిగింది. ఇండియా-చైనా సరిహద్దు సమస్యపై అందుబాటులోని అధికార పత్రాలను, మ్యాపులను పరిశీలించిన కొన్ని ప్రాంతాలలో సరిహద్దు నిర్వచించబడలేదని స్పష్టంగానే తెలిసేది. మిగతా ప్రాంతాలలో సందేహాలకు తావుండేది.

డా॥కరుణాకర్ గుప్తా లండన్‌లోని ఇండియా ఆఫీసు, విదేశాంగ శాఖల పురాతన అధికార పత్రాలను పరిశీలించి సత్యాన్వేషణ గావించి మనకు, ప్రపంచ ప్రజలకు వాస్తవాలు తెలియజేశారు. సామ్రాజ్యవాదం బ్రిటిష్ ఇండియా ప్రభుత్వపు విదేశాంగశాఖ 1935లో నీఫా సరిహద్దును హిమాలయ పర్వతశ్రేణి పాదరేఖ వరకు విస్తరించనెంచాయి. అయితే 1929లో "ఏట్చిన్స్‌ట్రీటీస్" వాల్యూం 14లోని వాస్తవాలు అడ్డుగా వున్నవి. డిప్యూటి సెక్రటరీ ఒలాఫ్‌కెరో ఆ వాల్యూంని నాశనం చేయించి దాని స్థానంలో నూతనంగా సరిహద్దుల విషయంలో తమ అవసరాలకు అనుగుణమైన మార్పులు, చేర్పులతో 1938లో 1929లో అచ్చయినట్లు "పోర్జరీ వాల్యూంను అచ్చువేయించారు. దీనిని గుప్తా పరిశోధనలో రుజువు చేశారు. ఇది మెక్ మాహన్ రేఖకు చట్ట బద్ధతను కల్పించుటకు అల్లిన సాలెగూడు. పశ్చిమోత్తర సరిహద్దులు లడక్ ప్రాంతంలో కూడా సరిహద్దులు నిర్వచించబడలేదని, భారత విదేశాంగ మంత్రిత్వ శాఖలోని చారిత్ర విభాగం తప్పుడు సమాచారం నెహ్రూకు అందించి శాంతి, సహకార, రాజీ సంప్రదింపుల విధానాన్ని భగ్నం చేసిందని గుప్తా నిరూపించారు. ఈ రచనలోనే మరో చోట యీ వివరాలన్నీ యివ్వబడినవి. ఈ విధంగా చేయుటయేగాక, యీ పత్రాలన్ని "అతి రహస్యంగా" దాచివేయబడినవి. భారత్ చైనా సరిహద్దుల సమస్య, యుద్ధంగా పరిణమించుటకు అసలు కారణమిది.

కమ్యూనిస్టు పార్టి శాస్త్రీయ గతి తార్కిక భౌతిక వాద విధానంలో పరిశీలించి సత్యాన్వేషణ చేసి, నిర్ణయాలను చేయుటకు బదులు, సామ్రాజ్యవాదం నుండి బూర్జువా వర్గానికి లభించిన వారసత్వ ఆధారాలతో పరిమితులు లేని సహాయాన్ని మద్దతును యిచ్చుటతో మిత వాద సంస్కరణ వాదపు ఊబిలో దిగిపోయిందని చెప్పక తప్పదు. శాంతి, సంప్రదింపులు, రాజీ మార్గాలలో సరిహద్దు సమస్యను పరిష్కరించుకొనాలనే విధానాన్నే ప్రధానంగా చేబట్టవలసినది. గుప్తా పరిశోధనలలో, ఎట్టి సందేహం లేకుండా వాస్తవాలు 1982లో స్పష్టమైన తరువాత, ఆత్మ విమర్శనను కమ్యూనిస్టు పార్టీ చేసుకొన్న దాఖలా ఈ రచయిత పరిధిలోనికి రాలేదు.

## కమ్యూనిస్టుల అరెస్టులు, ప్రభుత్వ విధానపు ఖండన

పార్లమెంటులో 8 నవంబరు 1962న అత్యవసర పరిస్థితి తీర్మానాన్ని నెహ్రూ

ప్రతిపాదించారు. ఆ తీర్మానాన్ని పార్లమెంటు సభ్యులందరూ ఏకగ్రీవంగా నిలబడి ప్రతిజ్ఞచేస్తూ 14వ తేదీన ఆమోదించారు. దేశ రక్షణకై ప్రజలంతా ఐక్యతతో నిలబడాలని నెహ్రూ యిచ్చిన పిలుపుకు స్పందించిన కమ్యూనిస్టు పార్టి జాతీయ సమితి మద్దతునిస్తూ తీర్మానించింది. పార్లమెంటులో కమ్యూనిస్టు పార్టీ మద్దతును ప్రకటించారు. నెహ్రూ కూడా చైనా దురాక్రమణ వ్యతిరేక పోరాటం మాత్రమే కాని, కమ్యూనిస్టు వ్యతిరేక, చైనా ప్రభుత్వ వ్యతిరేక పోరాటం కాదని స్పష్టంగా పార్లమెంటులో చెప్పారు.

అయినా 20 నవంబరు 1962న కేంద్ర దేశీయాంగ శాఖనుండి అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు వందల కొలది కమ్యూనిస్టు నాయకులను, సభ్యులను అరెస్టులు చేయమని ఆజ్ఞలు జారీచేయబడ్డాయి. సంక్షోభంలో పడిన కమ్యూనిస్టు పార్టీలోని అతివాద వర్గాలను వేరుచేసి అరెస్టు చేసి పార్టీని నిర్వీర్యం చేయాలని ప్రభుత్వ పదకము. విచక్షణా రహితంగా అందరిని అరెస్టు చేసి నిర్బందంలో వుంచారు. దేశీయాంగ శాఖలోని గందరగోళంతో రహస్య పోలీసు శాఖ తయారు చేసి వుంచిన కమ్యూనిస్టుల జాబితాను రాష్ట్రప్రభుత్వాలకు అరెస్టుల నిమిత్తం పంపించగా, రాష్ట్ర అధికారులు అరెస్టులు చేసి జైళ్ళలోనే నిర్బందించారు. తమ కుటిల రాజనీతి బహిర్గతం అవుతుందని రాజకీయ పొరపాటును గ్రహించిన ప్రభుత్వం వెంటనే కొందరిని విడుదల చేయుటతో తమపొరపాటు అందరికి వెల్లడవుతుందని ఒక్కొక్కరినే విడుదలచేయ మొదలుపెట్టారు. ప్రతిపక్ష సభ్యులు కొందరు కాంగ్రెసు వాదులు ప్రెసిడెంటు రాధాకృష్ణన్‌ను కలుసుకొని పార్లమెంటును రద్దుచేసి అధ్యక్షపాలనను ఏర్పరచి నెహ్రూను ప్రధాన సలహాదారుగ కొనసాగించాలని కోరారు. ఇది వొక చిన్న కుట్ర తప్ప మరొకటి గాదు. రాజ్యాంగంలో అట్టి అవకాశం లేదని త్రోసిబుచ్చబడింది.

అత్యవసర పరిస్థితి ప్రకటించి, భారత రక్షణ చట్టం చేసిన వెంటనే కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి 50మంది సభ్యులను, 10 మంది కమ్యూనిస్టు పార్లమెంటు సభ్యులను 40 మంది వివిధ రాష్ట్రాలలోని కమ్యూనిస్టు అసెంబ్లీ సభ్యులను, కార్మిక, కర్షక, విద్యార్థి నాయకులనేక మందిని మొత్తం 800 మందిని అరెస్టు చేసి డిటెయిన్ చేసి, విచారణ లేకుండా జైళ్లలో నిర్బందించారు. ఈ ప్రత్యేకాధికారాలను కార్మికులను, వుద్యోగులను నిర్బందాలకు గురి చేయుటకు వినియోగించారు. ప్రజోద్యమాల సాధారణ కార్యక్రమాలు స్థంబించిపోయాయి. రక్షణ కార్యాలకు పూర్తి సహకారాన్నిస్తున్నా ప్రభుత్వం నిర్బందచర్యలకు వొడికట్టింది. అత్యవసర పరిస్థితి భారత రక్షణ చట్టాలను కమ్యూనిస్టు పారీ దైనిందిన కార్యక్రమాలు కుంటుపడునట్టు చేయుటకు వినియోగించారు.

కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి ఫిబ్రవరి 1963లో భారత రక్షణ చట్టాన్ని అత్యవసర పరిస్థితి అధికారాలను ప్రజాస్వామ్య వుద్యమాలకు వ్యతిరేకంగా వుపయోగించుటకు తన అసమ్మతిని తెలియచేసింది. ఎట్టి విచక్షణ లేకుండా అరెస్టు చేసిన కమ్యూనిస్టులను కార్మిక, కర్షక సంఘాల కార్యకర్తలను విడుదల చేయాలని కోరింది. ప్రజాస్వామ్య సంస్థల సంఘాలపై వాటి రోజువారి కార్యక్రమాలపై అత్యవసర పరిస్థితులలో సంక్రమించిన

అధికారాలను వుపయోగించుట ఆపివేయాలని కోరింది. వారందరూ దేశ రక్షణ చర్యలను బలపరుస్తున్నారు. రక్షణనిధి సేకరణకు తోడ్పడుతున్నారు. అదే కాలంలో యీ అధికారాలు మార్కెట్లో ధరల వూహాగానాలు 'ఫార్వర్డ్ డెలివరి' వ్యాపారాలను, అధిక ధరల పెరుగుదలను అరికట్టుటలో తోడ్పడిందని తీర్మానం గుర్తించింది. నవంబరు 18, 1962లో ఎ.ఐ.టి.యు.సి. జనరల్ కౌన్సిల్ సమావేశమై వివిధ రాష్ట్రాలలో కార్మిక సంఘాల నాయకులను, కార్యకర్తలను అరెస్టు చేయుటకు తన విచారాన్ని తెలిపింది. పోలీసు రిపోర్టులను అనుసరించి వారి రాజకీయ అభిప్రాయాలుగ చెప్పుతూ అరెస్టు చేయుట చట్ట వ్యతిరేకమని దేశ రక్షణకు, ఐక్యతకు తోడ్పడదని కౌన్సిల్ వారినందరిని విడుదల చేయాలని కోరింది. వారు. ఎ.ఐ.టి.యు.సి. కార్యక్రమాలను, విధానాలను అమలు చేయుటకు అవకాశం కలుగజేయాలని కోరింది.

కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి తిరిగి జూలై 1963లో ప్రభుత్వం కమ్యూనిస్టు ఖైదీలను అనేక మాసాల తరువాత విడుదల చేయకుండుటను ఖండించుతు, తన అసమ్మతిని తీర్మానంలో వ్యక్తంచేసింది. అరెస్టు ఏ విధంగాను న్యాయసమ్మతమని ప్రభుత్వం సమర్ధించజాలదు. ప్రభుత్వం, ఈ ఖైదీలు ఎవ్వరు దేశ రక్షణ చర్యలకు వ్యతిరేకం చేస్తూన్నారని రుజువు చేయజాలకపోయింది. ప్రఖ్యాత మాజీ అటార్నీ జనరల్ శ్రీ శెతల్వాడి, శ్రీ విశ్వనాధ శాస్త్రి తదితరులు భారత రక్షణ చట్టం, రాజ్యాంగ చట్టం గ్యారంటీ చేసిన కొన్ని ప్రాధమిక హక్కులకు వ్యతిరేకంగా వున్నందున ముఖ్యంగా డిటెన్షన్ "ఆల్ట్రావైరస్" గా వుందనే అభిప్రాయాన్ని తెలిపారు. వారిని డిటెన్యూలుగా కొనసాగించుట కమ్యూనిస్టుల ప్రశ్న మాత్రమే కాదని రాజ్యాంగ చట్ట వ్యతిరేకం కాన జైళ్ళలోని రాజకీయ ఖైదీలనందరిని విడుదల చేసి అత్యవసర పరిస్థితిని దేశ రక్షణ చట్టాల పేరుతో హరించిన ప్రాథమిక హక్కులను పునరుద్ధరించాలని కోరింది. ఈ విషయంలో రాజకీయాలు, పార్టీలతో నిమిత్తం లేకుండా, అన్యాయ చట్టాల రద్దుకు అందరూ ఐక్యం కావాలని కోరింది. అన్ని పార్టీల శాఖలు, సభ్యులు, సానుభూతి పరులు ప్రజలను సమీకరించి విడుదలకై వుద్యమాన్ని కొనసాగించాలని కోరింది. మరో తీర్మానంలో 75 సంవత్సరాల వృద్ధ కమ్యూనిస్టు నాయకుడు ముజఫర్ అహమ్మద్ జైల్లో అనారోగ్యంతో బాధపడినట్లు పార్లమెంటు సభ్యులకు, ప్రజలకు ఆందోళన కలిగించుచున్నది. అనేకమంది పార్లమెంటు సభ్యులు దేశీయాంగ శాఖ మంత్రికి లేఖలు వ్రాశారు. కేంద్ర కార్యవర్గం, ప్రభుత్వం ఆర్డర్లు జారీ చేసి విడుదల చేయాలని కోరుతూ తీర్మానించింది.

అదే విధంగా 17 జనవరి 1964న పార్టీ కేంద్ర కార్యవర్గం త్రిపుర అస్సాం,పశ్చిమ బెంగాల్, మహారాష్ట్ర, యు.పి.రాష్ట్రాల కమ్యూనిస్టు నాయకులు సంవత్సరం పైగా డిటెన్యూలగా జైళ్ళలో మ్రగ్గుతున్నారని, వారిని వెంటనే విడుదల చేయలనికోరింది. రాష్ట్ర ప్రభుత్వాలు రాజకీయ ప్రయోజనాలు, ప్రతీకార దృష్టితో విడుదల చేయనట్లు కనుపించుచున్నదని కేంద్ర కార్యవర్గం డిటెన్యూలనందరినీ వెంటనే విడుదలచేయాలని కోరుతూ తీర్మానించింది.

## వివాదంలో ముఖ్యాంశాలు

భారత-చైనా సరిహద్దు వివాదంలో సోవియట్ యూనియన్ తటస్థ విధానాన్ని అనుసరించింది. భారత దేశం "ముందడుగు విధానం" అవలంభించుట, సంప్రదింపులకు మార్గాలు క్రమేణా మూయబడుటతో ఇరుపక్షాలు ఘర్షణ మార్గంలో పయనించాయి. అట్లు గాక మాస్కో సహృద్భావంతో నెహ్రూ సంప్రదింపులతో వివాదాన్ని పరిష్కరించు కొనుటకుప్రోత్సాహాన్ని వొత్తిడిని చేసినచో చరిత్ర మరో మార్గం పట్టేది. భారత దేశం "ముందడుగు విధానం" అమలు చేయుటకు సోవియట్ సహాయంతో లభించిన విమానాలు, హెలికాప్టర్లు తోడ్పడినవి. అదే ఘోరపరాజయానికి దారి తీసింది. సోవియట్ ఈవైఖరికి భారత్-చైనా సరిహద్దు వివాదానికి నమానాంతరంగా వున్న సోవియట్ యూనియన్-చైనా సరిహద్దు వివాదం ఎంత వరకు పరోక్ష అంశమైంది, స్పష్టంగా తెలియకుంది.

సోవియట్‌యూనియన్-చైనా సరిహద్దు వివాదాల చరిత్ర వారసత్వంగా వున్నవి. భారతదేశం బ్రిటీష్ సామ్రాజ్య వాదపు అధీనంలో వున్నపుడు, సరిహద్దు వివాదం చైనాతో ఏర్పడిన విధంగానే, సోవియట్, రష్యా జారు చక్రవర్తి నిరంకుశత్వంలో వున్న నాటినుండి చైనాతో సరిహద్దు వివాదాలను వారసత్వంగా పొందింది. చైనా బలహీనంగా వున్నందున జారు చక్రవర్తులు చైనా ఈశాన్య, నైరుతి భాగాలలో విస్తార ప్రాంతాలను ఆక్రమించి ఐగున్ (1858) పెకింగ్ (1860) వొప్పందాల ద్వారా చట్టబద్ధంచేసుకున్నారు. అయితే 1911లో చైనా జాతీయ వాదులు "ఆ అసమాన వొడంబడిలను" రద్దు చేయాలని, తమ భూభాగాలను తిరిగి తమకు సంక్రమింపజేయాలని కోరుతూనే వున్నారు. చౌయెన్‌లై 1959లోనే కృచ్ఛేవ్‌తో ఈ సమస్యను లేవనెత్త ప్రయత్నించాడు. కాని బుకారెస్టులో కృచ్ఛేవ్. ఇరాన్‌తో సరిహద్దు సమస్య మాత్రమే పేర్కొని చైనా విషయం లేవనెత్తలేదు.

అక్టోబరు విప్లవానంతరం సోవియట్ యూనియన్ కారకాన్ మానిఫెస్టో 1920లో ప్రకటించుతూ జారిస్టు రష్యా చైనాతో చేసుకొన్న "అసమాన వొడంబడికలన్నీ" రద్దు చేసుకొంటుందని ప్రకటించింది. కాని ఆచరణలో ఆ విధంగా జరుగలేదు. వ్లాడి వోస్టక్ చాల దూరంగా వుంది. ఆ నగరం రష్యనులదే అన్న వైఖరిని చేపట్టారు. ఆ మీదట అసమాన వొడంబడికలు అయినా కాకపోయినా సోవియట్-చైనా సరిహద్దులు యదాతథంగా వుండాలనే వైఖరిని అవలంబించారు. కారకాన్ మానిఫెస్టో మౌలిక కార్యక్రమం భవిష్యత్ సంభాషణలలో అది మార్గ దర్శికంగా వుండాలని వెంటనే వివాదాంశాలను రూపొందించాల్సిన అవసరం లేదన్నారు.[1]

వంద సంవత్సరాల తరువాత 1960లో సరిహద్దులను పరిష్కరించుకొనుటకు సంప్రదింపుల ప్రతిపాదనలను చైనా సోవియట్ యూనియన్‌కు చేసింది. చౌయెన్‌లై ఈ సమస్యపై ప్రశ్నించినపుడు "మ్యాపులలో చిన్న పొరపాట్లు వున్నవని, అవి

1. నెవెల్లి మాక్స్‌వెల్ (1971). "ఇండియా - చైనా వార్" - పేజీ 281-282.

పరిష్కరించుకొనవలసిన చిన్న విషయాలని"[1] అన్నారు. సోవియట్ రష్యా, చైనాల మధ్య 1961-62లో సంప్రదింపులు ప్రారంభమైనపుడు సోవియట్ యూనియన్ భారత దేశం అవలంభించిన వైఖరినే అవలంభించింది. సరిహద్దు వివరాల సంభాషణలోనికి దిగుటకు నిరాకరించింది. నిర్ణీత ప్రాంతంలో సరిహద్దు స్పష్టీకరణకై మాత్రమే సంభాషణలు, మరే విషయం చర్చించమన్నారు. అంటే "వారు అంగీకరించిన విషయాన్ని మాత్రమే సంప్రదించుటకు అంగీకరించారు". భారతీయులతో మెక్‌మాహన్ లైన్‌ను ఆమోదించామని చైనీయులు ఎప్పుడూ చెప్పకపోయినా, మాస్కోతో "అసమాన ఒడంబికలను" గుర్తించుతున్నామన్నారు. కారణం అసమాన ఒడంబడికను చైనా చట్టబద్ధంగా సరిహద్దు నిర్ధారణచేయబడినది. భారత-చైనాల మధ్య చట్టబద్ధ సరిహద్దు ఒడంబడిక లేదు. టిబెట్టుతో అట్టి ఒడంబడిక వున్నా, సార్వభౌమాధికారం గల కేంద్ర చైనా ప్రభుత్వం ఆ ఒడంబడికపై సంతకం చేసి భాగస్వామిగా లేదు. కాన ఒప్పందం ప్రాతిపదిక లేదు. చౌయెన్‌లై మెక్ మాహన్ సరిహద్దు రేఖగా చెప్పబడేది "బ్రిటీష్ సామ్రాజ్యవాద దురాక్రమణ ఫలితం. చైనాలోని టిబెట్‌పై దురాక్రమణ ఫలితము. ఎప్పుడూ ఏ కేంద్ర చైనా ప్రభుత్వమూ దానిని గుర్తించలేదు, కాన స్పష్టంగా చట్ట వ్యతిరేకమని" 8 సెప్టెంబరు 1959లో నెహ్రూకు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. ఆ లేఖ ప్రతిని కృశ్చేవ్‌కు పంపించారు. కృశ్చేవ్ అతని సలహాదారులు చైనా విషయంగా అసమాన ఒప్పందాలు అయినందున భారతీయుల వలెనే వారు మెక్‌మాహన్ రేఖ చట్ట బద్ధతను చైనా ప్రశ్నించుట, దానికి దక్షిణ ప్రాంతాలను తమవిగా వాధించు ప్రయత్నంగా కన్పించింది. అట్టి విషయాలలో చైనాను బలపరచుట అంటే చైనా జారు చక్రవర్తులకు కోల్పోయిన ప్రాంతాల సమస్యలు లేవనెత్తుగా మొదట భారతదేశంలో తవాంగ్, తరువాత వ్లాడివోస్టక్‌లుగ వారికి కన్పించుటతో అసంగతమేమి లేదు. అదే విధంగా 1960 దశకంలో సోవియట్ యూనియన్ సరిహద్దు వివాదంలో భారత-సోవియట్ వైఖరుల సారూప్యత, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సిద్ధాంత సమస్యలపై సోవియట్-చైనా వివాదంలో మరో అంశంగా మిళితమైంది. కృశ్చేవ్ సంస్కరణ వాదాన్ని చైనా ఖండించుటతో భారత దేశానికి సోవియట్ సహాయం ప్రధానాంశమైంది.

చైనా విశ్లేషణ ప్రకారం టిబెట్‌లో తిరుగుబాటుతో నెహ్రూ మితవాదం వైపు పయనించుట, జాతీయ బూర్జువా వర్గ ప్రభుత్వం ఒక నూతన దశకు చేరుట జరిగింది. భారత ప్రజానీకం దైనందిన సమస్యలపై బూర్జువా నెహ్రూ ప్రభుత్వ వ్యతిరేకంగా పోరాటాలు ప్రారంభించారు. దీనిని వాయిదా వేయుటకు చైనాతో సరిహద్దు వివాదం సృష్టించబడింది. ఈ పరిస్థితులలో నిజమైన కమ్యూనిస్టులు భారత ప్రభుత్వాన్ని వ్యతిరేకించి, అణచబడే వర్గాలు జరిపే పోరాటాన్ని బలపరచాలి. అయితే కృశ్చేవ్ వర్గ దృక్పదాన్ని వదలి చైనాకు వ్యతిరేకంగా భారత బూర్జువా వర్గాన్ని బలపరచాడు. ఇది కృశ్చేవ్, పరిస్థితుల విశ్లేషణ వక్రంగాను, భ్రమలకులోనై వుందని స్పష్టంగా తెల్పుతుందని చైనావాదన.[2]

1. *నెవెల్లి మాక్స్‌వెల్ (1971). "ఇండియా - చైనా వార్" - పేజీ 283 లోని ఉదహరింపు.*

2. *నెవెల్లి మాక్స్‌వెల్ (1971) ఇండియాస్ చైనా వార్ . పే.285లో 1960లో మాస్కోలో టెంగ్ హిసాపెంగ్ ప్రసంగం నుండి ఉదహరింపు*

సోవియట్ యూనియన్ చైనా అవగాహనను త్రోసి బుచ్చి భారతదేశానికి సహాయాన్ని కొనిసాగించుట యీ నేపథ్యంలోనే అర్థం చేసుకొనాలి. కొద్ది సహాయమే అయినా పేర్కొన దగిన రీతిలో 1963కి 5బిలియనుల రూపాయలకు చేరింది. సోవియట్ 1960లో చైనాను రెచ్చగొట్టే రీతిలో భారత దేశానికి సైనిక సహాయ కార్యక్రమాన్ని నామమాత్రంగా ప్రారంభించి క్రమేణా బహుముఖంగా విస్తృతంగా పెంచింది. భారత రక్షణ మంత్రిత్వ శాఖ ప్రతినిధి వర్గం మాస్కో వెళ్ళి భారీ రవాణా అంటెనోవా 12 హవుండ్ విమానాలు, హెలికాప్టర్లు, రెండు టర్బైన్స్ యింజనులతో 17వేల అడుగుల ఎత్తున ఎగురగల వాటిని కొన్నది. ఈ భారీ విమానాలు కాశ్మీర్‌లోని లే ప్రాంతాలకు సైనికులను, ఆయుధ సామాగ్రిని సప్లయిలను చేరవేస్తున్నవి. భారత ప్రభుత్వ "ముందడుగు విధానం" అమలుకు అత్యంత సానుకూలమైనవి. లడక్‌లో మొదట రష్యన్ పైలెట్లే నడుపుతూ భారతీయులకు శిక్షణనిచ్చారు. భారత దేశ పార్లమెంటులో యిది వివాదాస్పదమైంది, వారు భారత సైనికుల సన్నాహాలను చైనీయులకు తెలిజయేస్తారని భయపడ్డారు.

మిగ్ జెట్ ఫైటర్ విమానాల కొనుగోలుకు భారతదేశం 1960లో రష్యాతో చాల కాలం సంభాషణ జరిపింది. బ్రిటీష్ అమెరికన్ ప్రభుత్వాలు తీవ్రంగా ప్రతిఘటించుటతో కాలహరణం జరిగింది. చివరకు 1962 వేసవిలో మిగ్‌లు చేరుట జరిగింది. పెకింగ్ దృష్టిలో నెహ్రూ ప్రభుత్వానికి నైతిక సహాయాన్నిచ్చే సైద్ధాంతిక పొరపాటు మాత్రమే గాక చైనాకు వ్యతిరేకంగా భారత సరిహద్దు ప్రాంతాలకు సైనిక ఆయుధ సామాగ్రిని సరఫరా చేయుట విద్రోహమగుతుంది. "భారత అభివృద్ధి నిరోధకులు సోషలిస్టు చైనా పై దాడి చేయుటకు కృచ్ఛేవ్ అమెరికా వారితో కలసి సాయుధ రెచ్చగొట్టు చర్యలు జరుపుటకు అన్నివిధాలా సహాయపడ్డారు అన్నది చైనా.

నెహ్రూ ప్రసంగంలో విదేశాల నుండి సైనిక సహాయం పొందుట అంటే అలీన విధానాన్ని వదిలివేయుట అగుతుందని పార్లమెంటులో అనేక సార్లు ప్రకటించారు. అక్టోబరు 20-21 అర్థరాత్రి జరిగిన చైనా విస్తృత దండయాత్రతో వెంటనే అమెరికా ఆయుధ సహాయాన్ని వైమానిక సహాయంతో పాటు సోవియట్ తదితర సోషలిస్టు దేశాలను సైనిక ఆయుధ సహాయాన్ని నెహ్రూ అర్థరాత్రి అర్థించాడు. అమెరికన్ జెట్ బారీ రవాణా విమానాలు, సైనిక ఆయుధాలు తదితర సామాగ్రిని ఆటోమాటిక్ రైఫిల్స్, బారీ ఫిరంగులను వెనుకకు తన్నుడులేని ఫిరంగులు. రోజుకు 8 సార్లు తిరుగుతూ సప్లయిలు అందిస్తున్నది. ఈ విషయంలో కెన్నడి ఆయుధ సహాయాన్ని నెహ్రూ ఆమోదించిన వెంటనే బ్రిటీష్ సప్లయిలు అందుట మొదలైంది. అయితే అమెరికా కాకే విస్తృత ఆయుధ సప్లయిలను ఇండియాకు చేయాలనే బలమైన కోరిక వుంది. దశాబ్దాల నుండి ఆయుధాల అవసరాలను తక్కువగా అంచెనా వేసిన భారతదేశానికి వాటి సప్లయి అత్యంత వేగంగా జరుగ వలసి వుంది. ఇండియా కోరిక కూడా అదే. సులభ షరతులపై తక్కువ ధరలకు సప్లయిలను కోరింది. బ్రిటీష్ ప్రభుత్వం సరఫరాలను ఉచితంగానే చేసింది. అమెరికా ధరల విషయమై తరువాత సంప్రదించవచ్చని సప్లయిలు అందజేసింది. ఫ్రాన్స్ మామూలు వ్యాపార పరంగానే

ఆయుధాలను అమ్మింది. ఆ సంక్షోభ పరిస్థితులలో ఇజ్రేయిల్‌ను కూడా ఆయుధ సప్లయిలకు సంప్రదించింది. అమెరికన్, బ్రిటీష్ సామ్రాజ్య వాదులు యీ అవకాశాన్ని తీసుకొని, కాశ్మీర్ విషయామై పాకిస్తాన్‌తో సంభాషణలు జరిపి, రాజీ ప్రయత్నాలు చేసుకోవాలని వొత్తిడి ప్రారంభించారు.

**సరిహద్దు వివాదంపై భారత కమ్యూనిస్టు పార్టీ వైఖరిని ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలకు వివరణలేఖ**

భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి నవంబరు 1962లో ఆమోదించిన తీర్మానంలోని అంశాలను యింతకు ముందే తెలుసుకొన్నాము. పార్టీ వైఖరిని, సరిహద్దు వివాద కారణంగా వొక సోషలిస్టు దేశం ఆధునిక పెద్ద సైన్యంతో ప్రపంచ శాంతి, పంచశీల విధానాలను అనుసరించుతున్న భారత దేశంపై దండయాత్ర చేసి, పెద్ద భూభాగాలను ఆక్రమించుట, ప్రధానిన నెహ్రూ ప్రభుత్వానికి కమ్యూనిస్టు పార్టీ నిర్దిష్ట షరతులు లేని మద్దతును ప్రకటించి, దేశరక్షణకై పార్టీ సభ్యులు, సానుభూతిపరులకు, ప్రజలకు పిలుపు నిచ్చుటను వివరించుతు సోదర పార్టీలకు అధ్యక్షులు డాంగె జనరల్ శెక్రటరీ నంబూద్రిపాద్, శెక్రటరీ అహమ్మద్, గోవిందనాయర్, యోగేంద్ర శర్మలు సంయుక్తంగా వొక లేఖ వ్రాశారు.

చైనా పెద్ద భూభాగాలనూ ఆక్రమించుటతో రక్షణ ప్రయత్నాలకు మద్దతునిచ్చుట చాలదని, జాతీయ శక్తులతో పాటు అంతర్జాతీయ పురోగామి శక్తులను భారత ప్రభుత్వానికి, ప్రధాని నెహ్రూకు అండగా ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని సమీకరించుటకై లేఖ వ్రాయుటయే గాక పార్టీ ప్రతినిధి వర్గాన్ని బ్రిటన్, యూరఫ్, తూర్పు యూరఫ్, సోవియట్ యూనియన్ సోషలిస్టు దేశాలకు పార్టీ విధానాన్ని వివరించు ధ్యేయంతో పర్యటనకు పంపింది. నెహ్రూప్రభుత్వం చైనాతో సంఘర్షణకు లోనగుతున్నా శాంతి, అలీన విధానాలను సామ్రాజ్యవాద వ్యతిరేకతను కొనసాగిస్తూ, దేశంలోని మితవాద అభివృద్ధి నిరోధక వర్గాలు సామ్రాజ్యవాద సైనిక రక్షణ కూటమిలోనికి భారతదేశాన్ని నెట్టుటకు చేయు ప్రయత్నాలను నిరోధించుట, ప్రణాళికా బద్ద ఆర్థిక విధానాలను సాగించుటతో పాటు, సరిహద్దు సమస్యలు, భారత ప్రభుత్వం అవలంబించిన విధానాలు, వివిధ దశలలో కమ్యూనిస్టు పార్టీ వైఖరిని వివరించింది.

భారత కమ్యూనిస్టు పార్టీ జనరల్ శెక్రటరీ అజయ్ ఘోష్ ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల 1960 సమావేశంలోనే, చైనా కమ్యూనిస్టు పార్టీ, ప్రభుత్వం సరిహద్దు వివాదంపై అనుసరించిన విధానాలను సూత్రబద్ధంగా, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ 1957 ప్రకటన విధానాలకు వ్యతిరేకంగా వుండుటను తీవ్రంగా విమర్శించుటను లేఖ గుర్తు చేసింది. అదే విధంగా తదనంతర పరిణామాలను వివరించి, చైనా ప్రభుత్వం, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం అనుసరించిన విధానం ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమానికి పురోగామి శక్తులకు ఎంతటి అపకాశాన్ని కలుగజేస్తున్నదో వివరించి, ప్రపంచ యుద్ధానికి దారితీసే ప్రమాదమున్నదని తెలియ జేసింది. భారత దేశంలోని అభివృద్ధి నిరోధకులను బలపరచి అంతర్జాతీయ సామ్రాజ్యవాద శక్తులు బలపడునట్లు పరోక్షంగా చైనా విధానం చేస్తున్నదని వివరించింది.

మాతృదేశ రక్షణ తీర్మానాన్ని జాతీయ సమితి ఆమోదించి, పార్టీ వర్గాలు ఆచరణలోనికి వెళ్ళిన నెల రోజులకే, పార్టీ కేంద్ర కార్యవర్గం సమావేశమై 1 డిశెంబరు 1962న "జాతీయ రక్షణ, జాతీయ విధానాలకై ఐక్యత" అనే తీర్మానాన్ని ఆమోదించింది. మారిన పరిస్థితులలో నూతన వర్తవ్యాలను నిర్దేశించింది.

కార్యవర్గం, జాతి మొత్తం మహోన్నతంగా జాతి రక్షణ, గౌరవం, సమగ్రతలకై చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా విజృంభించిన ప్రజావెల్లువకు, ప్రజలతో కలిసి సంతృప్తిని వెల్లడించుచున్నది. ఈ వెల్లువలో కమ్యూనిస్టు పార్టీ సముచిత స్థానం వహించి, మాతృభూమి రక్షణకై రాష్ట్ర, జిల్లా పార్టీ శాఖలు, సభ్యులు, సానుభూతిపరులు రక్షణనిధి, సైనికులకు రక్తనిధి సేకరణలో కార్మికులను, ప్రజలను సమీకరించి తమ కర్తవ్య నిర్వహణలో చురుకుగా పాల్గొన్నారు.

పార్టీపై దుష్ప్రచారం, ఆఫీసులపై దాడులు, విస్తృత అరెస్టులు లెక్క చేయకుండా పార్టీ తన స్థానంలో తన కర్తవ్యాన్ని దేశ రక్షణకై నిర్వహించింది. చైనా భారీ ఫిరంగులు అన్ని రకాల ఆర్టిలరీ దళాలు, ఆటోమాటెక్ ఆయుధాలు, చలికాలపు దుస్తులతో సహా సరఫరాలతో అనేక డివిజన్ల సైన్యంతో దురాక్రమణ జరిగిన తీరు అత్యంత వేగంగా పురోగమనం, బలోపేతమైన దాడులు భారత దేశంలోని అస్సాం ఆయిల్ ఫీల్డ్స్ తేయాకు తోటల వరకు వచ్చుట, వారి దీర్ఘకాల తయారీని, ఏర్పాటులను, ప్రణాళికలను తెలియజేస్తుంది. చైనా ప్రచారం భారత దేశ సైనిక దాడి నుండి రక్షణకై తమ సరిహద్దు దళాలు జరిపిన పోరాటంగా తమ దండయాత్రను చిత్రించుచున్నది. చాలా కాలంగా దురాక్రమణల ప్లానులతో జరిగినదని స్పష్టమగుతున్నది. అభ్యుదయ ప్రపంచం ఆశ్చర్యచకితయయ్యింది. సోషలిస్టు అలీన దేశాలు తీవ్ర ఆందోళనకు గురి అయ్యాయి.

ఆసియాలో రెండు పెద్ద దేశాల మధ్య అన్ని సైనిక దళాల పూర్తి యుద్ధం, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ విధానాలకు, సూత్రాలకు విరుద్ధంగా చైనా కమ్యూనిస్టు నాయకత్వం, ప్రభుత్వం చేబట్టిన దుస్సాహసిక విధానం ఫలితంగా ప్రపంచ యుద్ధ ప్రమాదం యేర్పడింది.

అట్టి పరిస్థితులలో చైనా ప్రభుత్వం ఏకపక్షంగా కాల్పుల విరమణను, సైన్య ఉపసంహరణను నవంబరు 21వ తేదీన నోటులో ప్రకటించింది. భారత ప్రభుత్వం, నోటు ఉపోద్ఘాతంలోని దుష్ప్రచారాన్ని ఆ అంశాలను తిరస్కరించి, ఆ నోటును ఆ విధంగాను త్రోసి బుచ్చక, ప్రధానంగా సైన్య వుపసంహరణల అస్పష్టతను, వివరాలను గురించి, వాటి వాస్తవ అర్థాలను తెలుసుకొనకోరింది.

ప్రధాని నెహ్రూ జాతినుద్దేశించి మాట్లాడుతూ, జాతి మొత్తం ఏ విధంగా అనుకొంటుందో ఆ విధంగానే ఈనాటి దురాక్రమణకు ముందు 8 సెప్టెంబరు 1962 నాటి స్థానాలకు రెండు పక్షాలు వుపసంహరించుకొంటే సంభాషణలకు, సంప్రదింపులకు సర్వ సిద్ధంగా వున్నామన్నారు. కమ్యూనిస్టు పార్టి కేంద్ర కార్యవర్గం దానికి పూర్తి మద్దతునిస్తున్నది.

మన దేశం అనుసరిస్తున్న విధానాల మౌలికాంశాలను మొదటి నుండి వ్యతిరేకిస్తున్న వర్గాలు కాల్పుల విరమణ యెడల ప్రధాని, ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలను కాల్పుల విరమణ నాటి నుండి కేంద్రీకరించి దాడి చేస్తున్నారు. మితవాద వర్గాలు " సంప్రదింపులు" కూడదనే ప్రచారాలు, ప్రభుత్వ విధానాలను ఖండించే ప్రజ ప్రదర్శనలను చేస్తు దురాక్రమణ నుండి తొలగిపోతే సంభాషణలకు సిద్ధమనే విధానాన్ని వ్యతిరేకిస్తున్నారు. మితవాద అభివృద్ధి నిరోధకులు అన్ని అభ్యుదయ కర విధానాలను, ప్రభుత్వం అనుసరించే అలీన విదేశాంగ విధానాన్ని, దాని సృష్టికర్తను ప్రధానినెహ్రూని ప్రభుత్వం నుండి దేశనాయకత్వాన్నుండి తొలగించాలంటున్నారు. అలీన విధానమే చైనా దురాక్రమణకు భాధ్యత వహించాలని " సంప్రదింపులు కూడదనే" నినాదాన్నిస్తూ, సంప్రదింపులు కోరువారు "లొంగిపోవు"విధానం అనుసరిన్తున్నారని, వివాదాన్ని గౌరవ ప్రధంగా దేశ సమగ్రతను కాపాడేదిగా వుండాలంటున్నారు. "సంప్రదింపుల" విధానాన్ని ఆమోదించుట అంటే దేశరక్షణ భాధ్యతను వదిలివేయుటయేననే నిందా ప్రచారం చేస్తున్నారు.

ఈ ఆరోపణలు పూర్తిగా నిరాధారాలు. గౌరవప్రధము, దేశ రక్షణను పరిరక్షించే సంప్రదింపులు, దురాక్రమణకు వ్యతిరేకంగా, దేశ రక్షణ చర్యలను పరిపుష్టి చేస్తూనే కొనసాగించవచ్చును. దాని అర్థం మనకు చెందిన ప్రాంతాలను దేశసమగ్రతకు గౌరవ ప్రదంగా పొందుటకు సంప్రదింపులు విధానాన్ని అనుసరించుట, ఆ విధంగా గౌరవ ప్రదమైన పరిష్కారం ద్వారా శాంతిని చేకూర్చుట " సంప్రదింపులు కూడదనే" వారు దీనిని చూడలేకపోతున్నారు.

అలీన విదేశాంగ విధానం, జాతి రక్షణను ఏ మాత్రం బలహీన పరచకపోగా, భారతదేశ రక్షణకు అత్యంత ఆవశ్యకమైనది. భారతదేశం తన ధ్యేయానికి అత్యంత బలాన్ని, మద్ధతును సంపాదించగలుగుతుంది. అన్ని వైపులనుండి అత్యధిక అర్ధ, సైనిక సహాయాన్ని, రాజకీయ పరిమితులు లేకుండా పొందగల అవకాశాలను కలుగచేస్తుంది. అలీన విధానం అదే కాలంలో అత్యధిక స్వావలంబనత్వాన్ని, అభివృద్ధి ఫలితంగా స్వంత రక్షణ, భారీ పరిశ్రమలు, దేశానికి సైనిక బలానికి పునాదులను బలపరుస్తుంది. అలీన విధాన ఆచరణే ప్రపంచంలోని అన్ని దేశాల నుండి నైతిక రాజకీయ మద్ధతు పొందునట్లు చేస్తుంది. మనలను ఏ పక్షానికి కట్టిపడవేయదు. మన సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాన్ని బలపరుస్తుంది.

ఏ దేశాన్నుండి అయినా ఎట్టి రాజకీయ బంధనాలు లేని ఆయుధ, సైనిక సామాగ్రిని మనం పొందగలుగుతున్నట్లు, అదే కాలంలో మనం స్వంత ఆయుధ శక్తిని పెంపొందించుకొనుటకు సహాయపడుతుంది. "సహాయం ఆహ్వానించుతాము. మన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనుటను మరచి, మనలను మరొకరు రక్షించుటపై ఆధారపడితే మనం మన స్వాతంత్ర్యాన్ని కోల్పోతాము" అని నెహ్రూ అన్నారు.

ప్రభుత్వం ఆసియా, ఆఫ్రికాలలోని దేశాలకు భారత-చైనా సరిహద్దు వివాదం, యుద్ధం, వాస్తవ విషయాలను వివరించి, చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా మద్ధతు

సంపాదించగలందులకు అధికార ప్రతినిధి వర్గాలను పంపుటను భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం ఆహ్వానించుచున్నది.

ప్రజాస్వామ్య శక్తులు. చైనా పెద్ద సైన్యం భారత దేశంపై దురాక్రమణ విజయాన్ని పొందినప్పుడు, మనం తాత్కాలికంగా క్లిష్ట పరిస్థితిలో మనం వెనకడుగు వేయవలసి వచ్చినపుడు, అభివృద్ధి నిరోధక వర్గాలు బహిరంగంగా నెహ్రూ దిగిపోవాలనే ప్రచారం సాగిస్తూ వుంటే, కాంగ్రెసును అభిమానించే అసంఖ్యాక ప్రజలు మిన్నకుండుట గాక, కొద్ది మంది కాంగ్రెసువాదులు వారిని బలపరుస్తూ వుండుట ఆశ్చర్యాన్ని కలుగజేస్తుంది. ఇప్పుడు పరిస్థితులు మారి కాంగ్రెస్ వారు, కాంగ్రెసు సంస్థలు దేశ మౌలిక విధానాలకు మద్దతుకై ప్రజలను సమీకరించుటకు చేయు ప్రయత్నాలను కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గం అభినందించుచున్నది. కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గం దేశభక్తులందరిని ముఖ్యంగా కాంగ్రెసు వాదులను దేశపు అమూల్యమైన ఈ కాలంలో ప్రధాన మంత్రి మౌలిక విధానాలకు ప్రజలను సమీకరించమని విజ్ఞప్తి చేస్తున్నది. ఈ విధానాలను పరిరక్షించుటయే నేడు దేశరక్షణ, శాంతిరక్షణ, స్వాతంత్ర్యరక్షణ, మానవ జాతిరక్షణ అగుతుంది. కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి తీర్మానాన్ని అమలు చేయుటలో ఎన్ని ఆటంకాలు వచ్చినా, ఎంతగా రెచ్చగొట్టబడినా, కమ్యూనిస్టులు, సానుభూతిపరులు తమ లక్ష్య సాధనకై ద్విగుణీకృత ప్రయత్నాలు మాతృభూమి రక్షణకై చేయండని విజ్ఞప్తి చేస్తున్నది.

ఈ సందేశాన్ని, విజ్ఞప్తిని చేసే లేఖను కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి వర్గం సౌహార్ధ కమ్యూనిస్టు పార్టీలకు అందజేసి, పార్టీ విధానాన్ని వివరించి, అంతర్జాతీయ కమ్యూనిస్టు సహకారాన్ని అభ్యర్థించింది.

## చైనా ఏకపక్ష కాల్పుల విరమణ, సైన్యపు ఉపసంహారణ ప్రకటన

ప్రపంచానికి నవంబరు21, 1962న హిమాలయాలకు రెండు వైపుల వున్న రెండు పెద్ద దేశాల మధ్య యుద్ధంలో ఏకపక్షంగా కాల్పుల విరమణ, సైన్యం వుపసంహరించుకొంటుందని చేసిన ప్రకటన తెలియజేసింది. అనుకోకుండా వచ్చిన ప్రకటన అందరినీ ఆశ్చర్యచకితులను చేసింది. అదీ 24 గంటలలో ఇది అమలు జరుగుతుందని, 9 రోజులలో సైన్యం వుపసంహరణ జరుగుతున్నదని తెలిపింది. అంతకు ముందు రాత్రి చౌయెన్‌లై భారత రాయభార కార్యాలయ వ్యవహారాలను చూస్తున్న అధికారిని పిలిపించి, చైనా వుద్దేశ్యాన్ని యెరుకపర్చారు, తదుపరి చేసిన ప్రకటన ఈవిధంగా వుంది.

"1) అర్ధరాత్రి 21 నవంబరు 1962 నుండి చైనా సరిహద్దు రక్షణ దళాలు చైనా-భారత సరిహద్దు అంతటా కాల్పులు విరమణ చేస్తాయి.

2) చైనా సరిహద్దు రక్షణ దళాలు 1 డిశెంబరు 1962 నుండి వాస్తవాధీన రేఖ, 7 నవంబరు 1959 నాటి రేఖకు 20 కిలోమీటర్లు వెనుకకు ఉపసంహరించుకొనుట జరుగుతుంది."

ప్రకటన మరికొంత వివరంగా యీ క్రింది విధంగా స్పష్టం చేసింది.

తూర్పు శెక్టారులో ఇంతవరకు చైనా ప్రాంతంలోనే-సాంప్రదాయ రేఖకు ఉత్తరానే పోరాటం జరుగుతున్నా, నేటి స్థావరాల నుండి వాస్తవాధీన రేఖ అనగా చట్ట వ్యతిరేక మెక్ మాహన్ రేఖకు ఉత్తరానికి 20 కిలోమీటర్లు ఆ రేఖ నుండి ఉపసంహరించబడతాయి.

పశ్చిమ మధ్య శెక్టారులలో వాస్తవాధీన రేఖకు 20 కిలో మీటరుల దూరానికి చైనా సరిహద్దు రక్షణ దళాలు వుపసంహరించబడతాయి.[1]

భారతదేశం కూడా వాస్తవాధీన రేఖకు 20 కిలో మీటర్లు దూరాన తన సైన్యాలను తరలించగలదని తలచబడుతుంది. ఆ విధంగా జరుగనిచో తిరిగి పోరాటాన్ని సాగించే హక్కును చైనా కలిగి వుంటుంది. రెండుపక్షాల సివిలుఉద్యోగులు, పోలీసులు తమ ప్రాంతంలో పరిపాలనా యంత్రాంగాన్ని యేర్పాటు చేసుకొనవచ్చు. ఉద్యోగులు సరిహద్దు వద్ద కలుసుకొని అట్టి పాలనా పోస్టులను స్థాపించుటను చర్చించుకొనవచ్చు, ఉపసంహరణ, ఖైదీల మార్పిడి కొనసాగించవచ్చు. తరువాత ప్రధాన మంత్రులిద్దరూ సమావేశమై ఆమోదయోగ్యమైన ఒప్పందానికి రావచ్చు. పెకింగ్‌కు నెహ్రూకు స్వాగతం, అట్లు వీలుకానిచో న్యూఢిల్లీ వచ్చుటకు చౌయెన్‌లై తన అంగీకారాన్ని తెలిపాడు. భారతదేశం సుముఖంగా స్పందిస్తుందని చైనా ఆశించుచున్నది. సరియైన కాలంలో ఇండియా ప్రభుత్వం స్పందించకపోయినా, చైనాతాను చెప్పిన ఉద్దేశ్యాలను అమలు చేస్తుంది.[2]

చైనా తమచర్యను "మెక్‌మాహన్ రేఖను రక్షించుటకు, భారత అభివృద్ధి నిరోధకులు బలంతో సరిహద్దు యధాస్థితిని మార్చాలనే వారి ఆశలను అడియాసలు చేయుటకు, తగిన పరిస్థితులను రూపొందించుటకు, సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొనుటకు వారి (భారతీయుల) పురోగమనం నిరోధించుటకు"[3] అని సమర్థించుకొంది.

## పార్లమెంటులో ప్రతిపక్షాలు

అశోక్‌మెహతా "చైనా ప్రతిపాదన మోసపూరితమని" ఇతరులు కొంతమంది హెచ్చరికగా పార్లమెంటులో పేర్కొన్నారు. ఫ్రాంక్ ఆంతోని "ఆలోచించి వేసిన చైనా మోసపు ఎత్తు" అని కాల్పుల విరమణను నిరాకరించాలన్నారు. సంభాషణలు నిరాకరించుటను కొనసాగిస్తామని పార్లమెంటుకు విశ్వాసం కలిగించాలన్నారు. "ఆత్మ గౌరవం, ఉన్నత స్థాయిలో వ్యవహరించుటకు, క్రూరులను పారద్రోలిన తరువాత సంభాషణలు" అని ఎవరో అరిచారు. కాంగ్రెస్ పార్టీ మామూలుగానే తొణకకుండానే చైనా ప్రతిపాదనలు త్రోసిపుచ్చాలనే ధోరణిలో వుంది. తరువాత కమ్యూనిస్టులు మినహా ప్రతిపక్షాలు అన్నీ కలిసి "చైనీయుల ఏక పక్ష కాల్పుల విరమణ, మన జాతీయ ఫ్రంట్‌లో గందరగోళాన్ని, విచ్ఛిన్నతను కలుగజేసి, వారి పరిస్థితిని పటిష్టం చేసుకొనుటకు కాలహరణానికి ఆలోచించి

1. నెవెల్లి మాక్స్‌వెల్ (1971), "ఇండియా - చైనా వార్" - పేజీ 417.
2. నెవెల్లి మాక్స్‌వెల్ (1971), "ఇండియా - చైనా వార్" - పేజీ 418 పెకింగ్ రివ్యూనుండి
3. నెవెల్లి మాక్స్‌వెల్ (1971), "ఇండియా - చైనా వార్" - పేజీ 418.ఉదహరింపు.

వేసిన ఎత్తు. ప్రపంచ ప్రజాస్వామ్య శక్తులలో అనుమానాలు రేకెత్తించుటకు వుద్దేశించబడిందని, ప్రధానమంత్రి, ప్రభుత్వం స్థిరమైన ప్రతిఘటన చేస్తుందని, సంప్రదింపులు జరుగవని జాతికి విశ్వాసం కలిగించాలి"[1] అని సమిష్టి ప్రకటన గావించారు.

## చైనా ఏకపక్ష కాల్పుల విరమణ - భారత ప్రభుత్వ వైఖరి

ప్రధాని నెహ్రూ లోక్‌సభలో 10 డిశెంబరు 1962న, చైనా ఏకపక్షంగా కాల్పుల విరమణ, సైన్యాల వుపసంహరణలపై 21 నవంబరున చేసిన ప్రకటనలను ప్రస్తావించుట, భారత ప్రభుత్వ వైఖరిని వివరించారు.

"మేము 23న వివరణలను అడుగగా, నవంబరు 26న ప్రత్యుత్తరం వచ్చినది. మరికొన్ని వివరములను 30న కోరాము". అని లోక్ సభకు తెలుపుతూ, ఉత్తర ప్రత్యుత్తరాలను సభ ముందుంచారు. చౌయెనలై 30న సుముఖ ప్రతిస్పందనను, అనగా చైనా ప్రతిపాదనలకు ఆమోదాన్ని కోరుతు వ్రాసారు. దానికి 1 డిశెంబరున ప్రత్యుత్తరం వ్రాయుట జరిగింది. డిశెంబరు 5న చైనా రెడ్ క్రాస్ సంస్థ 64 మంది క్షతగాత్రులైన మన సైనికులను బొమిడిలాలో భారత్ రెడ్ క్రాస్ సంస్థకు అప్పగించింది.

అక్టోబర్ 20న చైనా దాడి జరిగిన వెంటనే చైనీయులు కాల్పుల విరమణ సైన్యాల వుపసంహరణ ప్రతిపాదించి, భారతీయులు ఆ విధంగా అనుసరించేటట్లయితే జరుగుతుందని తెలిపారు. "అక్టోబర్ 27న వారి ప్రతిపాదనను 8 సెప్టెంబరు నాటి పరిస్థితిని పునరుద్ధరించితేనే ఆమోదించగలమని మేము తెలిపాము". చైనా దురాక్రమణ వలన జరిగిన అన్యాయాన్ని, సరిచేయు మార్గమిది ఒక్కటే అయివుంది. "చైనా 21 నవంబరు ప్రతిపాదనలు, 24 అక్టోబరు చేసిన కాల్పుల విరమణ, సైన్యాల వుపసంహరణ, అయితే ఏక పక్షంగా అనేదే వారు తరువాత చేర్చింది"[2] అన్నారు నెహ్రూ. ఇంకా "నేను డిశెంబరు 1న వారి మూడు అంశాల ప్రతిపాదనలు, అధికార పత్రాలలో ఉత్తర ప్రత్యుత్తరాలలో వారు చెప్పుతున్న సూత్రాలను వారే అతిక్రమించుతున్నారని వ్రాసాను. దురాక్రమణతో రాజీలేదని, 8 సెప్టెంబరు 1962 నుండి బలప్రయోగంతో దురాక్రమణ చేసిన స్థానాలను వదలుట జరుగదని, దాని అర్థం దురాక్రమణను ఆమోదించుట, భవిష్యత్‌లో తిరిగి దురాక్రమణకు అవకాశమిచ్చుట అగుతుంది. ఈ వుత్తరానికి చౌయెన్‌లై నేరుగా ప్రత్యుత్తరం పంపలేదు. కాని 9 డిశెంబరున పెకింగ్ రేడియో మన ప్రతిపాదనలనలను నిరాకరించుతూ సుధీర్ఘ ప్రకటనను ప్రసారం చేసింది. సెప్టెంబరు 8 నాటి స్థానాలను పునరుద్ధరించుటకు నిరాకరించింది. మరుసటి దినం మన రాయబార వర్గ అధికారులకు, భారత ప్రభుత్వాన్ని మూడు ప్రశ్నలు వేస్తున్న వొక నోటును అందజేశారు. చైనా వారి ప్రశ్నలు వాటికి సమాధానాలు చెప్పే ముందు కొన్ని విషయాలను సభకు గుర్తు చేయాలని, దురాక్రమణ చారిత్రికాంశాలను వెల్లడించారు. నీఫా సరిహద్దులలో 8 సెప్టెంబరు 1962కు ముందు

1. *నెవెల్లి మాక్స్‌వెల్ (1971), "ఇండియా - చైనా వార్" - పెజి 420.*
2. *నెహ్రూ జవహర్‌లాల్ (1964) - స్పీచెస్ వా. 4 1957-63, ఆంగ్లంలో లోకసభలో 10 డిసెంబరు 1962న ప్రకటన, పే.జి. 249-54.*

చెప్పుకొనదగిన ఎట్టి దురాక్రమణ జరుగలేదు. లాగ్జూ అనే సరిహద్దు గ్రామంలో తప్ప మరెక్కడా జరుగలేదు. దురాక్రమణ లేకుండుటయేగాక, మెక్ మాహన్ రేఖను అతిక్రమించుట జరుగదని అనేకసార్లు ధృవపరచారు. వారు ఈ రేఖ బ్రిటీష్ అధికారులచే రుద్దబడిందని, చట్ట సమ్మతం కాదంటూనే, ఆ రేఖనే బర్మాలో ఆమోదించారు. ఆవిధంగా ధాగ్లా కనుమ వద్ద ఆరేఖను 8 సెప్టెంబరు 1962న అతిక్రమించుట వారు ధృవపరచుటలను భగ్నం చేయుటయే గాక చరిత్రలో మొట్టమొటిసారిగా ప్రధానంగా సరిహద్దును అతిక్రమించారు. ఇది స్పష్టమైన సామ్రాజ్యవాద దురాక్రమణ, అక్టోబరు 20న పెద్ద సైన్యంతో భారత స్థానాలపై ప్లాను ప్రకారం నిర్మాణయుతంగా దాడి కావించి ఆక్రమించారు. అదే రోజున పశ్చిమోత్తర రంగం లడక్‌లో అదే విధమైన దురాక్రమణ జరిగింది.

"మేము తాజాగా జరిగిన దురాక్రమణ నుండి తొలగిపోయి, 8 సెప్టెంబరు 1962 నాటి స్థానాలను నీఫా లడక్‌లలో పునరుద్ధరించనిచో ఎట్టి సంభాషణలకుపక్రమించేది లేదనే వైఖరిని గత కొన్ని మాసాలుగా చెప్పాము. చైనా మమ్ము ప్రశ్నించిన విషయముందు. మొదటిది కాల్పుల విరమణను మేము అంగీకరిస్తామా?లేదా? కాల్పుల విరమణ చైనా ఏకపక్ష ప్రకటన, కాల్పుల విరమణకు సంబంధించినంతవరకు మేమంగీకరించుతున్నాము, దాని అమలుకు మా నుండి ఎట్టి విఘ్నం జరుగలేదు. రెండవది, రెండు పక్షాలు తలపడుట మాని 7 నవంబరు 1959 నాటి వాస్తవాధీన రేఖకు 20 కిలోమీటర్ల దూరం, ఇరుసైన్యాలు వుపసంహరించుకొనుటను నేతలు అంగీకరిస్తున్నామా, లేదా అనే ప్రశ్న గురించి యిద్దరికి అంగీకారమైన వొప్పందం ప్రకారం యిరు పక్ష సైన్యాలు తలపడుట మాని వేయుట అంగీకారమే, కాని అటువంటి వొప్పందం, 8 సెప్టెంబరు 1962 నాటి నుండి జరిగిన దురాక్రమణనుండి తొలగుట, మరెట్టి దురాక్రమణ జరుగకుండుట పై మాత్రమే ఆధారపడి వుంటుంది. చివరదైన మూడవ విషయం: రెండు పక్షాల అధికారులు కలసి ప్రతిపక్షపు సైన్యాల ఉపసంహరణను చర్చించి నిస్సైన్యమండలం ఏర్పాటుకు భారత ప్రభుత్వం అంగీకరిస్తుందా లేదా? అనే విషయమై అధికారులు కలసి, చర్చించుటకు, ఏ రేఖను ప్రామాణికంగా తీసుకొని అమలు చేయుటకు 8 సెప్టెంబరు 1962 నాటి వాస్తవాధీన రేఖా? లేక 7 నవంబరు 1959 రేఖగా చైనా చెప్పే వాస్తవాధీన రేఖ? అనే దానిపై ముందుగా నిర్ణయింపబడి, వొప్పందం జరుగవలసి వుంటుంది. గత మూడు మాసాల్లో చైనా ఆక్రమించిన 2500 చ.కి.మీ. భారత భూభాగం యీ రెండు రేఖల మధ్య గల ప్రాంతంగా వుంది. చైనా ప్రభుత్వం రేఖను తన కనుకూలంగా నిర్వచించి తాజా ఆక్రమణ ఫలితాలను పొందచూస్తున్నది.

తమ ఆత్మరక్షణకు మరో 20,000 చ.మై. భారత భూభాగాన్ని ఆక్రమించామని చెప్పుట వింతగా వుంది. పదాలను తప్పుగా ఉపయోగించుట తప్ప మరొకటి గాదు. రెండు నాలుకలతో మాట్లాడు వారితో వ్యవహరించుట చాల కష్టము. చైనా ప్రభుత్వపు మాటలపైనమ్మకం పెట్టుకొన జాలమనే నిర్ణయానికి మేము బలవంతాన నెట్టబడ్డాము.

చైనా సామ్రాజ్యవాద, విస్తరణ వాద ప్రమాదం మాకు మాత్రమే గాదు

ప్రపంచానికంతటికి, కారణం అంతర్జాతీయ న్యాయ చట్టాన్ని ఆచరణను అది నగ్నంగా వ్యతిరేకించుచున్నది" అని నెహ్రూ లోక్‌సభలో భారత్-చైనా తాజా పరిణామాలను 10 డిశెంబరు 1962 తెలిజయరిచారు, అధికార పత్రాలను సభ ముందుంచారు.

## భారత-చైనా సరిహద్దు వివాద పరిష్కారానికి కొలంబో ప్రతిపాదనలు

కొలంబోలో ఆఫ్రో-ఏసియన్, అలీన దేశాలు సమావేశమై భారత-చైనా సంఘర్షణలు ఆపివేయబడుట, చైనాతో సంభాషణలు ప్రారంభించుటకు ప్రథమ మెట్టుగా భావించాయి. కొలంబో ప్రతిపాదనలు అని చెప్పబడేవి ప్రకటించకపోయినా, వాటి వివరణలు అదేవిధంగా బహిరంగ పరచలేదు. అయినా భారత ప్రభుత్వ ప్రతినిధి"కొలంబో ప్రతిపాదనలు భారత వైఖరికి దగ్గరిగా వున్నవని" మొత్తం మీద "సంప్రదింపులకు ముందు తాజా చైనా దురాక్రమణను సరిచేయాలనే " స్పష్టం చేసాయని అన్నారు.

కొలంబో ప్రతిపాదనల యెడల ప్రధాని నెహ్రూ నిర్మాణాత్మకమైన వైఖరిని తీసుకొనుట, గౌరవప్రదం, ఆత్మగౌరవంకు అనుకూలంగా వున్నందున, శాంతికి దోహదమిస్తున్నందున భారత కమ్యూనిస్టు పార్టీ పూర్తి మద్దతునిస్తున్నది. దీనితో భారతదేశం యెప్పుడూ అనుసరించుతున్న శాంతియుత సంప్రదింపుల ద్వారా పరిష్కారానికి ప్రయత్నించే మార్గం, దృక్పథం ప్రాముఖ్యతలోనికి వచ్చింది. ఈ విధానం ఆచరణలోనికి వచ్చుటకు భారత ప్రభుత్వం కాల్పుల విరమణ, సైన్యం వుపసంహరించుకొనుట ఎంతో తోడ్పడింది. ప్రధాన మంత్రి విధానాలపై అభివృద్ధి నిరోధకులు సాగించేదాడి పదును మొద్దిబారింది. పరస్పర ఆమోదముతో సైనిక చర్యల విరమణ అభివృద్ధికి అవకాశాలు యేర్పడ్డాయి. గౌరవ ప్రధమం, సంతృప్తికరమైన సరిహద్దు వివాదం, ప్రశాంత, విశ్వాస వాతావరణంతో జాతి యెదుర్కొంటున్న వివాద పరిష్కారానికి మార్గమేర్పడింది.

పరస్థితులు యింత అనుకూలంగా మారినా, సంప్రదింపులు, పరిష్కారం అంత తేలిక కాదు. కొలంబో ప్రతిపాదనలకు చైనా ప్రభుత్వం యే విధంగా స్పంధిస్తుంది అనే దాని మీద, భారత న్యాయసమ్మతమైన కోరికలు శాంతియుతంగా పరిష్కారమగుట ఆధారపడి వుంటుంది. చైనా 8 సెప్టెంబరు 1962 తరువాత చేసిన దురాక్రమణ, నవంబరు 20న చేసిన సైనిక దండయాత్ర, కలిగించిన విశ్వాన నంక్షోభం, అంత తేలికగా తొలగింపబడజాలవు. పరస్పర వొప్పంద సైనిక చర్యల విరమణ ఆచరణలోనికి వచ్చి, సరియైన వాతావరణంలో సంభాషణలు కొనసాగతేనే కొంతవరకు తొలగహగలవు. ఒకసార యీ సంప్రదింపులు ప్రారంభమైన తరువాత అవి అనంతంగా కొనసాగకుండా బాండుంగు అవగాహనతో సత్వర పరిష్కారానికి రెండు దేశాలు గౌరవప్రదంగా రాగలగాలి. అంతేగాని సంభాషణలు ఎట్టి నిర్ణయాలకు రాకుండా అనంతంగా సాగితే భారత-చైనాల మధ్య శీతల యుద్ధ ప్రమాదం కలిగే అవకాశం వుంది.

దేశరక్షణ, జాతి స్వాతంత్ర్యాన్ని బలపరచుటలోనే యిమిడి వుందని, భారత కమ్యూనిస్టు పార్టి విశ్వాసం. భారత ప్రభుత్వం సంభాషణలు తిరిగి ప్రారంభించే ప్రయత్నాలను చేస్తూనే,

రక్షణ కార్యక్రమాలను బలపరచుకొనవలసి వుంటుంది. ఈ విషయంలో భారత ప్రధాని వైఖరిని, ఆయుధాల సప్లయి విషయంలో విదేశాలపై ఆధారపడియుండ రాదనే విధానాన్ని పార్టీ బలపరుస్తుంది. శక్తివంతమైన ఆయుధ పరిశ్రమలను ప్రభుత్వం చేబట్టుటను బలపరుస్తుంది. అదే విధంగా అన్ని విధానాలగా భారతసైన్యపు ఆధునీకరణను బలపరుస్తుందని స్పష్టం చేసింది.

మన దేశాన్ని వెన్నుపోటు పొడిచి, వొత్తిడి చేసి, మన గౌరవానికి దేశ సమగ్రతకు భంగం కలిగించే రీతిగా పశ్చిమ దేశాల సామ్రాజ్యవాద శక్తులు, దేశంలోని అభివృద్ధి నిరోధక రాజకీయ శక్తులను గురించి కమ్యూనిస్టు పార్టీ భారత ప్రజలను హెచ్చరిస్తున్నది. ఈ శక్తులు కాశ్మీర్ విషయంలో గూడా ఈ విధానాన్ని అనుసరిస్తూ పాకిస్థాన్‌కు తోడ్పడుట అందరికి తెలుసు.

చైనా దురాక్రమణను అవకాశంగా తీసుకొని దేశీయ, అంతర్జాతీయ అభివృద్ధి నిరోధక శక్తులు ఆయుధసహాయం, ఆర్థిక సహాయం పేరుతో భారత ప్రభుత్వానికి,నెహ్రూ అలీన విధానానికి, ప్రణాళికాబద్ధ అభివృద్ధి కార్యక్రమాలకు,వ్యతిరేకంగా ప్రచారం ముమ్మరం చేసి నెహ్రూను ప్రధాని పదవి నుండి తొలగించే ప్రయత్నాలను కమ్యూనిస్టుపార్టీ తన శక్తికొలది వమ్ముచేయ ప్రయత్నించింది.వారి కొలంబో ప్రతిపాదనల వ్యతిరేకత కూడా ఈ మాస్టర్ ప్లానులోని భాగమేనని కమ్యూనిస్టు పార్టీ తలచింది.

కమ్యూనిస్టు పార్టీ, కాంగ్రెస్ వాదుల, యితర ప్రజాస్వామ్య శక్తులతోకలసి, జాతీయ ఐక్యతా ప్రచారోద్యమాన్ని యీ క్రింది అంశాలపై చేపట్టింది.

కాల్పుల విరమణ అమలుకు, గౌరవ ప్రదమైన సంప్రదింపుల ద్వారా పరిష్కారానికి తగిన వాతావరణాన్ని రూపొందించుటను బలపరచుట

జాతీయ విధానలైన శాంతియుత సహజీవనం, అలీన విదేశాంగ విధానాన్ని ఆసియా, ఆఫ్రికా ప్రజాఐక్యత, సామ్రాజ్యవాద వ్యతిరేకత, శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, ప్రణాళికాబద్ధ ఆర్థికాభివృద్ధి, భారీ పరిశ్రమల స్థాపన, పబ్లిక్ శెక్టర్ అభివృద్ధిని బలపరచుట.

మన పారిశ్రామిక శక్తిని అత్యంత వేగంగా అభివృద్ధి చేయుటయే మన రక్షణ పారిశ్రామిక శక్తిని, రక్షణ సామర్థ్యాన్ని బలపరచుట.

బలమైన స్వతంత్ర భారత ఆర్థిక విధానానికి కావలసిన వనరులను సేకరించుటకు బీదలనునండి గాక, ఎవరు చెల్లించగలరో వారిపైనే ఆభారాన్ని మోపి సేకరించాలి.

జాతీయ ఐక్యతను, ఉపజాతుల ఐక్యతను, మత,కుల విచ్ఛిన్నకర వేర్పాటు వాదులను వ్యతిరేకించుతూ బలపరచాలి.

ప్రజల ప్రజాస్వామ్య ప్రయోజనాలను, ఆర్థికాంశాలను, హక్కులను బలపరచాలి.

కొలంబో ప్రతిపాదనలు తెచ్చిన చొరవ, భారత ప్రభుత్వ స్పందనను వాస్తవం చేయాలి.

కమ్యూనిస్టు పార్టీ యీ ఆశయాలకై తన శక్తినంత వినియోగించుతుంది.

కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం జనవరి 1963 తీర్మానంలో యీ విధానాన్ని ఆమోదించింది.

## కొలంబో ప్రతిపాదనలు, భారతప్రభుత్వ వైఖరి

జనవరి23, 1963న లోక్ సభలో ప్రధాని నెహ్రూ కొలంబో ప్రతిపాదనలపై ప్రభుత్వ చర్యలపై క్రింది ప్రధానాంశాలను ప్రకటనలో వివరించి, తదనంతర చర్యలను గైకొనుటకు లోక్ సభ ఆమోదాన్ని అభ్యర్థించారు.[1]

కొలంబో సమావేశ ప్రతిపాదనలను తీసుకొని ప్రతినిధులు పెకింగుకు వెళ్ళి, తదుపరి 17 డిశెంబరు 1962న ప్రధాన మంత్రిణి సిరిమావో బండారు నాయకే రాయభార ప్రతినిధి మిస్టర్ జి.యస్. పేయిరిన్ ఢిల్లీలో ప్రధాన మంత్రికి ప్రతిపాదనలు అందజేశారు.

"ప్రతిపాదనలలో వొకటి, రెండు విషయాలు అస్పష్టంగా, విరుద్ధ వ్యాఖ్యలకు అవకాశాన్నిస్తున్నవిగా వున్నందున, ప్రతినిధులను వాటిని వివరించమని కోరాము. మేము తిరిగి పునచ్చరణ చేసినట్లు 8 సెప్టెంబర్ 1962 నాటికి పూర్వ పరిస్థితిని పునరుద్ధరించుటను. ప్రతిపాదనలు యెంతవరకు చేస్తున్నవనేది ముఖ్య సమస్య. కొలంబో ప్రతిపాదనలు వివాదంలో ఎవరిది న్యాయం అనే సమస్య విషయమై ప్రస్తావించక రెండు పక్షాల ప్రతినిధుల సంభాషణలు, సంప్రదింపులకు మార్గాన్ని సులభతరం చేయుటకు వుద్దేశించబడినవి. ప్రతిపాదనలు తూర్పు, పశ్చిమ, మధ్య సరిహద్దు ప్రాంతాలకు సంబంధించి వున్నవి.

తూర్పు సరిహద్దు, సెప్టెంబర్ 8 నాటికి పూర్వపు, మక్‌మాహన్ రేఖ అనబడే అంతర్జాతీయ సరిహద్దుకు ఉత్తరాన చైనా సైన్యాలున్నవి. భారత సైన్యాలు దక్షిణాన వున్నవి. అయితే లాగ్జూ మినహాయింపు. రెండు పక్షాలలో ఎవరూ దీనిని ఆక్రమించరాదు. చైనీయులు ఎందుకు బలప్రయోగంతో ఆక్రమించారు? తరువాత దానిని ఎవరు ఆక్రమించరాదని అన్నారు. కొలంబో సమావేశ ప్రతినిధిని అడిగిన మీదట థాగ్లారిడ్జి మినహా యిరు పక్షాలలో ఎవరూ ఆక్రమించరాదనే దానిని నిర్ధారణ చేశారు. థాగ్లారిడ్జి, లాంగ్జూ ప్రాంతంలో భారతదేశం-చైనా నేరుగా సంభాషణలలో పరిష్కరించుకోవాలని కొలంబో ప్రతిపాదనలు సూచించినవి. అంటే కొలంబో ప్రతిపాదనలు థాగ్లాపర్వత ఉన్నతశ్రేణి, దోలా సైనిక పోస్టుల ప్రాంతాలను మినహాయించి 8 సెప్టెంబరుకు పూర్వపు స్థానాలను పునరుద్ధరించుచున్నది. ఈ స్థానాలు మెక్ మాహన్ రేఖకు 3 కిలో మీటరులు లోపల వున్నవి.

మధ్య సరిహద్దు ప్రాంతానికి సంబంధించినంత వరకు యదాస్థితిని కొనసాగించాలని కొలంబో ప్రతిపాదనలు స్పష్టం చేశాయి. యధాస్థితిని భగ్నం చేయుటకు ఎవరూ ప్రయత్నించరాదు. ఈ ప్రాంతంలో యధాస్థితి కొనసాగించాలనుట 8 సెప్టెంబర్ నాటి

1. *జవహర్‌లాల్ నెహ్రూ స్పీచెస్ 1957- 1963 (1964) వాల్యూం నెం.4. పే.255-266.*

స్థానాలను పునరుద్ధరించుటయే అగుతుంది. ఈ ప్రాంతం వివాదగ్రస్థ ప్రాంతంగా లేదు.

ఇక పశ్చిమ సరిహద్దు ప్రాంతం లడక్‌లో 8సెప్టెంబర్ నాటి యథాస్థితిని కొనసాగించుట అంటే, సర్కులేటు చేసిన మ్యాపులో నీలిరంగులో గుర్తింపబడిన అన్ని భారత సైనిక పోస్టులను తిరిగి పునరుద్ధించుట అగుతుంది. దీని అర్థం చైనీయులు ఎర్ర రంగులో గుర్తింపబడిన వారి పూర్వ సైనిక పోస్టులను కలిగియుండుట. కొలంబో ప్రతిపాదనలు చైనీయులు 20 కిలో మీటర్ల ప్రాంతంలో నుండి తమ సైన్యాలను ఉపసంహరించుకోవాలని ఆ ప్రాంతంలో రెండు పక్షాల పౌర అధికారులచే పరిపాలన కొనసాగించాలన్నారు. ఈ ప్రాంతంలో యింతకు ముందు భారతీయ సైనిక పోస్టులచే యీ వ్యవహారాలు చూడబడుతున్నవని సభ్యులకు తెలిసి వుంటుంది. సెప్టెంబరు 8కి ముందు సుముదోకు పశ్చిమాన 2 లేక 3 పోస్టులు మినహా భారతీయ పోస్టుల అధికారంలోనే పాలన సాగుతున్నది. ప్రత్యామ్నాయంగా స్పాంగ్ నూరుకు మరింత దక్షిణంగా అనేక సైనిక పోస్టుల నుండి చైనీయులు ఉపసంహరించుకోవలసి వుంటుంది. కొలంబో ప్రతిపాదనలు, వివరణలు, 8 సెప్టెంబరు పూర్వపు స్థానాలను పునరుద్ధరించుచున్నవి. నాటి యథాస్థితి సభ్యులకు అందజేయబడిన మ్యాపుల సహాయంతో పరిశీలించితే, మనం ఇంతకు ముందు సూచించిన దానికంటె కొలంబో ప్రతిపాదనలు మనకు అనుకూలంగా వుండుట స్పష్టమగుతుంది. కొలంబో ప్రతిపాదనలను చైనీయులు అంగీకరించితే పశ్చిమ ప్రాంతంలోని తమ సైన్యాలను వుపసంహరించుకొని నిస్సైనిక మండలంగా పరిపాలన చేయుట భారత చైనీయుల పౌర పోస్టులు సమాన ప్రాతిపధికగా జరుగవలసి వుంటుంది. సాయుధ పోలీసులు, చిన్న ఆయుధాలు, పౌర పాలన కొనసాగుతుంది. ఆ ప్రాంతంలో పెద్దయెత్తున చైనీయుల పోస్టులు, భారి ఆయుధాలు పునరుద్ధరించుట కూడదన్నది. వీటన్నిటిని పరిశీలించి 8సెప్టెంబరు నాటి యథాస్థితిని పునరుద్ధరించుటయే సారాంశం అగుతుందనే నిర్ణయానికొచ్చాము. అందుకే సూత్రప్రాయంగా కొలంబో ప్రతిపాదనలను ఆమోదించామని చివరికి పార్లమెంటు ఆమోదించవలసి వుంటుందని తెలుపబడింది.

కొలంబో ప్రతిపాదనల యెడల చైనా వైఖరిని తెలుపవలసినదిగా సిలోన్ ప్రధాన మంత్రిని కోరగా, అందిన సమాచారాన్ని బట్టి చైనా ప్రభుత్వం వైఖరి యీ క్రింది విధంగా వుంది. చౌయెన్‌లై కొలంబో ప్రతిపాదనలను సూత్రప్రాయంగా ఆమోదించాడని, వాటి ప్రాతిపదికగా చైనా-భారతదేశాల అధికారులు కలసి కాల్పుల విరమణను, సైనికుల నిష్క్రమణలపై సంభాషణలు, సమస్యల చర్చలు కొనసాగించి భారత-చైనా సరిహద్దు సంప్రదింపులు పెంపొందించవచ్చును. అంతేగాక ప్రతిపాదనలో వివరాల వ్యాఖ్యలపైగల భేదాభిప్రాయులు, సంభాషణలు ప్రారంభించుటకు ప్రతిబంధకాలు కావని, భారత-చైనా అధికారుల సంప్రదింపులు, సంభాషణలతో అభిప్రాయ భేదాలు పరిష్కరించబడగలవని ఆశించుతున్నామన్నారు.

"సభ్యులు, బహుశా నిన్నటి చైనా విదేశాంగ మంత్రి మార్షల్ చెన్ యీ నివేదికను చూసేవుంటారు. ప్రతిపాదనలను సూత్రప్రాయంగా ఆమోదించాలంటూనే, ప్రధాన

విషయాలలో భేదాభిప్రాయలను లేవనెత్తుతున్నారు. అవి స్పష్టమైన ప్రాతిపదికలుగా కొలంబో ప్రతిపాదనలను వారు అంగీకరించలేదు. చైనాప్రభుత్వం ప్రతిపాదనలపై వారి వ్యాఖ్యలకే అంటిపెట్టకొని వున్నారు. దాని అర్థం కొలంబో ప్రతిపాదనలనుమొత్తంగా వారు అంగీరకించలేదు. మనం చైనా ప్రభుత్వం కొలంబో ప్రతిపాదనలను యధాతథంగా వాటిని ఆమోదించతేనే భారత, చైనా ప్రభుత్వాల అధికారులు సంప్రదింపులు, సంభాషణలు అనే స్పష్టమైన విధానాన్ని అనుసరించాము.

మార్షల్ చెన్‌యీ, చైనా ప్రభుత్వం కొలంబో ప్రతిపాదనలలోని కొన్ని ముఖ్యాంశాలనే ఆమోదించగలమని తెలియజేసినట్లు, సిలోను ప్రధాన మంత్రినుండి తెలిసింది. ఆ ప్రతిపాదనలను యధాతథంగా అంగీకరింపజాలమని తెలియజేసినట్లు సిలోన్ ప్రధాన మంత్రి ద్వారా వచ్చిన సమాచారాన్ని బట్టి తెలియవస్తున్నది. అంచేత భారత ప్రభుత్వం, అన్నీ స్పష్టం కాకుండా యేది నిర్ణయించజాలదు. యేమీ చేయజాలదు.

ప్రధాని నెహ్రూలోక్ సభలో 25 జనవరి 1963న చర్చలకు సమాధానంగా పై ప్రధానాంశాలనే పునరుద్ఘాటించారు. భారత-చైనా సరిహద్దు వివాదం విడివడని ముడిని కాలమే పరిష్కరించాలి.

# 8

## బ్రిటిష్ సామ్రాజ్య వాదపు సరిహద్దు ఫోర్జరీ పత్రాలుతెచ్చిన చారిత్రిక ముప్పు

భారత ప్రభుత్వ జాతీయ పురాతన పత్రాగారపు రిటైర్డ్ డిప్యూటీ డైరెక్టరు సొరిన్‌రాయ్, కరుణాకర్ గుప్తా రచన "స్పాట్‌లైట్ ఆన్ చినో ఇండియన్ ఫ్రాంటియర్స్" కు పరిచయము వ్రాస్తూ "చైనా-ఇండియా సరిహద్దు సమస్యను అధికార వర్గాలు చేపట్టిన తీరును తీవ్రంగా విమర్శించారు. అత్యంత శ్రమతో అనేక సంవత్సరాలు పరిశోధించి, ఆధార సహితంగా, ఈ సమస్యను "ఆషామాషీగా, అపరిపక్వత చెందిన వారిగా, గందరగోళం, అస్పష్టతగా చేపట్టారని" నిరసించారు. భారత రాజకీయ విధాన నిర్ణేతలు వాస్తవికాంశాలపైగాక, వారి వూహా జనితాలపై, కొన్ని వారిచె సృష్టింపబడినవి, కొన్ని వారసత్వంగా లభించిన అసంగతాలు, పత్రాలను తప్పుగా అర్థం చేసుకొనుట లేక వికృతార్థాలు చెప్పుట జరిగింది. బ్రిటీష్ పాలకులు అధికార పత్రాలను, సమాచారాన్ని ప్రజలకు దూరంగా నిషేదించి వుంచారు. ఆశ్చర్యాన్ని గొలిపే యీ కధనాన్ని డా॥ గుప్తా రచనలు నుండి స్పష్టంగా తెలుసుకొనవచ్చని" వ్రాసారు. అంచేత ఈ నూతన విషయాలను తెలుసుకొనుట అత్యవసరము కాన, తాజా కలం క్రింద ఈ చివరి ప్రకరణ రచన సాగింది.

మొట్ట మొదటిది ఈశాన్య ప్రాంతం లేక నేటి మేఘాలయ ప్రాంత సరిహద్దు సమస్యపై,

1936 వరకు అన్ని అధికార మ్యాపులు, అస్సాం పర్వతశ్రేణి పాద ప్రాంతాన్నే సరిహద్దు రేఖగా చూపించాయని, సహేతుకంగా గుప్తా నిరూపించారు. అస్సాం హిమాలయ పర్వతాల శ్రేణి ఉన్నత రేఖ సరిహద్దు రేఖగా వుందని అధికార వర్గాలు నిర్వచించి బ్రిటన్, టిబెట్,చైనా త్రైపాక్షిక కన్వన్షన్ 1913-14లో సిమ్లాలో రూపొందించిందనే వైఖరిని చేబట్టాయి. ఏట్చిన్స్ బ్రిటీష్, ఎంగేజ్‌మెంట్స్, సన్నద్స్ (వా XIV) పునర్ముద్రిత పూర్తి పాఠంలో 1938లో అచ్చయిన ప్రతిలో కన్వన్షన్ సరిహద్దు నిర్ణయ సమస్యను నిర్ణయించుటకై సంప్రదింపులు, చర్చలు జరిగినట్లు సూచన ప్రాయంగానైనా వుదహరించి వుండకపోవుట, సందేహాన్ని కలుగజేస్తుంది. అయితే బ్రిటిష్ అధికార ప్రతినిధి మోక్‌మాహన్, సరిహద్దు రేఖను ఆ విధంగా టిబెట్ ప్రతినిధి రహస్యంగా ప్రతిపాదించినట్లు, టిబెట్ ప్రతినిధి తను ఆమోదించినట్లు మెక్‌మాహన్ "నోట్" వున్నది. ఈ నోట్ కన్వెన్షన్ సమావేశంలో భాగంగా లేదు. కనెన్వన్షలో వుదహరించబడలేదు. కన్వెన్షన్ గురించి వ్రాయబడిన కథనంలో భారత-టిబెట్ సరిహద్దు రేఖను గురించిన వుదహరింపు అదే వాల్యూంలో వుంది. అయితే అదే కథనంలో స్పష్టంగా "చైనా ప్రభుత్వం వొప్పందాన్ని (రాటిఫై) పునరుద్ఘాటించుట, లేక అధికార రీత్యా ప్రభుత్వం ఆమోదం తెలుపుట చేయ నిరాకరించిందని" "వుదహరించబడి వుంది", కాన దాని విలువ శూన్యం. "కన్వెన్షన్ కథనం" "బ్రిటన్, టిబెట్‌లు వొక ప్రకటన ద్వారా ఆమోదించి, యిరుపక్షాలు తప్పనిసరిగా ఆచరీణయమని" తెలుపుచున్నది. అయితే అట్టి ప్రకటన యెక్కడా కనిపించదు. చైనా ప్రభుత్వం ద్వారానే ఎట్టి సంప్రదింపులు, వొడంబడికలు చేసుకొనరాదని 1907లో ఆంగ్లో-రష్యన్ కన్వెన్షన్ నిషేధించింది. ఇది, లాలూచీగా జరిగినా మెక్‌మాహన్ రేఖకు చట్టరీత్యా విలువలేదు. ఏమైనా లండన్‌లోని బ్రిటిష్ అధికార వర్గాలు కాని, భారతదేశంలోని ఆంగ్లో అధికార వర్గాలు కాని ప్రభుత్వామోదాలను తెలుపుతూ పునరుద్ఘాటించలేదు. అంతేగాకుండా, లార్డ్ హార్డింగ్స్ ప్రభుత్వం, స్టేటు కార్యదర్శి (లండన్)కు 23 జూలై 1914లో ప్రభుత్వ లేఖవ్రాస్తూ, సిమ్లా కన్వెన్షన్‌లో 'నీఫా' సరిహద్దు రేఖ ప్రస్తావన రాలేదని స్పష్టం చేయుటను గుప్తా వెలికి తెచ్చుటతో, అతని నిర్ధారణనకు బలం యేర్పడింది. అదే లేఖలో నీఫా ప్రాంత సరిహద్దు రేఖ నిర్ధారణ మెక్‌మాహన్ వ్యక్తిగత విషయం మాత్రమేనని, ప్రభుత్వం దానికి కట్టుబడిలేదని స్పష్టం చేయబడింది. అయితే గుప్తా యీ విషయాన్ని ఉదహరించలేదని సారిన్‌రాయ్ పరిచయంలో పేర్కొన్నారు. మెక్ మాహన్ రేఖ చట్టసమ్మత పరిగణనను "ఒక్క దెబ్బతో బ్రద్దలు" చేసారని రాయ్ పేర్కొన్నారు. సిమ్లా సమావేశాన్ని గూర్చి తప్పుడు మార్గం పట్టించే కథనం ఏవిధంగా "ఎట్చిన్స్‌ట్రిటిస్" వా.14లో చోటు చేసుకొన్నదో డా॥గుప్తా పరిశోధించి బయట పెట్టి భారత ప్రజకు, ప్రపంచానికి తెలిపి, చారిత్రాత్మక కర్తవ్యం నిర్వహించారు, వారికి ధన్యవాదాలు చెప్పవలసి వుంటుంది. లండన్‌లోని ఇండియా ఆఫీసు, విదేశాంగ శాఖల పురాతన పత్రసంచయాన్ని పరిశీలించి, సత్యాన్వేషణ గావించి అందరికి తెలియచెప్పారు. ఆ కథనం యిలా వుంది. "నెహ్రూకిగాని, చౌయెన్‌లైకి గాని, మెక్ మాహన్ రేఖ పుట్టుక చుట్టు అల్లబడిన 'సాలెగూడు' తెలిసినట్లు కన్పించదు"[1] అని డా॥ గుప్తా తెలిపారు.

1. గుప్తా, కరుణాకర్ (1982 - స్పాట్‌లైట్ ఆన్ చినో ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజ 76)

"సామ్రాజ్యవాదం, దాని విదేశాంగ రాజకీయ శాఖ 1935లో భారతదేశపు 'నీఫా' సరిహద్దును అస్సాం పర్వత శ్రేణి పాద రేఖ నుండి హిమాలయాల ఉన్నత రేఖ వరకు విస్తరింపజేయాలనే అవసరాన్ని గుర్తించి సత్వరం చేయ సమకట్టింది. సమర్థించ తగని యీ లక్ష్యానికి కారణం కన్పించదు. మెక్‌మాహన్, టిబెట్ అధికార ప్రతినిధి మధ్య జరిగిన సమావేశంలో పరస్పరం అందించుకొన్న నోట్స్‌లలో కొన్నింటిని సృష్టించుటలో డిపార్ట్‌మెంట్ డిప్యూటి సెక్రటరీ అయిన ఒలాఫ్ కెరో ఎట్టి కష్టము పడలేదు. ఇప్పుడు కెరో ఆ సిమ్లా సమావేశపు పత్రాలకు (డ్యాక్యుమెంట్సు) యివ్వదలచిన వక్రీకరణ వివరణలకు, 1929లో ఏట్చిన్స్ ట్రీటీస్ వాల్యూం 14లో గ్రంథస్థం చేయబడిన వాస్తవ విషయాలు పెద్ద అడ్డంకిగా వున్నవి. ఆ 14 వాల్యూంను వెనుకకు తీసుకొని నాశనం చేయుటకు, దగ్గరి మార్గాన్ని అనుసరించుటకు వెనకాడలేదు. దాని స్థానంలో తక్షణ అవసరాలకు అవసరమైన విషయాలను చేర్చి నూతనంగా అచ్చువేయించి విడుదల చేయించాడు.[1] అని ఉపోద్ఘాతంలో రాయ్ పేర్కొన్నారు. ఈ నకిలీ, ఫోర్జరీ 'ఏట్చిన్స్‌ట్రీటీస్' వాల్యూం 1938లో అచ్చు అయినా 1929లో అచ్చు అయినట్లుగా వేయబడింది. ఆశ్చర్యాన్ని గొలిపే యీ చర్య అంతా లండన్‌లోని స్టేట్ సెక్రటరీ ఆమోదంతోజరిగింది. ఫోర్జరీ చేయుటకు లండన్‌లోని సెక్రటరీ ఎలా ఆమోదించాడో అర్థం కాకుండా వుంది. అధికార పూర్వకమైన అసలు గ్రంథం పూర్తిగ కన్పించకుండా పోయింది. అనుకోకుండా కొన్ని మిగిలి వుండవచ్చు. అందులో వొకటి డా॥గుప్తాకి ఇండియా ఆఫీసు, లండన్‌లో కంటబడింది. ఫోర్జరీ ప్రతియే అందరికి అందుబాటులో వుంది. పరిశోధకులు, సత్యాన్వేషణలనెందనినో తప్పుదారిని పట్టించుట తెలియవచ్చింది. మన విదేశాంగ శాఖ ఉన్నతోద్యోగులు అంత తేలికగా తప్పుదారిని ఎలా తీసుకొన్నారో అర్థమగుటలేదు. బ్రిటిష్ రాజకీయ విధాన వారసత్వంపై, భారత ప్రజలకు సరిమైన అవగాహనలేదు.

'నీఫా' ప్రాంత భారత సరిహద్దుకు సంబంధించిన భారత సర్వే శాఖ 1947-52లలో ప్రకటించిన మ్యాపులలో భూటాన్‌కు తూర్పు భాగంలో హిమాలయ పర్వత శ్రేణి అగ్రభాగాన "నిర్ధారణ చేయని" అని, పశ్చిమోత్తర కాశ్మీరుచివరనుండి, నేపాల్, టిబెట్, ఇండియా త్రైకూడలి వరకు రంగుకుంచె తుడుపుగా వేసి "నిర్ధారణ కాని సరిహద్దు" అని మూడు చోట్ల అచ్చులో వున్నది. "టిబెట్ ప్రభుత్వం, 16 అక్టోబరు 1947న అస్సాం నుండి లడక్ వరకు గల టిబెట్ ప్రాంతాలైన సిక్కిం, డార్జిలింగ్, భూటాన్ తదితర ప్రాంతాలను తమకు తిరిగి స్వాధీనం చేయవలసినదిగా భారత ప్రభుత్వాన్ని కేబులు ద్వారా కోరింది. జూలై,సెప్టెంబరు, నవంబరు 1946 జనవరి 1947లలో ఛాంగ్‌కైషేక్ చైనా రిపబ్లికన్ ప్రభుత్వం, మాక్‌మాహన్ రేఖ అనేదిగా చెప్పబడుతున్న దానికి దక్షిణాన గల తమ ప్రాంతాలను బ్రిటిష్ కాలను గతంగా ఆక్రమణచేసినందుకు చైనాలోని బ్రిటిష్ రాయబార కార్యలయానికి నాలుగు నిరసన నోటులను పంపింది. అదే సమస్యపై కొమింగ్ టాంగ్ ప్రభుత్వం, చైనాలోని భారత ప్రభుత్వ రాయబార కార్యలయానికి ఫిబ్రవరి1947లో నిరసన నోట్‌ను పంపింది. ఇండియా ప్రభుత్వం దృష్టిలో గల సిమ్లా కన్వెన్షన్‌ను తిరస్కరించుతు, ఇండియాలోని

1. గుప్తా, కరుణాకర్ (1982 - స్పాట్‌లైట్ ఆన్ చినో ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజ 3-4)

చైనా జాతీయ ప్రభుత్వపు రాయబారి 18 నవంబరు 1949న భారత విదేశాంగ శాఖ మంత్రిత్వానికి "నోట్"ను పంపారు. ఈ 'నోట్'లు భారత ప్రజలకు తెలియకుండా "రహస్యపత్రాలు"గ నమోదు చేయబడినవి. అందువలన భారతప్రజలకు బ్రిటిష్ ప్రభుత్వం నుండి వారసత్వంగా లభించిన "సరిహద్దు" తలనొప్పి సమస్య గురించి తెలియదు.

భారత ప్రభుత్వం 30 డిశెంబరు 1949న చైనా ప్రజా ప్రభుత్వాన్ని గుర్తించిన వెంటనే, ప్రజలకు భారత ప్రభుత్వం మెక్ మాహన్ రేఖ చట్ట సమ్మతమైనదిగా తలచుచున్మదని, పార్లమెంటులో హెచ్.వి కామత్ ప్రశ్నకు సమాధానంగా "ఈ శతాబ్దపు ప్రథమంలో టిబెట్, చైనా, భారత ప్రతినిధులు కొన్ని నిర్ణయాలకువచ్చారని, అవి దగ్గర దగ్గరగా టిబెట్, ఇండియాలకు మెక్ మాహన్ రేఖ అని చెప్పబడేది సరిహద్దు అని, టిబెట్‌ను స్వపరిపాలిత దేశంగా, చైనా అంగీకరించితే, వొకరకమైన చైనా సార్వభౌమాధికారంలో గలదిగా గుర్తించాలనే అంశాలని, నెహ్రూ పార్లమెంటులో 8 ఫిబ్రవరి 1950లో చెప్పారు. తదుపరి, అప్పటి చైనా ప్రభుత్వం వొప్పందాన్ని అంగీకరించక సంతకం చేయలేదన్నారు. సమస్య అలానే వుందని చెప్పారు.

దేవకాంత బరువా, 17 మార్చి, 1950న "నీఫా" కొండతెగల నుండి టిబెట్ అధికారులు బలవంతంగా డబ్బు వసూలు చేస్తున్నారని 'నీఫా'లోని తవాంగ్ మఠానికి అస్సాం ప్రభుత్వం రు.5000లు ప్రతి సంవత్సరం చెల్లించుచున్నదని, టిబెట్ పరిపాలనలో వుందని, ఆ డబ్బులో అధిక భాగం లాసాలోని డ్రెఫంగ మఠానికి వెళ్ళుతున్నదని తెలిపారు. అంటె 1914 సిమ్లా వొప్పందానికి టిబెట్ కట్టుబడిలేదని, భూటానుకు తూర్పు ప్రాంతాన్ని తన అధీనంలో కొనసాగించుతుందని స్పష్టము.[1]

కరుణాకర్ గుప్తా ముగింపుగా యిలా వ్యాఖ్యానించారు. "లండన్, ఇండియా ఆఫీసు పత్రాలపై తాజా పరిశోధనలు, సిమ్లా 1913-14 సమావేశం సినో-టిబెట్ సరిహద్దు నిర్ణయానికి మాత్రమే జరిగిందనేది స్పష్టంచేశాయి. భారత వాయువ్యప్రాంత సరిహద్దు నిర్ణయానికి సంబంధించిన మాక్‌మాహన్ నివేదిక (మెమోరాండం)కు భారత ప్రభుత్వం ఆమోదంలేదు. చైనా రాటిఫై చేయుటకు నిరాకరించినందున సిమ్లా సమావేశం విఫలమైనదిగా భారత ప్రభుత్వం పరిగణించింది. టిబెట్‌తో భారత ప్రభుత్వం ద్వైపాక్షిక వొప్పందం చేసుకొనుటను, ఆంగ్లో-రష్యన్ కన్వెన్షన్‌లో నిషేధించు అంశాలున్నందున, టిబెట్ చైనా సార్వభౌమాధికారంలో వున్నందున చట్ట సమ్మతం కాదు. లండన్, ఇండియా ఆఫీసు పత్రాలపై జరిగిన తాజా పరిశోధనలు, సిమ్లా కన్వెన్షన్ సమాచారంపై, టిబెట్‌పై ఏట్చిన్స్‌ట్రీటీస్ వాల్యూం 14 అధికార ప్రామాణికంగా భారత ప్రభుత్వం ఆధారపడింది. అది 1938లో 1929లో అచ్చుయిదానిగా ప్రకటించబడిన 'ఫోర్జరీ' వాల్యూంగా, ఒరిజినల్ ప్రతులన్ని వుపయోగంనుండి వుపసంహరించుకొన బడినవని పరిశోధనలు రుజువు చేశాయి.[2] టిబెట్ సరిహద్దు మెక్ మాహన్ రేఖగా, చట్టబద్ధమైనదిగా ధృవీకరించుతు ఫోర్జరీ ఏట్చిన్స్‌ట్రీటీస్‌ను

1. గుప్తా, కరుణాకర్ (1982) - స్పాట్‌లైట్ ఆన్ చినో ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజి 41
2. గుప్తా, కరుణాకర్ (1982) - స్పాట్‌లైట్ ఆన్ చినో ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజి 62.

1938లోప్రకటించుటతో పాటు భారత సర్వేశాఖ మొట్టమొదటి సారిగా వాయువ్య సరిహద్దును హిమాలయ పర్వత శ్రేణి అగ్రభాగం గుండా పోయే రేఖగా చిత్రించే మ్యాపులను ముద్రించి పాత మ్యాపులను రద్దు చేసింది. న్యూఢిల్లీ దేశీయాంగ శాఖ, ఒలాఫ్ కెరో డిప్యూటి కార్యదర్శి చొరవతో యీపద్ధతుల ననుసరించింది. ఒలాఫ్‌కెరో, టిబెట్ ప్రభుత్వం మెక్‌మాహన్ రేఖను ఆమోదించునట్టు చేయుటకు చేసిన నిరవధిక ప్రయత్నాలు విఫలమయ్యాయి. బ్రిటిష్ ప్రత్యేక రాయబారులు బాసిల్‌గౌల్డ్, రాయ్ బహాదూర్ నోర్బు, ఎ.జె.హోప్‌కిన్స్‌లు ఇండియా ఆఫీసు లండన్‌కు పంపిన నివేదికలు దీనినే తెల్పుతున్నది. ఈ విధంగా స్వతంత్ర భారత దేశం వాయువ్య సరిహద్దు చిక్కు సమస్యలతో యేర్పడింది. భారత, బ్రిటిష్ ప్రభుత్వం 1943లో చైనా సార్వభౌమాధికారం నామ మాత్రం క్రింద టిబెట్ స్వాతంత్ర్యాన్ని యధాతథంగా గుర్తించమని అమెరికాను కోరింది, ఆ విధంగా పరోక్షంగా సిమ్లా కన్వెన్షన్‌కు చట్టబద్ధతను చేకూర్చుటకు బ్రిటన్ ప్రయత్నించింది. విదేశాలతో "రాయబారులను పరస్పరం మార్పిడి చేసుకొను హక్కును" టిబెట్‌కు కలుగుటకు అమెరికాను బ్రిటన్ మరీ మరీ కోరింది. చైనాలో టిబెట్ భాగమని తలంచుతున్నామని అమెరికా తిరస్కరించింది.[1]

ఇండియా-చైనా సహజ సరిహద్దుగా మెక్ మాహన్ రేఖను యెంచవచ్చు, అది దగ్గర దగ్గరగా హిమాలయ పర్వత శ్రేణి ఉన్నత రేఖగా వుంటుంది. భారత విదేశాంగ శాఖ కె.పి.యస్.మీనన్ పర్యవేక్షణలో భారత పాలనా యంత్రాంగాన్ని "నీఫా" ప్రాంతానికి విస్తరింపచేసింది. చైనా మ్యాపులు సరిహద్దును హిమాలయ పర్వత శ్రేణి పాదరేఖగా సూచించినప్పటికి 'నీఫా, ప్రాతాన్ని తమదిగా చెప్పివుండలేదు. ఈ ప్రాంతంలో టిబెట్‌పై చైనాకు గల సార్వభౌమాధికారాన్ని అనుసరించి, వాలాంగ్,తవాంగ్‌లు తమవని ప్రకటించారు. తవాంగ్ టిబెట్‌లోని సోనా జిల్లాలోనిది, తవాంగ్ మహామఠంలోని వందలకొలది భౌద్ధ సన్యాసులు, లాసాలోని డ్రెఫంగ్ ఆరామానికి చెందిన వారు. భూటాన్‌కు తూర్పు వున్న తవాంగ్ ప్రాంతం, ఇండియాకు వ్యూహాత్మక ప్రాముఖ్యత గల ముఖ్య ప్రాంతం. తవాంగ్ ప్రాంతం టిబెటియన్.పీఠభూమినుండి అస్సాం మైదాన ప్రాంతం వరకు అంటే ఉదాల్‌గిరి ఉత్తరానగల ఇండియా, టిబెట్ రహదారి వరకు వ్యాపించివుంది. క్రమేణా, బ్రిటీష్ ఇండియా ప్రభుత్వం, 1943లో వాలాంగును తమ పరిపాలనా ఆధ్వర్యంలోనికి తీసుకొని పాలనా ప్రాంతాన్ని పర్వతశ్రేణి పాదాల నుండి ఆటవిక తెగల ఉత్తర ప్రాంతానికి విస్తరింప చేసారు. తదనంతర కాలంలో బ్రిటన్, టిబెట్‌ను తన ప్రభావంలో "బఫర్‌దేశంగా" రూపొందించ నెంచి, తవాంగ్‌కు తమ పాలనా యంత్రాంగాన్ని విస్తరించక మాని వేశారు. మెక్ మాహన్ రేఖ ప్రాంతంలోని తవాంగ్‌కు చేరలేదు. ఇదీ నేపధ్యం, స్వతంత్ర భారతానికి లభించిన వారసత్వము.

స్వాతంత్ర్యానంతరం నెహ్రూకు టిబెట్, చైనా సమస్యలపై ముఖ్య సలహాదురు కె.యం.పణిక్కర్, ప్రజా చైనాలో ప్రధమ భారత రాయబారి, టిబెట్‌కు భారతదేశ ప్రభావంలోని

1. *గుప్తా, కరుణాకర్ (1982) - స్పాట్‌లైట్ ఆన్ చినో ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజి 68.*

దానిగా నెంచే "బ్రిటిష్ విధానం" కొనసాగరాదనే వైఖరి చేబట్టారు. చైనా కొరియా యుద్ధంలో మునిగిపోయి వున్నపుడు ఫిబ్రవరి 1951లో తవాంగ్ పరిపాలనను భారతదేశం, మీనన్ సలహాపై చేబట్టింది. మరోవైపు ఐక్యరాజ్య సమితిలో చైనా సముచిత స్థానాన్ని పురరుద్ధరించాలని ఇండియా సమితిలో ఆందోళన ప్రారంభించి, ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని కూడాగట్ట నారంభించింది. అంచేతనే చైనాఎట్టి అసంతృప్తి లేకుండా తవాంగుకు పాలనా యంత్రాంగాన్ని భారత దేశం విస్తరించగలిగింది. అయినా 1959 వరకూ 'నేఫా' ఏజన్సీ ప్రాంతాలకు సరియైన బాటలు, రహదారుల సౌకర్యాలు లేనందున పాలనా యంత్రాంగం పూర్తిగా విస్తరించలేదు. చైనా నుండి ఎట్టి అసమ్మతి ప్రదర్శనలేదు. టిబెట్‌లో తిరుగుబాటుతో ఇండియా చైనాల మధ్య మెక్ మాహన్ రేఖా ప్రాంతాలలో సంఘర్షణలు ప్రారంభమయ్యాయి.

పశ్చిమ సరిహద్దు, లడక్ ప్రాంత సమస్యలనుకొన్నింటిని తెలుసుకొన వలసి యున్నది. డా॥ గుప్తా అధికార మార్పు జరుగనప్పటికి కూడా బ్రిటిష్ ప్రభుత్వం పశ్చిమ సరిహద్దు ప్రాంతం నిర్ణయం జరుగకుండా వదలి వేసిందని, తెలియజేశారు. అప్పటినుండి 1954 వరకు సరిహద్దు సమస్య ఎట్టి అధికార అవగాహన స్పష్టంగాలేదు. అయితే 1954లో టిబెట్‌లో చైనా ప్రజారిపబ్లిక్ తన అధికారాన్ని సుస్థిరంచేయు ప్రయత్నం చేయుటతో సంఘర్షణ పరిస్థితులు ఏర్పడినవి. అదే కాలంలో భారత-పాకిస్థాన్ సపంబంధాలు జటిలమయ్యాయి. అంచేత ఇండియా నూతన విధానాన్ని చేబట్టింది. కాశ్మీర్ ఉత్తర, వాయువ్య సరిహద్దుకమిటీ, అధికారికంగా సరిహద్దులు సూచించుతు నూతన మ్యాపులను ప్రకటించింది. కుయెన్‌లున్ పర్వతశ్రేణి ఉన్నత రేఖ సరిహద్దుగా లడక్ ప్రాంతాన్ని ఇండియాలో భాగంగా సూచించింది. అయితే అప్పుడు ఆక్సాయ్‌చిన్ ప్రాంతమంతా చైనా స్వాధీనంలో వాస్తవంగా వున్నది. ఈనూతన సరిహద్దు రేఖ 1897లోసర్ జాన్ ఆర్డాగ్ ప్రతిపాదించిన రేఖకు దగ్గరి దగ్గరిగా పోలివున్నది. అయితే సైనికాధికారులు దాని రక్షణ కష్టతరమైనదని తెలుపుటతో ఆ ప్రతిపాదన వదలి వేయబడింది. నెహ్రూ ప్రభుత్వం అదే విధంగా విస్తరించబడిన సరిహద్దు రేఖను మ్యాపులలో ఎందుకు చూచించినదో అర్థం కాకుండా వుంది. ఈ మ్యాపులు ప్రాతిపదికగా చైనానుసంభాషణలలో ఎదుర్కొనుట, భారత ప్రభుత్వపు ఉద్దేశ్యంగా కన్పడుతుందని డా॥ గుప్తా అవగాహనగా వుంది.

ఏది అధికార మ్యాపు, ముఖ్యంగా సర్ జాన్ ఆర్డాగ్ పురోగమన రేఖను గీయుటకు, ఆధారం చేసుకొన్న కర్జన్ మ్యాపును చూచిన కార్కొరం పర్వత శ్రేణియే గాని, వివాదాస్పద ప్రాంతంలో నీటి వాలు రేఖగా అనుకొనేది సరిహద్దు రేఖ కాదని స్పష్టమగుతుంది.

సరిహద్దు సమస్యపై డా॥ గుప్త స్వాతంత్ర్యానికి పూర్వపు అధికార సమాచారం నిరవధికంగా "రేఖ నిర్వచించ"బడలేదనే స్పష్టం చేశారు. కాశ్మీర్ సంస్థానపు ఉత్తర తూర్పు సరిహద్దు రేఖలు నిర్వచించబడలేదని ఏట్చిన్సన్‌ట్రీటీస్ 12వ వాల్యూం లడక్‌తో సహా జరుగలేదని స్పష్టం చేస్తున్నది. ఇది 1954 పూర్వపు మ్యాపులన్నిటిని పోలియున్నది.

సరిహద్దు నిర్వచించనిదిగా వుంది. బ్రిటిష్ హిందూస్థాన్ 1862 సర్వే మ్యాపు కార్ కోరం పర్వతశ్రేణి సరిహద్దుగా సూచించుచున్నది. హేవార్డ్ 1870 తూర్పు టర్కోస్తాన్ స్కెచ్ భారతదేశపు ఉత్తరభాగము 1871లో రాబర్ట్ షా గీచిన స్కెచ్ మ్యాపులు దగ్గరి దగ్గరి సరిహద్దులను 1862 మ్యాపులోవలెనే వున్నవి. హేవార్డ్, షా యిద్దరూ బ్రిటీష్ అధికారులు గానే వాస్తవంగా సర్వేలో పాల్గొన్నారు. ఆయా ప్రాంతాను స్వయంగా తెలిసినవారు. హేవార్డ్, రాయల్ జాగ్రఫికల్ సొసైటి జర్నల్వా. 11,170లో ఒక వ్యాసం వ్రాస్తూ, కార్కోరం పర్వత ప్రధాన శ్రేణి సరిహద్దుగా స్పష్టంగా పేర్కొన్నారు. ఈ పర్వత శ్రేణినే లడక్ సరిహద్దుగా ఇంపీరియల్ గెజిట్ ఆఫ్ ఇండియాలోని వ్యాసంలో సూచించిన దానినే, 1930లో సైమన్ కమిషన్ తన నివేదికకు, ఆ మ్యాపును అనుబంధంగా చేర్చింది.[1]

బ్రిటిష్ అధికారులు సర్ జాన్ ఆర్డాగ్, సర్క్లాడెమాగ్డొనాల్డ్ తదనంతరం సరిహద్దు మార్పులు కొన్ని సూచించినా చైనా తిరస్కరించింది. మరో రెండు ప్రతిపాదనలు 1912,1915లలో వచ్చినా లండన్ తిరస్కరించింది. ఈ ప్రతిపాదనలలో మాగ్డొనాల్డ్ సూచనలను ప్రాతిపదికగా 26 సెప్టెంబర్ 1959లో నెహ్రూ, చైనా ప్రధాని చౌయెన్లైకు వ్రాసిన లేఖలో తన వాదనను బలపరుచుతూ పేర్కొన్నారు. నెహ్రూకు తప్పుడు సమాచారాన్ని అందించి, ఆ విధంగా నెహ్రూ రాజీలేని విధానాన్ని అవలంభించుటకు, విదేశాంగ శాఖలోని చారిత్రిక వుపశాఖ భాధ్యత వహించవలసి వుంటుందని గుప్తా అభిప్రాయం.[2]

డా॥గుప్తా పశ్చిమ, ఈశాన్య సరిహద్దులకు సంబంధించి మనవిగా మన రాజకీయ విధానాన్ని రూపొందించే వారు చెప్పేదానిని ఏ విధంగాను సమర్థించజాలమని, ఎట్టి సందేహం, అస్పష్టత లేకుండా రుజువు చేశారు" (అని జాతీయ ఆర్చేవ్స్ రిటైర్డ్ డిప్యూటీ డైరెక్టరు సౌరిన్రాయ్ వుపోద్ఘాతంలో పేర్కొన్నారు.)

## భారత ప్రభుత్వంలో అభిప్రాయ భేధాలు

భారత ప్రభుత్వం అక్టోబరు-నవంబరు 1950లో టిబెట్ ప్రభుత్వం 1912నుండి యధాతధంగా స్వాతంత్ర్యాన్ని అనుభవించుచున్నదనే అంశంపై తీవ్ర అభిప్రాయ బేధాలు వచ్చాయి. ఉపప్రధాని సర్ధార్ వల్లభాయి పటేల్ టిబెట్లోనికి భారత సైన్యాన్ని పంపాలని కొంతమంది కాబినెట్ మంత్రులు ప్రతిపాదించగా, విదేశాంగ శాఖలోని కొందరు బలపరచారు. కిని సర్వసైన్యాధ్యక్షడు, జనరల్ కరియప్ప గట్టిగా వ్యతిరేకించుటతో విరమించబడింది. ఇదే విషయాన్ని "చైనీస్ బిట్రేయల్" అనే పుస్తకంలో సైనిక రహస్య శాఖాధిపతి బి.యన్.మల్లిక్ వ్రాశారు. ఐక్యరాజ్య సమితికి చైనా దురాక్రమణ చేసిందని ఫిర్యాదు చేయమని, భారత ప్రభుత్వ వర్గంలోని వుద్యోగులు కొందరు టిబెట్ ప్రభుత్వానికి అంతరంగిక సలహా 7 నవంబరు 1950న ఇచ్చారు. నవంబరు 15 జనరల్ కమిటీలో యీ ప్రశ్న వుదయించినపుడు జనరల్ అసెంబ్లీ ఎజెండాలో జేర్చుట నిరాకరించబడింది.

1. *గుప్తా - కరుణాకర్ 1982 స్పాట్లైట్ ఆన్ చినో-ఇండియన్ ఫ్లాంటియర్స్ - పేజి.6.*
2. *గుప్తా - కరుణాకర్ 1982 స్పాట్లైట్ ఆన్ చినో-ఇండియన్ ఫ్లాంటియర్స్ - పేజి.6.*

కమిటీలోని భారత ప్రతినిధి, శాంతియుతంగా పరిష్కారమగుతుందని, టిబెట్ స్వపరిపాలన రక్షింపబడుతుందని, అందుకు జనరల్ అసెంబ్లీ యీ సమస్యను చర్చించ కుండా వివరింపజేయుట మంచి మార్గమని అన్నారు. అగ్రరాజ్యాల నుండి సైనిక రాయబార మద్దతురాకపోవుటతో 21 డిశెంబరు 1950న చైనా సైన్యాల దాడి నుండి రక్షణకు లాసా నగరాన్ని విడిచి, భారత సరిహద్దు సమీపంలోని యూటుంగు చేరాడు దలైలామా. భారత ప్రభుత్వాన్ని రాజకీయ ఆశ్రయాన్ని కోరుతు లేఖ వ్రాసాడు. అయితే కె.యం.ఫణికర్ సలహాపై భారత ప్రభుత్వం నిరాకరించింది. సర్దార్ పటేలు 7 నవంబరు 1950న టిబెట్‌లో సైనిక ప్రమేయం అవసరమని నెహ్రూకు రహస్య లేఖ వ్రాసారు. పటేలు నవంబరు 1950లో టిబెట్ సమస్యపై ప్రపంచ యుద్ధం వచ్చి యుండేదని బహిరంగ ప్రకటన చేశారు. మంత్రి వర్గంలో తీవ్ర బేధాభిప్రాయాలుండటంతో పార్లమెంటు సభ్యులలో విశ్వాసం పెంపొందించుటకు "మాక్‌మాహన్ రేఖ మన స్పష్టమైన సరిహద్దు"అని "లడక్ నుండి నేపాల్ వరకు ఎంతో కాలం నుండి సాంప్రదాయంగా వుపయోగంలో వున్నది, సరిహద్దు అని, 20 నవంబరు 1950న పార్లమెంటులో నెహ్రూ తెలిపారు. ఈ సరిహద్దును టిబెట్ ప్రభుత్వం ఆమోదించిందాయని ఒక సభ్యుడు ప్రశ్నించగా, కొన్ని భాగాలను ఆమోదించలేదన్నారు. తిరిగి 6 డిశెంబరు 1950న భారత దేశానికి సాంప్రదాయకంగా ఉత్తర సరిహద్దుగా హిమాలయ పర్వతాలున్నవని, నేపాలు ఆ పర్వతాలకు దక్షిణముగా వున్నందున నేపాలు రక్షణకు ప్రమాదం కలిగితే అది భారత రక్షణకు కలిగిన ప్రమాదంగా పరిగణించబడుతుందని, మార్చి 17, 1950న చేసిన ప్రకటనను పునరుద్ఘాటించారు.[1]

ఇండియా బర్మా రెండు కమ్యూనిస్టేతర దేశాలు మాత్రమే 1 ఫిబ్రవరి 1951న చైనాను కొరియాలో దురాక్రమణ దారుగా, అమెరికా ప్రతిపాదించిన తీర్మానాన్ని ఐక్యరాజ్యసమితిలో వ్యతిరేకించాయి. ఫిబ్రవరి 12న నెహ్రూ పార్లమెంటులో "చైనా టిబెట్ విధానం మనకు కష్టం కలిగించినా, ప్రజా చైనాతోస్నేహ సంబంధాలను పెంపొందించాలనే మన విధానంపై దాని ప్రభావం వుండదని" పార్లమెంటులో చెప్పారు. ఇంకా "నేడు చైనాతో మన సంబంధాలు స్నేహ పూర్వకంగా వుండుటను, నేను సంతోషిస్తున్నానని" అన్నారు.

స్వతంత్ర భారత ప్రధమ విదేశాంగ జనరల్ సెక్రటరీ జి.యస్.బాజ్‌పాయ్ మే 1952లో వుద్యోగ విరమణానంతరం బొంబాయి గవర్నరుగా నియమికానంతరం మెక్ మాహన్ రేఖగా సరిహద్దు విషయమై భారత దేశం చైనాతో చొరవ తీసుకొనాలని, విదేశాంగ శాఖకు సూచించారు. లేఖ పూర్వకంగానని నెవెల్లి మాక్స్‌వెల్ వెలుగులోనికి తెచ్చారు. బ్రిటిష్ ప్రభుత్వం వదిలి వెళ్ళిన "గాయాలలో" యిది వొకటని దానిని రూపుమాపుటకు ప్రయత్నించాలని వ్రాసినట్లు కూడ తెలిపారు. ఆ సమయంలో ఇండియాలో వున్న కె.యం. ఫణికరు భారత చైనా రాయబారి నెహ్రూతో సంప్రదింపులు జరుపుతున్నారు. బాజ్‌పాయ్‌కి తదనంతరం సమాధానం వ్రాసినట్లు తెలుస్తున్నది. ప్రధాన మంత్రి ఇండియా ప్రయోజనాల దృష్ట్యా తనేయీ సమస్యను చైనాతో లేవనెత్తుట మంచిది కాదనేఅభిప్రాయంవున్నట్లు

1. గుప్తా - కరుణాకర్ 1982 స్పాట్‌లైట్ ఆన్ చినో-ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజి.46.

తెలిపారు. "ఇండియా నిర్ద్వంధంగా మెక్‌మోహన్ రేఖ సరిహద్దుగా ప్రకటించియున్నందున, చైనా యిప్పుడు యీ సమస్యను లేవనెత్తవలసి వుంటుంది. మనం లేవనెత్తిన టిబెట్‌తో మనం సంతకాలు చేసి దానిని చైనా వొప్పుకొనకుంటే సంప్రదింపుల ప్రతిపాదన వస్తుంది. గతంలోని చైనా ప్రభుత్వాలన్ని ఇండో-టిబెట్ వొప్పందం తిరస్కరించబడి వున్నందున చైనా దానికి బద్దులం కామని అంటుంది. అప్పుడు రెండవ ప్రత్యామ్నాయం ముందుకొస్తుంది. అది మనకు అననుకూలం" అనే నెహ్రూ అభిప్రాయం తెలియజేయబడింది.[1]

అట్లుగాక "చైనా లేవనెత్తిన సమస్యను పునర్విచారించుటకు మనం నేరుగా తిరస్కరించవచ్చును" అని ఫణికరు "ఆవిధంగా ప్రధాని మెక్‌మోహన్ రేఖ సరిహద్దుపై చేసిన బహిరంగ ప్రకటననే బలపరచి, చర్చించవలసినది లేదని" చెప్పుట జరిగిందని వివరించారు. ఉద్యోగవిరమణతో ఫణికరు పెకింగ్ నుండి వచ్చిన తరువాత గైయాంట్సె, యాటుంగులలో భారత సైనిక దళాలను మార్చే ప్రయత్నంలో నూతన దళాలను పంపినపుడు, గార్టాక్‌లోని ఇండియా వ్యాపార ఏజెంటు వైర్లెసు పరికరాలను చైనా అధికారులు స్వాధీనం చేసుకొనుటయేగాక, సిక్కింలోని భారత రాయబారి అధికారి, చైనా 'వీసా' పత్రాలు లేకుండా లాసా ప్రవేశానికి అంగీకరించలేదు అని "మై యియర్సు విత్ నెహ్రూ" అనే పుస్తకంలో బి.యన్.మల్లిక్ సైనిక రహస్య శాఖ అధికారి వ్రాసారు.

## ప్రభుత్వ చారిత్రిక శాఖ తప్పుడు సమాచారాన్ని యిచ్చుట

అంతర్జాతీయ అధ్యయన భారత కేంద్రం న్యూఢిల్లీలో 13 డిశెంబరు 1969లో భారత దేశం పశ్చిమోత్తర "అక్సాయ్ చిన్" వివాద ప్రాంతంలో చైనా వాదాన్ని అంగీకరించితే, మెక్ మోహన్ రేఖను చైనా గుర్తింస్తుందని చౌయెన్‌లై చేసిన ప్రతిపాదనపై బ్రిటిష్ పాలనా కాలంనుండి భారత విదేశ రాయబారులలో సరిహద్దు సమస్య బాగా తెలిసిన కె.పి.యస్. మీనన్ యిలా అన్నారు. "నేను వివాదాస్పదం" అనుటకు మ్యాపులు, సంధులు, వొప్పందాలు తదితర పత్రాలపై ఆధారపడిన యిరుపక్షాల సరిహద్దు వాదనలు నిస్సందేహంగా సంప్రదింపుల అవసరంలేనంత స్పష్టంగా లేవు. నీటి వాలు సిద్ధాంతంపై యితర ప్రాంతాల విషయంలో మనం ఎక్కువగా ఆధారపడినది, అక్సాయ్‌చిన ప్రాంతంలో మనకుఅనుకూలంగాలేదు. అంతే గాక, అక్సాయ్‌చిన్ మనకు అంత ముఖ్యమైనది కాదని మనం మరువరాదు, చైనా వారికి అతి ముఖ్యమైనది, కారణం చారిత్రికంగా టిబెట్, సింకియాంగ్ రెండు అశాంతి ప్రదేశాలను కలుపుతూవుంది" అని "ది సిక్టిస్ ఇన్ రెట్రోస్పెక్ట్" అనే పుస్తకంలో వ్రాసారు. అక్సాయ్‌చిన్ ప్రాంతం వివాదాస్పద ప్రాంతమని ఆగస్టు-సెప్టెంబరు 1959లో నెహ్రూ పార్లమెంటులో అనేక పర్యాయములు అంగీకరించారు. ఇండియా రాయబారి జి.పార్థసారధి 8 నవంబరు 1958లో చైనా విదేశాంగ శాఖ ఉపమంత్రికి సమర్పించిన అధికార "నోట్"లో అక్సాయ్ చిన్‌ను గురించి యిలా పేర్కొనబడింది. " ఇప్పుడుచైనా ప్రభుత్వం కూడా యీ ప్రాంతాన్ని తమదిగా చెప్పుట స్పష్టం. ఆ ప్రత్యేక

---

*1. గుప్తా - కరుణాకర్ 1982 స్పాట్‌లైట్ ఆన్ చినో-ఇండియన్ ఫ్లాంటియర్స్ - పేజి.51*

ప్రాంతం ఇండియాదా, చైనాదా అనే వివాదాస్పద ప్రశ్న" (శ్వేతపత్రం 1954-59, పే.29). ఇది కూడా ఆక్సాయ్ చిన్ ప్రాంతం, వివాదాస్పద నైజాన్ని కలిగి వుందని అంగీకరించుటయే అగుతుంది.[1]

"భారత విదేశాంగ మంత్రిత్వ చారిత్రికవిభాగం పశ్చిమ సరిహద్దులో, బ్రిటీష్ ప్రభుత్వం నుండి వారసత్వంగా లభించిన వాటిని మనవిగా ప్రభుత్వానికి తప్పుడు సమాచారాన్ని యిచ్చింది. తూర్పు ప్రాంతానికి సంబంధించి కూడ, ఏట్చిన్స్ ట్రీటీస్ వా14, 1929 టిబెట్‌కు సంబంధించినది పోర్జరీదని, 1938లో ఒలాఫ్ కెరోచే అల్లబడినదని తప్పుడుగా సిమ్లా సమావేశంలో చినో టిబెట్‌ను, చినో-ఇండియన్ సరిహద్దులుగ మెక్‌మాహన్ రేఖకు చట్టబద్ధతను కల్పించుటకు, ధృవపరుచుటకు సృష్టించబడినదని పరిశోధించి తెలియజేయుటలో విఫలమైంది. ఏట్చిన్స్ ట్రీటీస్‌ను పరిశీలించుటలో కొంత జాగ్రత్త వహించిన, కనీసం అస్సాంలోని తవాంగ్ ఉత్తర ప్రాంతం బ్రిటిష్ పాలనా కాలంలో టిబెట్ ప్రభుత్వ పాలన క్రింది వున్నదని స్పష్టంగా చూడగలిగేవారు. పశ్చిమ ప్రాంతం విషయంలో కాశ్మీర్‌కు సంబంధించిన, ఏట్చిన్స్‌ట్రీటీస్ వా.12, భాగం 1 పే.5, 1931ను పూర్తిగ వదిలి వేశారు. అందులో "కాశ్మీర్ తూర్పు, ఉత్తర సరిహద్దులు ఇంకా నిర్వచించబడలేదని" స్పష్టంగా వుంది. పెకింగ్‌లోని బ్రిటిష్ మంత్రి సి.యం.మాక్డొనాల్డ్ 14 మార్చి 1899లో చైనా విదేశాంగ మంత్రి సుంగ్లియోమెన్‌కు వ్రాసిన లేఖలోని విషయాలను, భారత విదేశాంగ మంత్రిత్వ చారిత్రిక విభాగం వక్రీకరించి తరువాత మకార్టెని-మాక్డొనాల్డ్ రేఖగా చెప్పబడే కాశ్మీర్ సరిహద్దు ప్రతిపాదనను తెలిపింది. కాశ్మీర్ సరిహద్దుకు సంబంధించిన ఈ అతి ముఖ్య పత్రాన్ని భారత ప్రభుత్వం 1959-61లలో ఈ క్రింది అధికార వుత్తర ప్రత్యుత్తరాలలో తప్పుడు వుదహరింపులుగా చోటు చేసుకొన్నవి. 1.నెహ్రూ 26 సెప్టెంబరు 1959లో చౌయెన్‌లైకు వ్రాసిన వుత్తరము 2. టైమ్సు (లండన్)లో "చైనా-ఇండియా సరిహద్దు వివాదం" పై భారత ప్రభుత్వ తాత్కాలిక హైకమీషనర్ యం.వి. హుస్సేన్ వ్రాసిన రచన 3. భారత ప్రభుత్వ, చైనా ప్రజా రిపబ్లిక్ ప్రభుత్వ అధికారుల సరిహద్దు సమస్యలపై (భారతప్రభుత్వ విదేశాంగ మంత్రాలయం, ఫిబ్రవరి 1961 ఇండియా అధికారుల నివేదిక పే 55.) దీనినే స్పష్టం చేస్తున్నది.[2]

కార్కోరం లోయ ప్రాంతపు తూర్పున జాన్ ఆర్డాగ్ రేఖను ప్రాతిపదికగా తీసుకొని భారత విదేశాంగ మంత్రిత్వ చారిత్రిక విభాగం కూడ 1954 జూలైలో ప్రకటించిన భారత సర్వే మ్యాపులలో తప్పుడుగా సూచించుటకు బాధ్యత వహించవలసి వుంటుంది. ఇండియాలో హిందూ కుష్ పర్వత శ్రేణి నీటి వాలును, చైనాలోని ఖోటాన్ పర్వత శ్రేణి మధ్య నీటి వాలును సూచించుటలో యీ పొరపాటు కన్పించుచున్నది. సంబంధిత అధికారులు, ఇంపీరియల్ గెజెట్ ఆఫ్ ఇండియా (1908) వాల్యూం 15పే.48 జాగ్రత్తగా పరిశీలించినచో, ఆ ప్రాంత నీటి వాలును గురించి యీ క్రింది విధంగా పేర్కొనుటను

---

*1. గుప్తా - కరుణాకర్ 1982 స్పాట్‌లైట్ ఆన్ చినో-ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజి.72.*

*2. గుప్తా - కరుణాకర్ 1982 స్పాట్‌లైట్ ఆన్ చినో-ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజి.72-73.*

చూడగలిగేవారు "కార్కోరం పర్వత శ్రేణి చాలా సంక్లిష్ట నైజాన్ని కలిగి వుంది. మొత్తంగా చెప్పాలంటే, హిందూ కుష్ పర్వత శ్రేణి కొనసాగింపుకు కేంద్ర ఆసియా మురుగు హిందూ మహాసముద్రంలోనికి పారే నదులకు మధ్యగల నీటి వాలు"గ పేర్కొనబడింది.

భారత ప్రభుత్వ విదేశాంగ మంత్రిత్వశాఖ చారిత్రిక విభాగం అనుముఖ వ్యతిరేక పాత్ర. ప్రభుత్వానికి, ప్రజలకు సరిహద్దు వాస్తవ విషయాల గురించి తప్పుడు సమాచారాన్ని యిచ్చుట వలనే చినో-ఇండియన్ సరిహద్దు సమస్య అపరిష్కృతంగా కొనసాగుటకు ప్రధాన కారణము. "అధికారతత్వం అగ్నిజ్వాల వంటిది-సేవకుని వలె అత్యంత వుపయోగకారి, అదే యాజమాన్యం వహించితే వినాశకరమైనది" అన్న రాంశేమ్యూరే ప్రవచనం విదేశాంగ మంత్రిత్వ చారిత్రిక విభాగానికి చెందిన అధికారులకు వర్తిస్తుంది. నెహ్రూ చైనా విధానాన్ని రాయబార సంబంధాలను పద్ధతులను, రాజీ విధానంలో సరిహద్దు సమస్య పరిష్కరించు విధానాన్ని భగ్నం చేయగలిగారు.

ఇండియా-చైనా సరిహద్దు సమస్యలకు సంభంధించిన 1914 నుండి 1954 జూన్ వరకు గల అధికార నిర్ణయ పత్రాలను, స్వతంత్ర పరిశోధకులకు దూరంగా వుంచాలనే అధికారుల నిర్ణయం నిజమైన బ్రిటిష్ పాలన వారసత్వాన్ని, చినో-ఇండియన్ సరిహద్దు చరిత్రను మన నుండి దాచి వేసి తెరవేయుటకు నేటి వరకు వారికి సహాయపడింది.[1]

చరిత్రను వక్రీకరించుట, వాస్తవ విషయాలను దాచివేయుట స్వతంత్ర చారిత్రిక పరిశోధకులకు అధికార పత్రాలను అందకుండా చేయుట చినో-ఇండియన్ సరిహద్దు సమస్యపై సంఘర్షణలకు చివరకు యుద్ధానికి కారణమగుటతో పాటు, అధికా వర్గాలు కొంతవరకు నేరుగా " జాతీయ తత్వ" వుద్రేకాలను రెచ్చకొట్టుట కూడా అంతటి కారణమైంది.

కరుణాకర్ గుప్తా తన రచనలలో "అధికార వక్రీకరణలను బహిరంగ పరచుట, సామ్రాజ్య వాద బ్రిటిష్ ఇండియా విధానాలు, స్వతంత్ర భారత దేశ ప్రభుత్వపు కొన్నివర్గాలలోని "జాతీయ తత్వాభిప్రాయాలు ఇండియా-చైనా యుద్ధానికి మౌలిక కారణాలుగ కన్పించుతున్నవి. ఈ విషయంలో "విదేశాంగ మంత్రిత్వశాఖ చారిత్రిక విభాగపు పాత్రను మరింతగా పరిశోధకులు అధ్యయనం చేయవలసి వుంది" అని వివరించారు.

# 9

# సమీక్ష - కొన్ని ముఖ్యాంశాలు

## (1)

ప్రపంచ యుద్ధానంతర పునర్నిర్మాణం జర్మనీ, జపానులలో విజయవంతమై పారిశ్రామిక వుత్పత్తుల ఎగుమతులలో అమెరికా తరువాత ద్వితీయ స్థానానికి చేరుకొన్నవి. బ్రిటన్, ఫ్రాన్స్, హాలెండు, బెల్జియంలు శాశ్వతంగా వలసలను కోల్పోయి. పారిశ్రామిక ఉత్పత్తులలో వెనుకబడిపోయాయి. ప్రపంచ వలస సామ్రాజ్యవాద పతన వేగోధృతి

1. గుప్తా - కరుణాకర్ 1982 స్పాట్‌లైట్ ఆన్ చినో-ఇండియన్ ఫ్రాంటియర్స్ - పేజి. 73-74.

ఎక్కువైంది. ఫలితంగా ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆధిక్యత నిర్ణయాత్మక పాత్రలతో ప్రపంచ సామ్రాజ్యవాదశక్తులు తాత్కాలికంగా, మరో ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించగల శక్తి కోల్పోయినవి. సామ్రాజ్య వాదం వలస దోపిడిని నూతన రూపాలలో కొనసాగిస్తున్నా, వలస విముక్తి పోరాటాలు మరోవైపున విజృంభించుతున్నవి. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం, యీ యుగాన్ని పెట్టుబడి దారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన యుగంగా వివరించింది. ప్రపంచ చరిత్రలో 1960 దశకం ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో సామ్రాజ్యవాద వలస విధానము శిధిలమైన దశగా లిఖించబడుతుంది.

భారత-చైనా సంబంధాలలో 1960 దశకం అవాంఛనీయ మలుపుగా నెంచాలి. చైనా జాతీయ తత్వ ప్రభావానికి లోనై శాంతి విదేశాంగ విధానం, అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యతా విధానాన్ని విడనాడి, అంతర్గతంగా "ప్రజాకమ్యూనులు" "పెద్దగా దుముకుట" విధానాలతో ప్రతీఘాతక విప్లవ శక్తుల దాడికి అవకాశాలేర్పడి అంతర్గత పోరాటాలకు, ఆర్థిక సంక్షోభాలకు గురై తీవ్ర అతివాద పెడ మార్గంలోనికి దిగజారింది. పారిశ్రామిక, సామాజికాభివృద్ధి కుంటుబడింది.

భారతదేశం స్వాతంత్రం పొందుటతో సామ్రాజ్యవాదపు ఆంగ్ల భౌతిక ఉత్పత్తి సాధనాలను భారత ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాన్ని చారిత్రిక వారసత్వంగా పొందింది. నూతన జాతీయ ప్రభుత్వపు ఆస్తి అయింది. ఈ విధంగా భారత ప్రభుత్వ పెట్టుబడి నిర్మాణం, ఉత్పత్తి పునాది ఏర్పడి, వివిధ ఆర్థిక రంగాలలోని పరిశ్రమలను జాతీయం చేయుట ద్వారా విస్తృత పరచబడింది. అత్యంత బలహీన వ్యవసాయ, ఆర్థికాభివృద్ధి గల దేశంలో ప్రభుత్వ పెట్టుబడి దారి విధానాభివృద్ధి కొనసాగింది. ఇది ప్రపంచ సోషలిస్టు రాజ్యాల ఆర్థిక వ్యవస్థ బలపడుతున్న యుగంలోజరిగింది. భారత రాజకీయ స్వాతంత్ర్య పరిరక్షణ జాతీయ ధృక్పధంలో బలపడి, పారిశ్రామికీకరణ ద్వారా ఆర్థిక స్వాతంత్రాన్ని సంపాదించే ప్రయత్నం కొనసాగింది. దీనికనుగుణంగా శాంతి అలీన విదేశాంగ విధానాన్ని అనుసరిస్తున్నది. నూతనంగా విముక్తి చెందిన వెనుకబడిన దేశాలలో స్థూలంగా సామ్రాజ్యవాదుల పరిశ్రమలను జాతీయం చేయుట ద్వారా ప్రభుత్వ పెట్టుబడి దారి విధానాభివృద్ధి సాధారణ పంథా అయింది.

భారత బడా బూర్జువా వర్గం ఆధిక్యత, ఆధిపత్యం కలిగి వున్నా విదేశీపెట్టుబడిలో విస్తృత సహకారాన్ని నెరపుట ప్రత్యేక లక్షణంగా కలిగివుంది. అంతేగాక యీ బడా బూర్జువా వర్గాల ప్రయోజనాలు, వ్యూడలు భూస్వామ్య వర్గాల ప్రయోజనాలతో సంలీనం అగుటతో ఆర్థికంగా, రాజకీయంగా అత్యంత బలమైనది. కరుడు గట్టిన అత్యంత అభివృద్ధి నిరోధకమైనదిగా అభివృద్ధి చెందింది. అయినా సామ్రాజ్యవాదం జాతీయ బూర్జువా వర్గాల మధ్యగల సహజ వైరుధ్యం సమసిపోనందున వ్యూహంలో దాని ప్రాముఖ్యత పోలేదు. అదే కాలంలో వ్యాపారం, దళారి కమిషన్ బూర్జువా వర్గంలో ప్రధానాంశంగా వున్నస్థితికి క్రమేణా పారిశ్రామిక అభివృద్ధితోపాటు వ్యాపార పారిశ్రామిక బూర్జువా వర్గ లక్షణాలను సంతరించుకొనుటతో జాతీయ బూర్జువా సహజలక్షణాలను కొన్నింటిని పొందగలిగింది.

ఇంకా వలస సామ్రాజ్య వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక లక్షణాలు కొన్ని కలిగి వుంది. అది కూడా స్వవర్గ ప్రయోజనాలకు పరిమితులకులోనై వున్నది. ఊగిసలాట, సహజలక్షణంగా కూడా కలిగియున్నది.

## (2)

టిబెట్‌లో జరిగిన తిరుగుబాటుకు మూలం, భూస్వామ్య వ్యవస్థపై నిర్మించబడిన వ్యవసాయ బానిస సమాజ నిర్మాణంలో వుంది. అత్యధిక భాగం భూమిని పశుసంపద అంతా బానిస యజమానులు, మఠాధిపతులు, అధికార వర్గం అను మూడు రకాల భూస్వాముల చేతులో వుంది. మధ్య యుగాల హింసా, దౌర్జనాలు బానిసలపై సర్వసాధారణము. సమాజ పురోగమనం స్తంభించింది. ఆర్థిక, సాంస్కృతిక పురోగమనం, జనాభా అభివృద్ధి క్షీణించింది, మానవీయత పేరుకు లేకుండా అంతరించింది.

టిబెట్ 1951లో శాంతియుతంగా విముక్తి చేయబడి అభివృద్ధి కార్యక్రమాలు చేబట్టబడినవి. ప్రజాస్వామ్య సంస్కరణలు వెట్టి చాకిరి, ఉచిత సేవలు రద్దు చేయబడి కౌలు తగ్గింపు, దున్నేవానికే పంట వంటి సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. బానిస యజమానులైన ప్రభువులు, లామాలు, ప్రభుత్వోద్యోగులు, అభివృద్ధి నిరోధక విద్రోహులు, దలైలామాతో కలసి, విదేశీ సామ్రాజ్యవాదులతో కుట్రలు చేసి, చైనీయులను పారద్రోలి స్వతంత్ర్య టిబెట్ నినాదంతో 10 మార్చి 1959న తిరుగుబాటు చేశారు. అది సైనిక ప్రతీఘాతక విప్లవ శక్తుల సాయుధ తిరుగుబాటు, సంస్కరణలను అమలు చేయుచున్న అధికారులను వూచకోత కోశారు. చైనా ప్రజా రిపబ్లిక్ ప్రభుత్వం 28 మార్చి 1959న అభివృద్ధి నిరోధక టిబెట్ స్థానిక ప్రభుత్వాన్ని రద్దుచేసి, ప్రజాసామాన్యపు మద్దతుతో తిరుగుబాటును అణిచి వేసింది. వెట్టి చాకిరి, బానిసత్వం, తిరుగుబాటు అను మూడింటికి వ్యతిరేకంగా కౌలు, వడ్డీరేటు అను రెండింటి తగ్గింపునకు మహోద్యమాలుగ అమలు చేయబడినవి. తిరుగుబాటు విఫలమగుటతో భూస్వామ్య ప్రభువులు, మఠాధిపతులు, లామాను తమ వెంట తీసుకొని, ఏప్రిల్ 7, 1959న భారత దేశంలోని ముస్సోరి ప్రాంతాలకు చేరి, భారత ప్రభుత్వపు ఆశ్రయం పొందారు. నెహ్రూ 27 ఏప్రిల్ 1959న పార్లమెంటులో దలైలామా అనుచరులతో తమ యిష్టానుసారం సరిహద్దులు దాటి వచ్చారని, రమ్మనమని మేము కోరలేదని, ఆశ్రయం కోరినపుడు సహజంగానే యిచ్చామని ప్రకటించారు. అంతేగాక, భారత దేశం నుండి ఎవ్వరు విద్రోహ చర్యలు జరుపుటకు భారత ప్రభుత్వం అంగీకరించదు. కలింపాంగ్ తిరుగుబాటు దారుల కుట్రల కేంద్రమని నిందించుట నిర్హేతుకమైనదని నెహ్రూ అన్నారు.

టిబెట్టు ఘటనలపై భారత ప్రభుత్వ వైఖరిని పార్లమెంటులో వివరించుతూ నెహ్రూ చేసిన వివిధ వుపన్యాసాలను చైనా పీపుల్సు డైలీ 6 మే 1959న "టిబెట్‌లో విప్లవం, నెహ్రూ తాత్విక సిద్ధాంతం" అన్న సంపాదకీయంలో తీవ్రంగా విమర్శించింది. చైనా చేసిన యీ విమర్శను వారు చేబట్టిన "కమ్యూనిజంలోనికి త్వరితంగా పురోగమనం", "పెద్దగా

దూకుట" "ప్రజా కమ్యూనులు" అనే నినాదాలతో అతివాద పెడ మార్గం వైపు పయనించిన నేపథ్యంలోనే చైనా భారత సరిహద్దుల వివాదాన్ని అర్థం చేసుకోవాలి.

## (3)

సరిహద్దులకు సంబంధించిన భారత-చైనా అధికారుల 1960 సమావేశంలో మన ప్రభుత్వం చూపిన సాక్ష్యాధారాలు లడక్, సింకియాంగ్ మరోవైపు టిబెట్టు సరిహద్దులను వాటి పరిస్థితులను శతాబ్దాల నుండి సాంప్రదాయ వివాదరహిత సరిహద్దులు స్పష్టంగా వుండుటను తెలియజేశాయి.

లడక్ రాజుల పత్రాలు, లాద్వాగ్స్గ్రియల్ రాజుల 10వ శతాబ్దపు లిఖిత ఆధారాలు లడక్ సరిహద్దు సాంప్రదాయంకంగా అందరికి తెలిసిన దానిని స్పష్టం చేస్తున్నది. ప్రధాన సరిహద్దులను వివిధ దేశాల యాత్రికుల కథనాలు వివరాలు యిస్తున్నవి. ఇవి అక్సాయి చిన్ పీఠభూమి, లింగ్‌జీటాంగ్ మైదానాన్ని చైనా యెప్పుడూ చేరలేదని తెలియజేస్తున్నవి. సాంప్రదాయ సరిహద్దులను లడక్-టిబెట్‌లు 1684లోను, లడక్-టిబెట్, చైనాతో సహా 1842లో జరిగిన ఒడంబడికలను భారత ప్రభుత్వం చూపెట్టింది. బ్రిటీష్ భారత ప్రభుత్వం, చైనా కేంద్ర ప్రభుత్వాల మధ్య జరిగిన రాయబార వుత్తర ప్రత్యుత్తరాలను ధృవపరచుటను, స్థానిక ఒడంబడికలు రెండు ప్రభుత్వాల సరిహద్దు అధికారుల మధ్య 1822లో జరిగిన స్థానిక ఒడంబడికలను, ఆధార, సాక్ష్యాలను భారత ప్రభుత్వం చూపెట్టింది. చైనా పక్షం తన వాదనను బలపరస్తూ ఎట్టి సాక్ష్యాధారాలను చూపెట్టకపోగా మరో 2500 చ.మై. భారత భూభాగాన్ని వారి 1956 మ్యాపులకు వ్యతిరేకంగా తమదని చూపెడుతూ మరోమ్యాపును తాజాగా ముద్రించిన దానిని చూపెట్టింది.

మధ్య ప్రాంతపు సరిహద్దు ఎక్కడ వున్నదో చైనా ప్రభుత్వానికి నిస్సందేహంగా తెలుసు. 1954లోజరిగిన భారత-చైనా వొడంబడిక సరిహద్దులోయన, మార్గాలను స్పష్టంగా ఉదహరించుట కూడా జరిగింది. ఆవిధంగా సాంప్రదాయ సరిహద్దును ధ్రువీకరించింది. రెండు పక్షాలకు సరిహద్దులు తెలియకుండానే శాంతియుత సహజీవన సూత్రాలను ఇరుదేశాల దేశ సమగ్రతలను గౌరవించుటను ఆమోదించి సంతకాలు చేయుట జరిగిందని ఊహించజాలము.

తూర్పు ఏజన్సీ ప్రాంతం భారతసార్వభౌమాధికారంలో వుంది. వివాదాంశంగా ఎప్పుడూ లేదు. ప్రభుత్వం యీ అవగాహనను, 1960లో తిరిగి పరస్పర దిగువ ప్రాంతం, ప్రధాన హిమాలయాలు పర్వత పాద ప్రాంతాల మధ్య ప్రాంతం ఎప్పుడూ ఏ విధంగా భారత భూభాగంగా వుందో తోలియజేయుట జరిగింది. అవిభాజ్య భారత దేశపు పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతంలో దేశమధ్య భాగంలో వివిధ ఆటవిక తెగలు, జాతులపై పాలనాధికారాలను కలిగి యుండుటను అదే విధంగా అహోం రాజుల పాలనాధికారాలను పొందిన బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం, ఈశాన్యపు తెగల, జాతులపై పాలనాధికారాలను

కలిగివుంది. ఈ ప్రాంతంపై భారతదేశం సార్వభౌమాధికారాలను కలిగి వుందనుటకు సుముఖ సాక్ష్యాధారాలున్నవి. దీనిని వివిధ శాసన చట్టాలు, పరిపాలనా సూచనలు స్పష్టం చేస్తున్నవి. ఇండియా 1873, 1880, 1884, 1914, 1928, 1929, 1935లలోని వివిధ చట్టాలు, 1950 భారత రాజ్యాంగ చట్టం యీ విషయాన్నే స్పష్టం చేస్తున్నవి.

ఇందుకు భిన్నంగా చైనా తమవని అంటున్న హిమాలయ పర్వత శ్రేణి నీటి వాలు రేఖ దక్షిణ ప్రాంతాలపై తమ పరిపాలనాధికారం సూచించే యేఒక్క చట్టాన్ని గాని, యేయితర సాక్ష్యాధారాలను కాని చూపించజాలక పోయింది. ఒకే ఒక మతాధికార సంభంద పత్రాన్ని మాత్రమే  చూపగల్గినా, సార్వభౌమాధికారాన్ని కల్గియుండుటను చూపలేక పోయింది.

ఈ సహజ, సాంప్రదాయ, ఆచరణలో అనువాయితిగా వున్న సరిహద్దు 1914లో మెక్ మాహన్ రేఖ వొప్పందంగా చైనా ప్రభుత్వ ఎరుకతో, భారత, టిబెటియన్ ప్రభుత్వ ప్రతినిదులచే సంతకాలు చేయబడినది. వాస్తవానికి ఒప్పందం జరిగిన సిమ్లా సమావేశంలో చైనా ప్రభుత్వంతో సహా భారత, టిబెట్ 3 దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు. నిజానికి చైనా ప్రభుత్వం టిబెట్ ప్రతినిధికి, దలైలామా పేరుతో ఎట్టి పరిమితులు లేకుండా పూర్తి అధికారాలను టిబెట్‌కు సంబంధించిన అన్ని సమస్యలపై ఇచ్చింది. చైనా ఆ వొడంబడికను ధృవపరచక పోయినా, ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా 24, 25 మార్చి 1914లలో జరిగిన వొడంబడిక చెల్లనిది కాదు. బ్రిటిష్ టిబెటన్ ప్రతినిధులు సంతకాలు చేశారు. అయితే బ్రిటిష్ ప్రతినిధి రహస్యలేఖల ద్వారా టిబెట్ ప్రతినిధితో తదనంతర చర్యలను ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా వొప్పందం జరిగినట్లుగా తెలిస్తున్నది. ఇండియా-టిబెట్ సరిహద్దు వొడంబడికలోని పశ్చిమోత్తర, మద్యప్రాంత అంశాలను ఆమోదించుతు, అందులోని భాగమైన తూర్పు ప్రాంత మెక్‌మాహన్ వొడంబడికను ఆమోదించకపోవుట ఆశ్చర్యం. కరుణాకర్ గుప్తా తన "స్పాట్‌లైట్ ఆన్ ఇండియన్ ఫ్రాంటియర్స్" అను రచనలో భారత-చైనా సరిహద్దులకు సంబంధించిన చారిత్రాకాంశాలను దాచిపెట్టబడినన వాటిని, ఫోర్జరీ చేసిన వాటిని, వికృత విపరీత అసంగత వ్యాఖ్యలను పరిశోధించి, బ్రిటిష్ సామ్రాజ్యవాదపు కుటిల రాజనీతి బట్టబయలు చేసారు. ఇది అనేక మౌలికాంశాలనే ప్రశ్నించుటతో ప్రత్యేకంగా చివర భాగంలో వివరించబడింది. నూతన వెలుగును ప్రసరింపజేసింది.

## (4)

సరిహద్దు సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకొనుటకు నెహ్రూ ఆహ్వానం పై ఢిల్లీ వచ్చిన చౌయెన్‌లైతో సంప్రదింపులలో ఫిబ్రవరి 1960లో జరిగిన మార్గాల అన్వేషణ విఫలమగుటతో, అభిప్రాయ భేదాలను ఉన్నతాధికారుల  పరిశీలన సాగించుటకు ఆమోదించబడింది. భారత-చైనా ప్రభుత్వ ఉన్నతాధికారుల నివేదికను భారత ప్రభుత్వం 14 ఫిబ్రవరి 1961లో ప్రకటించింది. సాంప్రదాయంగా ఆధారాలసహితంగా వున్న భారత భూభాగంలోని 50వేల చదరపు మైళ్ళ ప్రాంతాన్ని తమదిగా చెబుతున్నదని, చట్ట వ్యతిరేకంగా

12వేల చదరపు మైళ్ళ భారత ప్రాంతాన్ని ఆక్రమించిందని నివేదిక స్పష్టం చేసింది. చైనా ప్రభుత్వం అట్టి నివేదిక వున్నదని వొప్పుకొనక, చివరకు అయిష్టంగా కుదించిన చైనా నివేదిక భాగాన్ని మే 1962లో ప్రకటించింది. ఏప్రిల్ 20న సిక్కింలోని జెలెప్లాపాస్, పశ్చిమాన చుషుల్ ప్రాంతాలలోనికి చైనీయులుచొరబడ్డారు. సిక్కింలోనికి తూర్పున లాగ్జూ వద్ద సరిహద్దు లోపలకు, లడక్ ప్రాంతంలో చుప్‌చాప్ ప్రాంతాలలో చైనా గస్తీ దళాలు ప్రవేశించాయి. ఈ అతిక్రమణలకు భారత ప్రభుత్వం చైనా ప్రభుత్వానికి తన అసమ్మతిని తెలియజేసింది.

ఆక్సాయ్ చిన్‌లో తెలిసో తెలియకో చట్ట వ్యతిరేకంగా ఆక్రమించి, సికియాంగుకు రోడ్డును నిర్మించి దానిని సమర్థించుకొనుటకు కుంటి వాదనలు తెచ్చి వివాదంలో పట్టు విడుపులు వుండాలంటూ ఆక్సాయ్‌చిన్ రోడ్డు ప్రాంత విషయాన్ని ప్రశ్నించకుండా వుంటే తాము తూర్పున మాక్‌మాహన్ రేఖను తాము ప్రశ్నించక ఆమోదించగలమనే సూచనలు చేస్తూ వచ్చింది. మెక్‌మాహన్ రేఖను ఆక్సాయ్ చిన్‌కు పోటీగా పెట్టి తానున్న క్లిష్ట పరిస్థితినుండి బయట పడాలనే ఎత్తుగడగా కన్పించుతున్నది. ఇండియా ఆక్సాయ్ చిన్ ప్రాంతంలో చైనా రోడ్డు నిర్మాణం సకాలంలో గుర్తించి తగిన చర్యలు గైకొనిన పరిస్థితి విషమించేది కాదు. ఆలస్యంగా రోడ్డు నిర్మాణాన్ని ఖండించి, తొలగించవలసిందని కోరగా చైనా నిరాకరించింది.

చౌయెన్‌లై న్యూఢిల్లీసందర్శనానంతరం చైనా చేరిన తరువాత చైనా ఆక్రమిత భారత భూభాగంలోనికి గస్తీ దళాలు వెళ్ళి వచ్చే ప్రయత్నాలు చేయవలసి వుంటుందని, ప్రభుత్వ వర్గాలు వెల్లడించాయి. చైనా స్థావరాలపై దాడికి మాత్రం గాదు, అగ్రనాయకత్వధ్యేయం, భారత చైనాల సంఘర్షణలను అన్ని విధాల నివారించే ప్రయత్నం చేయుటకు ఆమోదించి ప్రకటించింద. భారత గస్తీ దళాలు, చైనీయులు లేని ప్రాంతాలలో (వున్న చోట్ల తప్పుకొంటూ) తమ పని చేయవలసి వుంటుంది. ఈ విధమైన "ముందడుగు విధానం" అనే చదరంగం 1960లో ప్రారంభమైంది. వాస్తవ పరిస్థితుల ప్రభావం నుండి యీ విషకన్యకు జనకులుగ గొప్పగా చెప్పుకొనేవారు చాలామంది వున్నారు. కృష్ణమీనన్ పరిస్థితులప్రభావంలో రూపొందిందని అది చదరంగం ఆటలాగ అంతవరకే పరిమితమై వుంటే ఆ విధానం వైఫల్యం చెందేది కాదనిన ఆయన వొక్కరే నిజాయితీగా చెప్పారు.

ముందడుగు విధానం ధ్యేయం 1) చైనా ఆక్రమణ జరుగు మార్గాలను మూసివేయుట 2) ఆక్సాయ్ చిన్ ప్రాంతంలో భారత ఉనికిని స్థిరపరచుట, నెహ్రూ చెప్పే "ఇద్దరూ ఉపసంహరించుట"ను అర్థవంతం చేయుట, ఆ ప్రాంతం నుండి చైనీయులు ఉపసంహరించుటను అర్ధవంతం చేయుట. ఆ ప్రాంతంనుండి చైనీయులు వుపసంహరించునట్లు చేయు రాయబార వర్గాల ప్రయత్నాలు ఫలవంతమగునట్టు చేయుట, వివాదాస్పదమైన ప్రాంతంలో అక్కడక్కడ చైనా వారి అధీనంలోని ప్రాంతాలలో భారత,చైనా చెక్ పోస్టులను యేర్పాటు చేసి, చైనీసు పోస్టుల మధ్య వారు లేని చోట్ల గస్తీ చర్యలు కొనసాగిస్తూ వారి సప్లయి మార్గాలను ఛేదించుతు ఏకపక్షంగా వారు ఉపసంహరించుకొన్నట్లు

చేయుట. కాని " విధానం ఉద్భవించిన" తరువాత ధ్యేయం మరో మార్గం లేక ఆచరణలో దాని ఉన్నత రూపంగా రూపొందింది.

సత్యాగ్రహం, సహాయనిరాకరణల స్ఫూర్తి యీ ముందడుగు విధానపు అవగాహనలో యిమిడి వుంది. నైతిక బల విశ్వాసంతో చైనా దాడి చేయకుండా చేయగలమని గతంలో బ్రిటిష్ వారు బలాన్ని వుపయోగిస్తే అదివారిని బలహీన పరచిందనే అవగాహన అట్టి గస్తీ కేంద్రాలను యేర్పాటు చేయు "చదరంగ ఆట" ఆచరణకు మూలకందము. ఆక్సాయ్ చిన్ ప్రాంతంలోనికి "భారత సైనిక గస్తీ దళ సత్యాగ్రహులు ఆ నైతిక బలంతో వెళ్ళగలరని, భారత దేశపు ప్రపంచ ప్రఖ్యాతి ఆ నైతిక బలానికి తోడ్పడుతుందనే అవగాహనలో నిబిడీకృతంగా వుంది.

ప్రధాని నెహ్రూ కృష్ణ మీనన్ విదేశాంగ కార్యదర్శి సర్వ సైన్యాధిపతి జనరల్ థాపరు, జనరల్ కౌలు ఇంటెలిజెన్స్ డైరెక్టరు మల్లిక్ తదితర అధికారులు ప్రధాని ఆఫీసులో 2 నవంబరు 1961న సమావేశమై చేసిన నిర్ణయాలు ఆచరణ సూచనలు సంక్షిప్తంగా యిలా వున్నవి. అవి 1) లడక్‌లో అంతర్జాతీయ సరిహద్దు వరకు సాధ్యమైనంత ముందుకు గస్తీ చర్యలు చేపట్టి, మన పోస్టులు యేర్పాటు చేయాలి. అదే చైనీయులు యింకా ముందుకు చొచ్చుకొని పోకుండా ఆపగలదు. వారు ఆధిక్యత పొందకుండా చేస్తుంది. సంఘర్షణ పడకుండా చేయాలి. ఆత్మరక్షణకు అవసరమైతే తప్ప సంఘర్షణకు దిగరాదు. 2) ఉత్తరప్రదేశ్ ప్రాంతంలో కష్టమైన సమస్యలు లేవు. కాన సాధ్యమైనంత ముందుకు వెళ్లాలి. సరిహద్దు నంతా విస్తరించాలి. ఖాళీ స్థలాలలోమన పోస్టులనేర్పాటు లేదా గస్తీ చర్యలను సమర్ధవంతంగా నెరవేర్చాలి. 3) సరిహద్దులలోని మన అగ్రగామి పోస్టుల వెనుక అంతటా ప్రధాన సైన్యాలను వ్యూహాత్మకంగా సమీకరించాలి, సరిహద్దు పరిస్థితి పునరుద్ధరించాలి. అంతేగాక " మద్దతునిచ్చే స్థావరాలు లేకుండా తీసుకొనే యే చర్య అయినా సాహసిక చర్య అగుతుంది". సైన్యానికి జాతికి తగిన చర్య కాదని స్పష్టం చేయబడింది. ముందడుగు విధానాన్ని అతిక్రమించి, థాగ్లాశ్రేణి శిఖరాగ్ర భాగాన్నుండి చైనీయులను తొలగించివేయాలనే నిర్ణయానికిచ్చిన ప్రచారం యుద్ధానికి దారి తీసింది. ప్రధాని విదేశ యాత్రలో వున్నపుడు, తన అభ్యంతరాలను లెక్క చేయకుండా రక్షణ శాఖ మంత్రి కృష్ణమీనన్ యీనిర్ణయం తీసుకొన్నారని, అప్పుడు తాను రాజీనామా చేసి వుండవలసిందని, అపజయం, అవమానాన్నుండి దేశాన్ని కాపాడగలిగి యుండే వాడనని, జనరల్ థాపర్, తదనంతర కాలంలో విలేఖరుల ప్రశ్నలకు సమాధానంగా అన్నారు. "ముందడుగు విధానాన్ని" అవలంభించినా చైనా సైనిక చర్యలతో ప్రతిస్పందించదనేఅవగాహనను, సైనిక రహస్య శాఖ డైరెక్టరు మల్లిక్ యిచ్చియున్నందున, అది సైనిక వర్గాలలో బలపడి ప్రబలంగా వుంది.[1]

---

*1. నెవెల్లీ, మాక్స్‌వెల్ (1971) - ఇండియాస్ చైనావార్ - జైకో బుక్, పే.450.*

# (5)

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సమావేశం 1957, 1960లలో సిద్ధాంతచర్చలలో రష్యా చైనాల మధ్య భేదాభిప్రాయాలు తీవ్రమైనవి. ఈ చర్చలలో సి.పి.ఐ. శాంతి, సహజీవనం యుద్ధోన్మాద, అణు యుద్ధ వ్యతిరేకతను చేబట్టి రష్యానే అనుసరించిన నేపథ్యంలో భారత-చైనా సరిహద్దు యుద్ధంలో రష్యా వైఖరిని అర్థం చేసుకొనుటతో పాటు, రష్యా-చైనా సరిమద్దు సంఘర్షణలలో గర్భితమైయున్న సరిహద్దు వివాదాలలో అనుసరిచవలసిన సూత్ర విధానాల పరిగణను, దాని ప్రభావం బేరజువేయవలసి వుంటుంది. అమెరికా సాంప్రదాయకంగా చైనా కమ్యూనిస్టు వ్యతిరేక విధానాన్ని అనుసరించుట వాస్తవమే. అయినా, భారత్‌ను పూర్తిగా బలపరచక, చైనా విస్తరణకు పరిమితంగా బలపరచినా, సరిహద్దు సంఘర్షణలో రెండు దేశాలు బలహీన పడాలని భారత్ తన విధానాలకు పాదాక్రాంతం కావాలనే ఎత్తుగడ వైఖరినవలంభించుట మరో వాస్తవము.

భారత-చైనా మొట్ట మొదటి సరిహద్దు సంఘర్షణ ఆగస్టు 1959లో జరిగింది. సోవియట్ విదేశాంగ మంత్రికి "నెహ్రూపన్నిన ఉచ్చులో పడవద్దని" సెప్టెంబరులోచైనా విదేశాంగ మంత్రి కలుసుకొని, భారతదేశం చైనాపై వొత్తిడి చేయుటకు సోవియట్‌యూనియన్‌ను వినియోగించుకొంటున్నదని వివరించారు. సోవియట్ మంత్రి వర్గం భారత-చైనా సంఘర్షణపై వొక ప్రకటన సెప్టెంబరు 9న తయారు చేసింది. చౌయెన్‌లై నెహ్రూకు సంభాషణల విషయమై ఉత్తరం వ్రాస్తున్న కారణంగా ప్రకటనను విడుదల చేయవద్దని చైనా మంత్రి వర్గం రష్యాను కోరింది. చైనా అభ్యర్థనను త్రోసి బుచ్చి రష్యా అదే రాత్రి ప్రకటన చేసింది. భారత-చైనా సంబంధాలు విషమించాయని బహిరంగంగా ప్రపంచానికి తెలిపింది. ఆ వెంటనే వారం రోజులలో కృశ్చేవ్ క్యాంపు డేవిడ్‌లో ఐసెన్ హోవరుతో శిఖరాగ్ర సమావేశంలో పాల్గొన్నాడు. చైనా రిపబ్లిక్‌తో చేసుకున్న అణుసాంకేతిక విజ్ఞానవొడొంబడికలను యేక పక్షంగా శిఖరాగ్ర సమావేశానికి బహుమతిగా రష్యా రద్దు చేసుకొంది. అంతేగాక కృశ్చేవ్ చైనా ప్రజా రిపబ్లిక్ 10వ వర్ధంతి సందర్భంలో భారత్-చైనా సరిహద్దు సమస్యను లేవనెత్తి చైనా "దురాక్రమణను" నిరసించాడు, "చైనాపై అమెరికా అణు యుద్ధం చేయకుండా వొక్క రష్యా మాత్రమే ఆపగలదన్నాడు".

సోవియట్ యూనియన్, అమెరికా రెండూ భారత్-చైనా సరిహద్దు సంఘర్షణలను తమ స్వప్రయోజనాలకు వినియోగించ సమకట్టుట స్పష్టం. వ్యూహాత్మక హిందూ మహా సముద్రంలోఅమెరికా, రష్యాలు రెండూ తమ ఆర్థిక విస్తరణకు ప్రధానంగా భారతదేశాన్ని పోటాపోటీగా యెంచుకొనుటగా నిర్ధారణ అగుతుంది.

అమెరికన్ రాజకీయ వర్గాలలో ఆసియాలో తననాయకత్వాన్ని సుస్తిరం చేసుకొనుటకు, భారత దేశాన్ని ఏకాకిగా చేయు ప్రయత్నాలలో భాగంగానే చైనా-భారత దేశాల సరిహద్దు సంఘర్షణలు, అదే విధంగా అలీన దేశాలలో తన నాయకత్వాన్ని బలపరచుకొని శాంతి దూతగా ముందుకు వచ్చుటనే అలీన దేశాల బెల్గ్రేడ్ సమావేశంలోని నెహ్రూ ఉపన్యాసం

సూచించుతున్నదనే అభిప్రాయముంది. నైరుతి ఆసియాలో న్యూఢిల్లీ-పెకింగులు రాజకీయ విశ్వాసాలను సంపాదించుటలో పోటీపడుతున్నవనే వ్యాఖ్యలు వినపడుతున్నవి. ఇట్టి వివరణనే అమెరికా ప్రెసిడెంటు జాన్ కెన్నడీ ఆసియాలో నిరంకుశత్వానికి ప్రత్యామ్నాయం ప్రజాస్వామ్య భారతదేశమేనని అమెరికను, భారత మేధావి వర్గాలు తలచుచున్నవి.

సోవియట్ యూనియన్, భారత-చైనా సరిహద్దు సంఘర్షణలో తన సమస్య అంతర్గతంగా యిమిడి వున్నదనే అవగాహన కలిగియున్నట్లు కన్పడుతున్నది. అమెరికా సరిహద్దు సంక్షోభఫలితంగా మరింతగా దానిలో మునిగిపోతుందని తెలిసినా దాని తీవ్రతను తగ్గించుటకు ఎట్టి ప్రయత్నం చేయలేదు. సంక్షోభంలోనే భారత దేశం తన ఆలోచనలకు స్పందించగలదని వేచి చూస్తున్నది.

## (6)

భారతదేశ వాయువ్య ప్రాంతంలోని థాగ్లా పర్వతశ్రేని ఏజెన్సీని దాటి చైనా సైన్యాలు 8 సెప్టెంబరు 1962న దేశంలోనికి ప్రవేశించుటతో సరిహద్దు యుద్ధము ప్రారంభమైంది. ఇందుకు భాధ్యత చైనా వహించవలసి వుంటుందని భారత ప్రభుత్వం సెప్టెంబరు 17న హెచ్చరించింది. భారత దేశ సమగ్రత ప్రశ్నించరానిదని పునరుద్ఘాటించింది. అదే విధంగా చిప్ చాప్ ప్రాంతంలో చైనా సైన్యాలు ప్రవేశించాయి. భారత ప్రభుత్వం సెప్టెంబరు 20న అసమ్మతిని తెలియజేసింది. అయినా అదే ప్రాంతంలో ఆరు నూతన సైనిక పోస్టులను యేర్పాటు చేయుటను సెప్టెంబరు 21 ప్రభుత్వం అసమ్మతిని తెలియజేసింది. అదే రోజున వాయువ్య ఏజెన్సీలోని డోలా ప్రాంతంలో కూడ చైనా సైన్యాలు భారత సైనిక పోస్టులపైదాడి చేశాయి. ప్రభుత్వం అసమ్మతిని తెలిపింది. భారత ప్రభుత్వం అక్టోబరు 6న తాజా సరిహద్దు అతిక్రమణలను చైనా ప్రభుత్వం వుపసంహరించనిచో ఎట్టి సంప్రదింపపులు, చర్చలు కొనసాగించజాలదని స్పష్టం చేసింది.

భారత రక్షణ సైనిక పోస్టుపై తూర్పు, పశ్చిమ ప్రాంతాలలో విస్తృత విశాల ప్రదేశాలలో ద్విముఖ దండయాత్ర చేసి చాలా దూరంచొచ్చుకొని వచ్చాయి. అక్టోబరు 24న చైనా ప్రధాన మంత్రి మూడు అంశాల ప్రతిపాదనలు చేస్తూ, భారత ప్రధానికి లేఖ పంపారు. రెండు దేశాలు వాస్తవాదీన రేఖను గౌరవించాలి. రెండు పక్షాల సైన్యాలు యీ రేఖకు 20 కిలో మీటర్లు దూరం ఉపసంహరించకొనాలి. తూర్పు రంగంలో చైనా సైన్యాలు, ఆ రేఖకు వుత్తరానికి వుపసంహరించుకొంటాయి. ఇండియా, చైనాలు వాస్తవాధీన రేఖను దాటవని ప్రకటించాలి. రెండు దేశాల ప్రదాన మంత్రులు సరిహద్దు సమస్యలపై కలసి స్నేహ, సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొనాలి. భారత ప్రధాని అక్టోబరు 27న భారతదేశంలో విదేశీ సైన్యాలు ప్రవేశించి, నూతన దురాక్రమణలను కొనసాగించుతూ వుంటె ఎట్టి సంప్రదింపులు చర్చలు భారత ప్రభుత్వం అంగీకరించజాలదని జవాబు వ్రాశారు. భారత ప్రధాని సెప్టెంబరు 8కి ముందున్న యాధాస్థితిని పువరుద్ధరించి సరియైన

వాతావరణాన్ని కలుగజేయాలని ప్రకటించారు. ఇక యీసారి సరిహద్దు యుద్ధానికి ప్రేరకాలు, కారణాలను తెలుసుకొందాము.

భారత బడా బూర్జువా వర్గం సామ్రాజ్యవాదంతో అనేక ఆర్థిక పారిశ్రామిక పొత్తు సంబంధాలను అభివృద్ధి చేసుకొంటూ, విదేశీ పెట్టుబడిని ఆహ్వానించుతూ, దానిపై ఆధారపడి వుంది. అదే కాలంలో సోషలిస్టు దేశాలతో శాంతి స్నేహ సహకార సంబంధాలను పెంపొందించుతు పారిశ్రామికాభివృద్ధికి ద్వంద విధానాన్ని అవలంభించుతున్నది. చారిత్రిక బందనాల వలన భారత బడాబూర్జువా వర్గం బ్రిటిష్ వలస విధానల కొన్నింటిని వారసత్వంగా పొందింది.

ఆసియా అభివృద్ధి పరుగులో సైద్ధాంతికంగా భారత దేశాన్ని వెనుకకు నెట్టాలనే రాజకీయ పోటీ అంతర్గతంగా చైనా, భారత పాలక వర్గాల రెంటిలోనూ వుండుట నిశిత పరిశీలకులు చూడగలరు. చైనీయులు, రష్యా అమెరికాలు చేరువగుటకు ప్రయత్నాలు, భారతదేశం ఆ రెండు దేశాలకు చేరువగుట హర్షించజాలక పోయారు.

చైనా రక్షణ మంత్రి అతివాది లిన్‌పియావో సైనికంగా యెట్టి ప్రధాన విజయాన్ని పొందియుండలేదు. లావోస్ సంఘర్షణలలో చైనా విదేశాంగ మంత్రి చౌయెన్‌లై రాయబారుల చొరవతో విజయవంతంగా పరిష్కారమైంది. చైనా తూర్పు ప్రాంతంలో పెద్ద సైన్య సమీకరణ జరిగిన థైవాన్ నుండి జంగైషెక్ సైన్యాలు చైనాలోని భూభాగంలోని సైనిక కేంద్రాలపై దాడులు విజయవంతంగా జరుపుతుండగా, చైనా ప్రధానంగా సైనిక సంఘర్షణలలో యెట్టి విజయాన్ని పొందలేదు. ఛాంగైషెక్ సైన్యాలను అదుపులో పోట్టమని కోరుట తప్ప యేమీ చేయలేక పోయింది. ఈ పరిస్థితులలో భారత సైన్యం "ముందడుగు విధానాన్ని" చేపట్టగా లిన్‌పియావో మరో అపజయాన్ని చవిజూడదలచలేదు. అదే కాలంలో లీషౌచీ, చౌయెన్‌లైలు లిన్‌పియావో అంగీకరించుటతో సరిహద్దు సంఘర్షణలు యుద్ధ మార్గం చేబట్టుట జరిగింది.

జనరల్ థాపర్ 9 జనవరి 1971లో స్టేట్స్‌మన్‌లో వ్యాసం వ్రాస్తూ, సైనిక "ముందడుగు విధానం" కాక థాగ్లా పర్వత శ్రేణుల నుండి చైనీయులను తొలగించాలనే మన నిర్ణయం, దానికి మనమిచ్చిన ప్రచారం కారణమన్నారు. "ఈ నిర్ణయం కృష్ణ మీనన్ చే నెహ్రూ విదేశాలకు వెళ్ళినప్పుడు తీసుకొనబడింది. తన సహచరులతో గూడ సంప్రదించలేదు. చైనా ప్రతిస్పందనపై తత్ఫలితాలపై నేను వెలిబుచ్చిన సందేహాలను త్రోసిబుచ్చి నిర్ణయం చేశారు" అని వ్రాసారు. చైనా "ముందడుగు విధానాన్ని" తీవ్రంగా ప్రతిస్పందించదనే అభిప్రాయాన్ని రహస్యశాఖ డైరెక్టరు మల్లిక్ కలిగించారు. నెహ్రూ ఆమోదించారు. భారత సైన్యం స్థానికంగా దాడులు చేసినా, చైనా ప్రతిచర్య తీసుకొనదనే అభిప్రాయాన్ని రష్యనులు కలిగించినట్లు విదేశాంగ కార్యదర్శిగా వున్న యం.జె.దేశాయ్ 9 సెప్టెంబర్ 1962న కృష్ణమీనన్ ఏర్పాటు చేసిన సమావేశంలో చెప్పినట్టు యిప్పుడు చెప్పబడుతున్నది. చౌయెన్‌లై 1971లో భారత-చైనా సంఘర్షణలో సోవియట్‌సంస్కరణ వాదులు ఇండియాకు "చైనా స్పందించిపోరాడదని" 1962లో చెప్పారని మాక్స్‌వెల్ నెవెల్లీ వ్రాసారు.

భారత్ చైనాల మధ్య సరిహద్దు యుద్ధ సంఘర్షణలకునేపధ్యంగా క్యూబాలో మిసిలీల విషయమై అమెరికా-సోవియట్ యూనియన్‌లు మానవ జాతిని ప్రపంచ అణుయుద్ధ పొలిమేరలకు తీసుకొని వెళ్ళిన అంతర్జాతీయ సంక్షోభ పరిస్థితులను పరిగణలోనికి తీసుకొనినప్పుడే సమగ్ర అవగాహన యేర్పడుతుంది. ఈ ఘటనల క్రమాన్ని యాధృచ్ఛికమైనవిగా పరిగణించుట అశాస్త్రీయమగుతుంది.

## (7)

భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి 18 ఫిబ్రవరి 1961న సమావేశమై పశ్చిమాన సాంప్రదాయ సరిహద్దులను, తూర్పున మెక్ మాహన్ రేఖను సరిహద్దుగా ఆమోదించిన నవంబరు 1959లో తీర్మానాన్ని పునరుద్ఘాటించుతు తీర్మానించింది. జాతీయ సమితి లడక్ ఘటనలలో ప్రాణాలు కోల్పోయిన భారతీయులకు ప్రగాఢ సంతాపాన్ని వెలుబుచ్చి వారి కుటుంబాలకు సానుభూతిని తెలిపింది. రెండు పక్షాలు సరిహద్దు వివాదంకై తమతమ వాదనలను సమర్ధించు లక్ష్యంతో ప్రతిపక్షవాదనలను ఖండించుటకై సమాచారం సేకరించుట జరిగింది కాని సమిష్టిగా రెండింటిని పూర్వ పక్షం చేసి, సమన్వయంగా వొకే నివేదిక సమర్పించి, సమస్య పరిష్కారానికి తోడ్పడు వాస్తవ శాస్త్రీయ విధానాన్ని అనుసరించలేదని సమితి అభిప్రాయ పడింది. ఫలితం అధికారుల సంభాషణలలో ప్రతిష్టంబన ఏర్పడింది. ప్రతిష్టంబన పరిష్కారానికి రెండు ప్రభుత్వాలు రాజకీయ ప్రాతిపధికగా నేరుగా సంభాషణలను చేబట్టవలసి వున్నది.

జమ్మూకాశ్మీర్, పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతంతో సహా ఇండియన్ యూనియన్‌లోని భాగాలైనందున, యే దేశమైనా భారత దేశంతోనే వ్యవహరించవలసి వుంటుంది. పాకిస్తాన్‌కు యీ ప్రాంతాల విషయమై యే దేశంతోనైనా సంభాషణలు జరుపుటకు గాని వొప్పందం చేసుకొనుటకు గాని చట్టబద్ధమైన ఎట్టి అధికారం లేదనేది స్పష్టమే. భూటాన్ ఉత్తర సరిహద్దులకు సంబంధించిన సమస్యలపై సంప్రదింపులకు నిర్ణయాలకు భారత ప్రభుత్వానికిపూర్తి అధికారాన్ని యిచ్చింది. కాన భూటాన్ ఉత్తర సరిహద్దు విషయమై చైనా భారత ప్రభుత్వంతోనే సంప్రదింపులు జరుపవలసి వుంటుందని కమ్యూనిస్టు పార్టీ ప్రకటించింది. సిక్కిం వుత్తర సరిహద్దుల విషయమై కూడా భారతదేశంతోనే సంప్రదించాలి.

కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి ప్రపంచ శాంతి, ఆఫ్రో-ఏషియన్ ఐక్యత, వలస వ్యతిరేక పోరాటం, దేశాభివృద్ధి దృష్ట్యా రెండు దేశాలు పంచశీల సూత్రాలననుసరించి, సంప్రదింపుల ద్వారా వివాదాంశాలను పరిష్కరించుకొంటారని ఆశించుతు తీర్మానించింది.

కమ్యూనిస్టు పార్టీ జనరల్ సెక్రటరీ 16 డిశెంబరు 1961 పత్రికా విలేఖరుల సమావేశంలో మెక్‌మాహన్ రేఖను దాటుతామనే బెదరింపులపై ప్రశ్నించగా, చైనా నోట్‌లో "దాటుతామన్నది" వుదహరింపు మాత్రంగా వాదన కొరకు వున్నదని తాము భావిస్తున్నామన్నారు. ఒకవేళ చైనా సైన్యం రేఖను దాటితే చైనా సైన్యాన్ని తిరుగగొట్టుటకు

చేయు అన్ని ప్రయత్నాలు సమర్ధనీయము. అందుకై భారత ప్రభుత్వం చేబట్టు అన్ని చర్యలను పార్టీ బలపరస్తుందన్నారు. " భారత ప్రభుత్వ విదేశాంగ విధానం పై మా మౌలిక అవగాహన ప్రధానంగా వలస వ్యతిరేక అలీన శాంతి విధానంగా వుంది. అంచేత విదేశాంగ విధానాన్ని బలపరచాం. బలపరుస్తాం" అని అజయ్‌ఘోష్ స్పష్టం చేశారు. చైనా పత్రికలు "భారత దేశం దాదాపు సామ్రాజ్య వాదం వైపు పయనించిందని వాస్తవాలకు భిన్నంగానే గాక" వారి వ్రాతలు "సమతూకములేమిని తెలియజేస్తునవని" అని ప్రపంచంలోని యేయితర పార్టీకన్నా చైనా పార్టీతో సహా, భారత పరిస్థితిని,ప్రభుత్వాన్ని భారత కమ్యూనిస్టు పార్టీ సరిగా అంచనా వేస్తుందని స్పష్టం చేశారు.

కమ్యూనిస్టు పార్టీ సెక్రటేరియట్ 17 అక్టోబర్ 1962న నీఫాలో జరిగిన సంఘటనలకు ప్రాణ నష్టానికి, భారత-చైనా సాయుధ సైనికుల సంఘర్షణలకు తీవ్ర ఆందోళనను తెలిపింది. మెక్‌మాహన్ రేఖను సరిహద్దుగా పార్టీ ఎల్లప్పుడు గుర్తించుచున్నది. అంచేత దాని రక్షణకు చేబట్టే అన్ని చర్యలు సమర్ధనీయమే. హైదరాబాద్ ఆగస్టు 1962 కేంద్ర సమితి సమావేశం, భారత ప్రభుత్వ సంప్రదింపులకు మద్దతునిస్తూ సరిహద్దు రక్షణకు అవసరమైన అన్ని చర్యలు తీసుకొనాలని తీర్మానించింది. తిరిగి అక్టోబరులో పార్టీ సెక్రటెరియట్ పునరుద్ఘాటించింది.

వాస్తవాలు యిలా వుండగా మితవాద అభివృద్ధి నిరోధకులు కమ్యూనిస్టులపై చేయుదాడిని అర్ధం చేసుకొనగలిగినా మిత్రులైన విమర్శకులు తప్పుగా అర్ధం చేసుకొనుట విచారాన్ని కలుగజేస్తుంది. కమ్యూనిస్టులు పెకింగు భక్తులు కారు, అదే విధంగా వాషింగ్టన్ భక్తులు కారు. కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి 2 నవంబరు 1962న చైనా బహిరంగ దురాక్రమణకు వ్యతిరేకంగా మాతృభూమిని రక్షించుటకై ఐక్యంకండి" అనే తీర్మానాన్ని ఆమోదించి, మాతృభూమి రక్షణకై పిలుపునిచ్చింది. మెక్‌మాహన్ రేఖను దాటుట న్యాయ సమ్మతం కాదని "నిస్సందేహంగా దురాక్రమణ, అని మన దేశ సమగ్రతను అతిక్రమించుట అగుతుందని" స్పష్టం చేసింది.

జాతీయ సమితి నవంబరు 1962 తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడలేదనుట చారిత్రక వాస్తవము. నాటి పార్టీలోని భేదాభిప్రాయాలను, కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) 7వ కాంగ్రెసు ఆమోదించిన రాజకీయ నిర్మాణ నివేదికలో మూడు ప్రధాన బేదాభిప్రాయాలను వివరించింది. ప్రప్రథమంగా పార్టీలోని మెజారిటీ చేబట్టే రాజకీయ వైఖరి "బూర్జువా జాతీయ తత్వంతో కొట్టుకొని పోవుట"గా పేర్కొని " మన స్వాతంత్రాన్ని హరించుట, ఆక్రమించుట, చైనా లక్ష్యం అనే దానిని తిరస్కరించింది. ద్వితీయంగా మెజారిటీ వర్గం "8సెప్టెంబరు 1962 పూర్వస్థితిని పునరుద్ధంచబడనిచో సంప్రదింపుల ప్రసక్తి లేదనే ప్రభుత్వ వైఖరిని" యదాతధంగా బలపరచగా, మైనారిటి సంప్రదింపుల పరిష్కారానికి దారితీసే ప్రతిపాదనలను రూపొందించాలన్నది. ఇదే వైఖరిని ప్రభుత్వం తరువాత చేబట్టగా మెజారిటీ వర్గమూ అనుసరించింది. మెజారిటీ వర్గం ప్రభుత్వ ఆమోదం కాని మరో మార్గాన్ని ఆలోచించుటకు సిద్ధంగా లేదు. తృతీయాంశం, పశ్చిమ దేశాల "సైనిక సహాయాన్ని" మెజారిటి వర్గం ఆమోదించుతు, "వ్యాపార షరతులపై మాత్రమే"

అన్న పదాన్ని చేర్చింది. సైనిక సహాయం వ్యాపార షరతులపై పొందిన అనేక దేశాలు తమ స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయినవనే వైఖరిని మైనారిటి వర్గం అవలంభించుటయే ప్రధాన భేదాభిప్రాయం, అంచేతనే మెజారిటీ వర్గం అంతర్జాతీయ కార్మిక వర్గ సైద్ధాంతిక మౌలికాంశాల నుండి తిరోగమనం, బూర్జువా జాతీయ తత్వప్రకోపం, మాతృభూమి రక్షణ పేరుతో పాలక వర్గాలతో చేరటం ప్రజావసరాల పోరాట పంధా విడనాడుటయే యని మైనారిటి వర్గం తీవ్రంగా విమర్శించింది.

రాజ్యసభలో భూపేష్ గుప్తా, లోక్ సభలో హిరేన్ ముఖర్జీలు 8 నవంబరు 1962న చైనా దురాక్రమణ, అత్యవసర పరిస్థితిపై భారత కమ్యూనిస్టు పార్టి వైఖరిని వివరించారు. ముగింపుగా, స్వాతంత్ర్యం, దేశ రక్షణ ప్రమాద స్థితిలో వున్నపుడు మమ్ము అరెస్టులు కావించినా, మాతృదేశ రక్షణకు ఎట్టి త్యాగాలకైనా సిద్ధమేనని, దేశ గౌరవానికి, సమగ్రతలకు కమ్యూనిస్టులు తమ కర్తవ్యాన్ని నిర్వహించతారని పార్లమెంటుకు, ప్రజలకు వాగ్దానం చేశారు.

భారత కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వం అత్యవసర పరిస్థితి పేరుతో తమ నాయకులను అరెస్టు చేయుటను ఖండించి వెంటనే విడుదల చేయాలని కోరింది. భారత కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షులు, మరో నలుగురు అగ్రనాయకులు సంయుక్తంగా ప్రపంచ శాంతి, పంచశీల సూత్రాలను అనుసరించు భారత దేశంపై ఒక సోషలిస్టు పెద్ద దేశం ఆధునిక పెద్ద సైన్యంతో దండయాత్ర చేసి, విస్తార భూభాగాలను ఆక్రమించుట, నెహ్రూ ప్రభుత్వానికి కమ్యూనిస్టు పార్టి షరతులు లేని మద్దతును ప్రకటించి, దేశ రక్షణకై పార్టీకి ప్రజలకు పిలుపునిచ్చుట వివరించుతు సోదర పార్టీలకు వొక లేఖ వ్రాశారు.

ప్రపంచానికి 21 నవంబరు 1962 అర్ధరాత్రి చైనా సరిహద్దు రక్షణ దళాలు సరిహద్దు అంతటా యేక పక్షంగా కాల్పుల విరమణను 1 డిశెంబరు 1962 నుండి 7 నవంబరు 1959 నాటి వాస్తవాధీన రేఖను 20 కిలో మీటర్లు వెనుక వుపసంహరించుకొంటామని చైనా ప్రభుత్వం చేసిన ప్రకటనతో ఇండియా-చైనా సరిహద్దు యుద్ధం ముగిసింది.

## (8)

బ్రిటిష్ సామ్రాజ్యవాదపు "సరిహద్దు ఫోర్జరీ పత్రాలు భారత దేశ వర్తమాన చరిత్ర ముప్పుకు కారణమయ్యాయి. భారత చైనా సహజీవన, శాంతి మహాసముద్రంలో పెను తుఫానును తెచ్చాయి. భారత ఆంగ్ల ప్రభుత్వ విదేశాంగ శాఖ 1935లో ఇండియా సరిహద్దుల విస్తరణ పతిష్టం చేయనెంచింది. తూర్పు సరిహద్దులను, హిమాలయ పర్వతపాదరేఖగా 1929లో అచ్చయిన "ఏట్చిన్స్ ట్రిటీస్" వాల్యూం14లో సూచించబడినవి తమ లక్ష్యాలకు వ్యతిరేకంగా కన్పడినవి. ఆంగ్ల పాలకులు హిమాలయ పర్వత నీటి వాలు రేఖ సరిహద్దుగా వుంటే బ్రిటిష్ సామ్రాజ్యపు వలస భారత దేశ రక్షణ పతిష్టంగా వుండగల తగదనుకొన్నారు. కుట్రలు, ఫోర్జరీలకు వొడిగట్టారు. డిప్యూటి సెక్రటరీ ఒలావ్ కెరో ఆవాల్యూంని నాశనం చేయించి దాని స్థానంలో తమ అవసరాలకు అనుకూలమైన మార్పులతో నూతన "ఫోర్జరీ

వాల్యూంను 1938లో 1929 లోఅచ్చయినట్లు ముద్రించారు. మెక్ మాహన్ రేఖకు చట్టబద్ధను కల్పించుటకు అల్లిన సాలెగూడు. మన ప్రభుత్వం యీ సాలెగూడులో పడిపోయి సరిచేసుకోలేని "ఊబి"లో దిగిపోయింది. సామ్రాజ్యవాద వారసత్వ సాలిగూడు, కాలమే బయటవేయాలి. కరుణాకర గుప్తా పరిశోధనలో బ్రిటిష్ కుట్రలు ఫోర్జరీల కుటిలరాజనీతి వెల్లడైంది.

# 10

# భరతవాక్యం

ఏప్రిల్ 2000 సంవత్సరానికి భారత-చైనా దేశాలు రాయబార సంబంధాలను నెలకొల్పుకొని అర్ధ శతాబ్దము అగుతుంది. స్వర్ణోత్సవాలు జరుపుకొన్నాము, సమీక్ష చేసుకొని గుణపాఠాలు తీసుకొనుట యెంతో సముచితంగా వుంటుంది. ఈ రెండు దేశాల నాగరికత, సంస్కృతులు ప్రపంచంలో అత్యంత పురాతనమైనవి. వీటితో సమకాలీన పురాతన నాగరికత, సంస్కృతులు కలవిగా చెప్పుకొన తగినవి నైలు, యూఫ్రటీన్-టైగ్రెసు నదుల పరివాహక ప్రాంతాలైన ఈజిప్టు, ఇరాక్ దేశాలను పేర్కొనవలసి వుంటుంది. ఈ నాలుగుదేశాల అనేక శతాబ్దాల తరువాత పేర్కొనదగిన. మరో నాగరికత, సంస్కృతి కాంతులు విరజిమ్మిన దేశము గ్రీసుగా చెప్పవచ్చును.

స్వర్ణోత్సవం జరుపుకొన్న భారత-చైనా విదేశ సంబంధాలు అంత సంతృప్తి కరంగా లేవని చెప్పుకొనవలసి వుంటుంది. ఈ 50 సంవత్సరాలలో మూడవ వంతు కాలంలో మాత్రమే ద్వైపాక్షిక సంబంధాలు, సౌభాతృత్వం, స్నేహ పూర్వక మైత్రీ సంబంధాలుగ వున్నవి, రెండు వంతుల కాలంలో దురదృష్టాన్ని, విచారాన్ని, చేదు అనుభవాలను కలుగజేసినవిగా వున్నవి. సోవియట్ యూనియన్ తూర్పు యూరపు సోషలిస్టు దేశాల పతనానంతరం భారత్-చైనా రెండు దేశాలు ప్రపంచ "సూపర్" దేశంగా వున్న వొకే వొక అమెరికా రాజకీయ, ఆర్థిక ద్రవ్య వొత్తిడులకు లోను కావలసి వచ్చింది. భారత,చైనా ప్రజాసామాన్యం యీ రెండు దేశాలు అత్యంత సన్నిహిత స్నేహ, సౌభాతృత్వ సంబంధాలను (సమిష్టి ప్రయోజనాల కొరకు) కలిగి వుండవలసిన అవసరాన్ని స్పష్టం చేస్తున్నది. గత కొన్ని సంవత్సరాలుగ గల అనుభవాల నుండి భారత దేశం చైనాలు స్వానుభవంలో నుండి పాఠాలు నేర్చుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

భారత-చైనా సంబంధాలను గత 40 సంవత్సరాలు నిశితంగా పరిశీలించే వారికి సాంప్రదాయక సత్సంబంధాల నుండి వైదొలగినందున ఎత్తు పల్లాల గతుకుల మార్గంలో వివిధ దశలలో పురోగమనం, తిరోగమనంలకు లోనుగుటతో అన్ని విధాలైన అనుభవాలు నేర్పిన పాఠాలను మననం చేసుకొందాం.

## 1950 శైశవ దశకపు ప్రథమ భాగంలో పరస్పర సహకారం

భారతదేశం సోషలిస్టేతర దేశాలలో చైనాతో రాయబార సంబంధాలను పెట్టుకొన్న మొదటిదేశం. నూతన చైనా స్నేహ సౌభాత్వ్రత్వ సహకార సంబంధాలను పెట్టుకొనవలసిన దేశాలలో అత్యం ప్రాధాన్యతను భారత దేశానికి యిచ్చింది. భారత దేశం కూడా 1930 దశకం నుండి భారత జాతీయ కాంగ్రెసు ఫాసిస్టు జపాన్ చైనాపై చేస్తున్న దురాక్రమణను ఖండిచి. డా॥కోట్నిస్ నాయకత్వంలోని సహాయక వైద్య బృందాన్ని పంపిన విధానాన్నే కొనసాగించింది. సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో, తమతమ మార్గాలలో రెండు దేశాలు సంపూర్ణ స్వాతంత్ర్యానికై పోరాడుతున్న ఆరోజులలోనే అత్యంత సన్నిహిత పరస్పర సంబందాల అభివృద్ధికి కృషి చేశాయి. అదే విధానాన్ని తదనంతర కాలంలోనూ కొనసాగించాయి, కొరియా, తరువాత ఇండో-చైనాలలో శాంతియుత పరిస్థితులు నెలకొనుటకై నెహ్రూ భారత దేశం వహించిన పాత్ర చైనా మన్నన, ప్రశంశలను పొందింది.

ప్రపధమంగా టిబెట్ సమస్యపైనే చైనా 1950 ప్రారంభంలో ప్యూడలు బంధనాల నుండి టిబెట్‌ను విముక్తి చేయ మొదలిడుటతో అభిప్రాయ భేదాలు పొడచూపాయి. భారత దేశం, చైనా టిబెట్‌ను ఆ విధంగా విముక్తి చేయుటను హర్షించలేకపోయింది. ఈ సమస్య అదృష్ట వశాత్తు శాంతి సంభాషణల ద్వారానే చివరకు పరిష్కారమైంది. చైనా ప్రాంతమైన టిబెట్-భారత దేశాల మధ్య వ్యాపార సంబంధాల వొప్పందాన్ని భారత రిపబ్లికు, చైనా ప్రజారిపబ్లికులు ఏప్రిల్ 1954లో సంతకాలు చేసి పత్రాలు మార్పిడితో, భారత చైనా సంబంధాలు సరియైన మార్గంలో పడినవి. ఈ వొప్పందం భారత-చైనా స్నేహ సంబంధాలు అత్యున్నత దశకు చేరుకొనుటకు నాందియైంది.

## భారత-చైనా స్నేహ సహకారం సంబంధాల ప్రథమ వెల్లువ (1954-58)

1954 స్నేహ-సహకార వొప్పందంలోని మార్గదర్శిక సూత్రాలలో ఉదహరించబడిన శాంతియుత సహజీవన ఐదు సూత్రాలు, తదనంతరం "పంచశీల" గా ప్రసిద్ధికెక్కాయి. అవి భారత-చైనాల మధ్య స్నేహ సహకారాలు అత్యంత వేగంగా అభివృద్ధి చెందుటకు పునాది అయ్యాయి.

ప్రధాని నెహ్రూ ఆహ్వానంపై చైనా ప్రధాని చౌయెన్‌లై జూన్ 1954లో ఢిల్లీ సందర్శించినపుడు పౌరసన్మానము, ప్రజా సమావేశంలో అత్యంత సౌభాతృత్వ సుస్వాగతం పలికారు. ఉన్న నాలుగు రోజులు అత్యంత సన్నిహిత సంభాషణలు జరిపారు. ఇరువురూ ఆసియాలో, ప్రపంచంలో శాంతి, సురక్షణ తమతమ దేశాలలో ఆర్థిక పునర్నిర్మాణ పురోభివృద్ధికి కృషి చేద్దామనే కోరిక వెల్లడించారు. నైరుతి ఆసియాలో శాంతియుత సహజీవనం వ్యాప్తికి భారతదేశం చైనాలు సంయుక్తంగా 1954లో రూపొందించిన "పంచశీల సూత్రాలను" విస్తరింపజేసి తటస్థ శాంతి మండలాన్ని యేర్పాటు చేద్దామని పండిట్ నెహ్రూ ప్రధాని చౌయెన్‌లైకి సూచించారు. విదేశ సైనిక కేంద్రాలు లేని, యుద్ధభయం లేని,

విదేశ ప్రమేయం దురాక్రమణలు లేని శాంతి తటస్థ మండలంగా చిత్రించుకొన్నారు. నెహ్రూ నైరుతి ఆసియాలో సామ్రాజ్యవాదుల "సీటో" సైనిక కూటమి ఏర్పాటుకు "తటస్థ శాంతి మండల" ఏర్పాటు సరియైన సమాధానం కాగలదన్నారు.

నెహ్రూ అక్టోబరు 1954లో పెకింగు సందర్శించారు. ప్రజా చైనాను సందర్శించిన ప్రథమ విదేశ ప్రభుత్వ అధినేత అయ్యారు. బ్రహ్మాండమైన స్వాగతం, ప్రజాసన్మానం నెహ్రూకు లభించింది. అదే తదనంతర విదేశ ప్రభుత్వ అధినేతల స్వాగత సాంప్రదాయమైంది. ఏప్రిల్ 1955లో ఇండోనేసియాలో జరిగిన బాడుంగు సమావేశంలో భారత-చైనా సహకారం అత్యున్నత దశకు చేరింది. ఆఫ్రో-ఆసియా సౌభాతృత్వ సహకార ఐక్యతలకు వలసల స్వాతంత్రోద్యమాలకు అత్యంత బలాన్ని చేకూర్చింది. పశ్చిమ దేశాల రచయితలు భారత-చైనాల నూతన దంపతుల విహార యాత్ర (హనీమూన్)గా "స్వర్ణయుగంగా భారత రచయితలు "హిందీ-చినీ భాయి భాయి" దశగా భారతవిదేశాంగ విధానాన్ని పేర్కొన్నారు.

## టిబెట్‌లో సాయుధ తిరుగుబాటు భారత-చైనా సంబంధాల తిరోగమనం(1959)

భారత ప్రభుత్వం టిబెట్ సమస్యపై అనుసరించే విధానం భారత చైనా సంబంధాలుపై నిర్ణయాత్మక పాత్ర వహించుచున్నది. మెట్టమొదటగా 1950 ప్రారంభంలో తదుపరి 1950 దశకపు మధ్య దలైలామా, టిబెట్ లామాలో ప్రోద్భలంతో భారత దేశంలోనే వుండ నిశ్చయించుటతో భారతదేశం టిబెట్‌లో పరోక్షంగా కలగ జేసుకొన్నట్లు కన్పడుతున్నది. అదే బాహ్య ప్రపంచానికి వెల్లడైంది. అనుమానాలను కలుగజేస్తున్నది. నెహ్రూ 1959లో టిబెట్ తిరుగుబాటుకు విచారాన్ని వెలిబుచ్చుటయే గాక టిబెట్‌లో అరాచక అనిశ్చిత పరిస్థితులను పరిష్కారం కొరకు సాయుధ ప్రయేయం పెట్టుకొనుట నేరంగా పేర్కొన్నారు. టిబెట్‌ను స్వపరిపాలన గల దేశంగా పేర్కొన్నారు. కేంద్ర చైనా టిబెట్ సార్వభౌమాధికారం కలిగియుండునదిగా స్పష్టం చేయలేదని చైనా విమర్శగా వుంది. గత 40 సంవత్సరాలుగ టిబెట్ ప్రభుత్వాధికారులు కాందిశీకులుగా భారతదేశంలో వున్నారు. దలైలామా వారికి నాయకుడుగా వున్నారు. భారత ప్రభుత్వం అనేకసారులు దలైలామా మత నాయకుడుగానే యీ దేశంలో వున్నాడని ప్రకటించింది.

## బహిరంగ సరిహద్దు వివాదం సరిహద్దు యుద్ధం (1959-62)

సుధీర్ఘమైన సరిహద్దు పొరుగు దేశాలతో వుండి చట్ట బద్ధంగా సరిహద్దు రేఖగా గుర్తించబడనంత కాలం సరిహద్దు వివాదాలు సహజము. ఇట్టి సహజ సమస్యలు ప్రశాంతంగా, చక్కగా పరస్పర అవగాహన యిచ్చి పుచ్చుకొనే శాంతియుత సంప్రదింపుల ద్వారానే పరిష్కరించబడగలవు. అంచేతనే, సరిహద్దు సమస్యలు రెండు దేశాల మధ్య తీవ్ర సమస్యలుగా రూపొందవు. భారత చైనా ప్రభుత్వాలు అనుసరించిన విధానాల వలనన సరిహద్దు సమస్య విస్ఫోటకమైంది. అసలు సరిహద్దు సమస్య లేదంటూ భారత

ప్రభుత్వం సంప్రదింపులు ద్వారా పరిష్కరింపబడుటను వ్యతిరేకించింది. తూర్పు ప్రాంతంలో మెక్‌మాహన్ లైను చట్టబద్ధ సరిహద్దు అని వివాదగ్రస్థ ప్రాంతాలను చైనా దురాక్రమణ చేసిందని దూషించ నారంభించింది. అంతేకాదు అప్పుడే భారత ప్రభుత్వం "ముందడుగు సైనిక వ్యూహాన్ని అనుసరించుట చైనా ఆత్మరక్షణ పేరుతో ప్రతిస్పందించుటతో 1962 భారత-చైనా సరిహద్దు యుద్ధంగా రూపొందింది.

## ద్వైపాక్షిక సంబంధాలు బహుముఖంగా దిగజారుట

జులై 1961లో సరిహద్దు యుద్ధం ప్రారంభం కాకముందే పెకింగు నుండి మన భారత రాయబారి వెనుకకు పిలువబడ్డారు. సంవత్సరం తరువాత ఢిల్లీలోని చైనా రాయబారి వెళ్ళిపోయారు. ఏప్రియల్ 1962 నుండి ప్రఖ్యాత 1959 వొప్పందంతో ప్రారంభమైన సరిహద్దు ద్వారా జరిగే వ్యాపారానికి స్వస్తి చెప్పబడింది. డిశెంబరు 1962లో టిబెట్ రాజధాని లాసా నగరం చైనా ప్రధానరేవు పట్టణం షాంగ్ హై నుండి మన కలకత్తా, బొంబాయిల నుండి చైనా కాన్సలేట్ జనరల్స్ ఉపసంహరించుకొనబడ్డారు. ఆ చేదు జ్ఞాపకాల సంవత్సరాలలో సిన్హువా ఏజన్సీ వార్తా విలేఖరి మన దేశం విడిచి వెళ్ళాలని ఆజ్ఞలు జారీ అయినవి, చైనా సాహిత్యం నిషేధించబడింది. భారత దేశ అధికారులు కలకత్తా, బొంబాయిలలోని చైనా బ్యాంక్ ఆస్తులను స్వాధీనం చేసుకొన్నారు, మన దేశంలో వున్న చైనా పౌరులు యిబ్బందులకు గురిచేయబడ్డారు, ఇదే క్రమంలో చైనాలోని భారత ఆస్తులు, పౌరుల యెడల ప్రతిచర్య తీసుకొనబడి రెండు దేశాల మధ్యగల రాయబార, వ్యాపార, పౌర సంబంధాలు పరస్పరం దిగజారిపోయాయి. ఈ విధంగా భారత,చైనాల మధ్యగల అన్ని సంబంధాలు ఘనీభవించిపోయాయి.

## సాధారణ పరిస్థితులు యేర్పడుటకు సుదీర్ఘక్రమం(1969-1976).

సాధారణ రాయబార సంబంధాలు నెలకొనుట అంటే పరస్పరం రాయబారులను మార్పిడి చేసుకొనుటే గీటురాయి అయితే 15సంవత్సరాలు భారత-చైనా సంబంధాలు ఘనీభవించియుండుట అసాధారణ విషయం, భారతవిదేశాంగ శాఖకార్యదర్శి, తిరిగి భారతదేశరాయబారిని పంపేవిషయమై వ్రప్రధమ సూచనను 12 నవంబరు 1969లో చేసారు. ఏమైనా తిరిగి భారత రాయబారి జులై1976లోనే పెకింగుకు వెళ్ళారు. ఈ నిర్ణయం తీసుకొనుటకు, అమలు జరుగుటకు అనూహ్యంగా యింతకాలం యెందుకు పట్టిందో తెలియదు. ప్రధానంగా మూడు కారణాలను చెప్పుకొనవచ్చు. ప్రధమంగా, భారతప్రభుత్వం ధైర్యంగా, యీభాధ్యతా యుతచర్య చేబట్టుటకు బలమైన కోర్కెలేదు. జున్ 1974లో కూడ చైనా వైఖరిపై భారత-చైనా సంబంధాల భవిష్యత్తు ఆధారపడి వుంచని , భారత ప్రధాని ఇందిరాగాంధి నొక్కిచెప్పింది. రెండవ అంశం, దక్షిణ ఆసియాలో రూపొందిన వివిధ ఘటనలు, రెండుదేశాల సంబంధాలలో సాధారణ పరిస్థితులు యేర్పడుటకు పరిమితులను కలిగించాయి. చివరి అంశంగా, భారత బురాక్రటిక్ అధికార వర్గం అనవసరంగా అత్యధిక

జాగ్రత్తవహించుతు, కాలయాపన చేస్తూ అత్యున్నత రాజకీయ అధికార నిర్ణయాలకు ఎదురు చూస్తున్నది.

## సరిహద్దు సమస్య ప్రధాన అడ్డుగోడుగా వుంది (1976-88)

డిశెంబరు 1981లో విదేశాంగ సహాయమంత్రుల స్థాయిలో భారత, చైనాదేశాలు తరచు సంభాషణలు, సంప్రదింపుల కొరకు వొకయాంత్రాంగాన్ని రుపొందించాయి. నవంబరు 1987 వరకు ఎనిమిది విడతల పరస్పర అభాప్రాయాలను మార్పిడి జరిగింది. సరిహద్దు సమస్యలేగాక వ్యాపారం, శాస్త్రసాంకేతిక, సాంస్కృతిక పరస్పర మార్పిడి, అభిప్రాయాల మార్పిడి, వివిధ రంగాలలో సహకారం, అంతర్జాతీయ, పరిస్థితులు, సంబంధాలపై అభిప్రాయాల మార్పిడిపై, నెమ్మదిగా, స్థిరంగా పరస్పర చర్యలు జరుపుతునే వున్నారు. అయినా ద్వైపాక్షిక సంబంధాలలో అనుకొన్నంత అభివృద్ధికానరాదు. ప్రధాన అడ్డుగోడ సరిహద్దు సమస్యగా వుంది. సరిహద్దు సమస్య అత్యంత క్లిష్టసమస్య అయినందున అంత త్వరంగా పరిష్కారంకాదు. అంచేత, భారత చైనా స్నేహ, సహకార సంబంధాలు, యితర రంగాలలో సహకార సంబంధాలు అభివృద్ధిచెందితే, సరిహద్దు సమస్య అంత్య పరిష్కారానికి అనుకూలమైన వాతావరణం యేర్పడుతుంది. సరిహద్దు సమస్య పరిష్కారం కానంత వరకు యితర రంగాలలో గణనీయమైన అభివృద్ధి జరుగదని నొక్కిచెప్పుతున్నది. అంచేతనే, అత్యున్నస్థాయిలో అధికారవర్గాలరాక పోకడలు సాధ్యంకాలేదు.

## ప్రధాని రాజీవ్‌గాంధి చైనా సందర్శన ప్రతిష్టంభనను సరళం చేయుట (1988-1998)

ప్రధాని రాజీవ్‌గాంధి చైనా అధికార సందర్శన డిశెంబరు 1988లో జరిగింది. చైనాను 34సంవత్సరాల తరువాత సందర్శించిన మొట్టమొదటి భారత ప్రధాని రాజీవ్ గాంధి. భారత ప్రభుత్వ అత్యున్నత ఉద్యోగులు స్వయంగా చైనా ప్రయాణాలకు విధించుకున్న ఆంక్షకంటే రాజీవ్‌గాంధి సందర్శన ప్రత్యేకతను సంతరించుకొన్నది. ఈ సందర్శన భారత-చైనా సంబంధాలలో వొకనూతన శకానికి నాంది అయింది అంచేత, వొక దశకంలో భారత-చైనా ద్వైపాక్షిక సంబంధాలు నెమ్మదిగా, నిలకడగా అభివృద్ధి చెందాయి.

ఈదశాబ్దంలో ప్రధాన విజయాలు మొదటిది, అత్యున్నస్థాయిలో పరస్పర దేశాల సందర్శన ప్రధాన విజయం అందులో ప్రధానమైనవి, ప్రధాని నరసింహరావు చైనా సందర్శన 1993 లోను, చైనా అధ్యక్షుడు జియాంగ్ జెమిన్ 1996 లో భారత సందర్శనలో పరస్పర విశ్వాసం పునర్నిర్మాణానికై వాస్తవాధీన సరిహద్దు రేఖ ప్రాంతాలలో శాంతి నిశ్చింతల పరిరక్షణను కాపాడుటకై వొప్పందంపై సంతకాలు చేయుట గణనీయమైన విజయం, రెండవది వ్యాపారం పరస్పర ఆర్థిక, సహకార సత్వరాభివృద్ధి. చైనా 1977లో నేరుగా భారత దేశంతో వ్యాపారాన్ని ప్రారంభించింది. ద్వైపాక్షిక వ్యాపారం 1988లో 246 మిలియన్ల డాలర్లుగా ఉంది. ఇది ఒక్క1998లోనే 2బిలియను డాలర్లు అభివృద్ధి పెరుగుటను తెలియజేస్తున్నది.

## భారతదేశ అణుపరీక్షలతో రెండు దేశాల మధ్యసంబంధాలు క్షీణించుట (మే1998).

రాజస్థాన్ ఎడారి పోఖ్రాన్‌లో మే 1998లో భారత ప్రభుత్వం రెండువసారి అణుపరీక్షలు భూగర్భంలో జరిపింది. ప్రధాని ఎ.బి. వాజ్‌పేయి జి.8.రాజ్యాల నేతలకు రహస్యలేఖను వ్రాయుట జరిగింది. అందులో చైనా భారతదేశానికి అణుశక్తిగల శతృదేశంగా పేర్కొనుట జరిగింది. అందుకు 1962లో భారతదేశంపై సాయుధ దురాక్రమణకు వొడిగట్టినట్లు పేర్కొన్నారు. అదేకాలంలో భారత రక్షణశాఖ మంత్రి జార్జిఫెర్నాండెస్ బహిరంగంగా, చైనా అణబాంబులు గల శతృవుగా పేర్కొన్నారు. ఇది ద్వైపాక్షిక సంబంధాలలో తీవ్ర ప్రభావాన్ని చూపింది.

పెకింగుకు జున్ 1999లో భారత విదేశాంగ మంత్రి సందర్శించి, చైనా విదేశాంగ మంత్రితో సంభాషణలు కొనసాగించుటతో ద్వైపాక్షిక సంబంధాలలో కొంత సుముఖ అభివృద్ధి జరిగినట్లు కన్పడుతున్నది. భారత చైనా దేశాలు రెండూ ఒకరినొకరు శతృవుగా, ప్రమాదకారులుగా తలచుటలేదని చైనా విదేశాంగమంత్రి టాంగ్ జియాక్సువాన్ మన విదేశాంగమంత్రి జస్వంత్‌సింగ్‌లు పరస్పరం స్పష్టంచేసుకొన్నట్లు తెలుస్తోంది. పంచశీల సూత్రాలు, శాంతియుత సహజీవనం పునాదిగా చేపట్టాలని తలచుచున్నట్లు కన్పపడుతున్నది.

కోసావో సమస్యపై చైనా ప్రధాని జూరాగ్జితో జరిగి సంబాషణలలో అభిప్రాయాల సారూప్యతతోపాటు, జస్వంతసింగ్ పంచశీల సూత్రాలకు కట్టుబడి వుండవలసిన ప్రత్యేక ప్రాముఖ్యత, నేటి అంతర్జాతీయ పరిస్థితులలో శాంతియుత సహజీవనానికి కట్టుబడివుడవలసిన అవసరాన్ని చెప్పి. తాము పంచశీల సూత్రాలకు కట్టుబడి వుండగలమని వాగ్ధానం యిచ్చినట్లు తెలుస్తున్నది. అంతేగాక ద్వైపాక్షిక సంబంధాలను మెరుగు పరచుకొనుటకు తాము శ్రద్ధతో వున్నామని మన విదేశాంగమంత్రి చైనా ప్రధానికి తెలియ జేయుటయేగాక, అది పంచశీల సూత్రాలపై ఆధారపడి వుండాలని స్పష్టంచేసారు. నేడు మళ్ళీ కొత్త భారత ప్రభుత్వం ఎన్నికల అనంతరం యేర్పడింది. అయితే ఎక్కువ మంది పాత ప్రభుత్వంలోని మంత్రులే కొనసాగుతుండుటతో, అవే విధానాలు కొనసాగగలవలమని ఆశించవచ్చును.

భారత-చైనా ద్వైవపాక్షిక సంబంధాల 50 సంవత్సరాల యీ విహంగ వీక్షణ సమీక్ష యీ క్రింది నిర్ణయాలకు దారి తీస్తున్నది.[1]

1) స్నేహ, సహకార, సౌఖాత్వత్వ సంబంధాలు భారత, చైనా రెండు దేశాలకు ముఖ్యంగా శీతల యుద్ధానంతర కాలంలో ప్రాముఖ్యత వహించాయి. దాని ప్రాముఖ్యత అతిగా అంచెనా వేయరాదు.

2) అట్టి సంబంధాలు అంభివృద్ధిచేయుట అంత తేలిక విషయంకాదు. అప్పుడప్పుడు

---

*1. ఎజెన్ జియా (2000) లెసెన్స్ ప్రంది పాస్ట్. ఫ్రంట్‌లైన్. జనవరి 7,2000 ఈ రచనలోని అనేక విషయాల స్పూర్తితోనే యీ భరత వాక్యం, రూపుదిద్దుకొంది.*

అత్యంత క్లిష్టమైనవి. మనం పూర్తిగా మనఃపూర్వకంగా సిద్ధపడివుండాలి.

3) పొరుగు పెద్ద దేశాలతో వ్యవహరించునపుడు అత్యంత ఆశ, నిరాశలతో వుండరాదు. అతి ఆశావివశులమై వుంటే నిరాశలో మునిగి పోవలసిరావచ్చు, అలాగని నిరాశా వాదులమైవుంటే వున్న అవకాశాలనే వినియోగించుటలో విఫలులమగుతాము. అత్యంత రాకెట్ వేగంతో పయనించే ప్రపంచంలో వెనుకబడి పోతాము.

4) మనం చైనాను శక్తివంతమైన అగ్రరాజ్యంగా గుర్తించాలి. అదేవిధంగా చైనా భారతదేశాన్ని శక్తివంతమైనది అగుతున్న అగ్రరాజ్యంగా గుర్తించాలి. మనం చైనా రక్షణ అవసరాలను, అదేవిధంగా చైనా మన రక్షణ అవసరాలను అనగా పరస్పరం గుర్తించాలి. గౌరవించాలి. అట్లుగాక ఒకరి హేతురహిత డిమాండ్లను మరొకరకు సహజంగానే అదే వైఖరి చేబట్టితే సంఘర్షణ వాతావరణమే మిగులుతుంది. చరిత్ర శాంతియుత సహజీవనం మన ముందుంచింది. మరోమార్గంలేదు. పంచశీలసూత్రాలే వెలుగును ప్రసాదించగలవు.

5) ఇటీవలకాలంలో పరస్పరం భారత, చైనా ద్వైపాక్షిక సంబంధాలు అభివృద్ధి పథంలో పురోగమించి, చిక్కుపడిన సరిహద్దు సమస్య కూడ యిచ్చి, పుచ్చుకొను పరస్పర అవగాహనతో, వొప్పందంద్వారా పరిష్కారమై, నూతన శతాబ్దంలో భారత, చైనాలు రెండు తమ పూర్వ చారిత్రిక ఔన్నత్యాన్ని పొందగలవని ఆశించుదాము, ఇది ఏకధ్రువప్రపంచ పోకడను నూతన మార్గం పట్టించగలదు.

-సమాప్తం-